ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org

సంపుటి 1 | సంచిక 3 ఏప్రిల్-జూన్, 2021





ప్రకాశిక

## బహుముఖ ప్రతిభారత్నం

### పి.వి. నరసింహారావు

• కర్మ యోగి • నాయకుడు • రాజకీయ వేత్త
• తత్వవేత్త • కవి • రచయిత • మహామంత్రి • సాహితీవేత్త

మమత-సమత-మానవత
www.gurajada.org

# ఆధునిక తెలుగుకు ఆద్యుడు



కీ.శే. గురజాడ వేంకట అప్పారావు

editor@prakasika.org

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి “మనస్వినీయం” అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి , మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం,

నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.

## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు



గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని

ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటయాభైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా

పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శి గా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 – 10 మధ్య తిరుమల

తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.

## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు



దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు. అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలిసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.






# కరోనా కలవరం

కరోనా ప్రపంచాన్ని శాసించడం మొదలయి సుమారు ఒకటిన్నర సంవత్సరాలు అవుతోంది. సద్దుమణిగింది, మహమ్మారిని జయించాం అని ఊపిరి పీల్చుకునే లోపే భారత దేశంలో రెండవ తరంగం మరింత ఉధృతంగా వచ్చి పడింది. దానికి తోడు నిరంతరం మారుతూ ఒకరి నుంచి ఇంకొకరికి వేగంగా, సులువుగా సోకగల కరోనా రూపాలు విస్తృతంగా విస్తరించాయి. కరోనా వ్యాప్తి, నియంత్రణ అన్న అంశం ఒక Case Study గా పరిశోధించ తగ్గ అంశం.

అగ్రరాజ్యంలో ట్రంప్ ప్రభుత్వం ఉన్నప్పుడు కరోనా ఉనికినే నమ్మక, వ్యాధి నిరోధక పద్ధతులని పాటించనవసరం లేదనే ప్రచారం జరిగింది. దాంతో కరోనా వ్యాధి దేశమంతటా వ్యాపించి, ఎంతో మందికి సోకడంతో పాటు కొన్ని వేలమంది ప్రాణాలు తీసింది. ప్రభుత్వం మారడంతో, కరోనాని కట్టడి చేయడం, నయం చేయడం అన్న అంశాల మీద ప్రభుత్వ దృక్పథం మారడంతో దేశంలో పరిస్థితి మారింది. కరోనా టీకాలు అందుబాటులోకి రావడంతో పరిస్థితి ఆశాజనకంగా మారింది. కానీ శాస్త్రీయ దృక్పథం లేని వారూ, వైజ్ఞానిక ఆవిష్కరణలని నమ్మని ప్రజలు దేశంలో 40 శాతానికి పైబడి ఉండడంతో కరోనా కట్టడి, నిర్మూలన అంత సులువు కాదు. ఇక్కడే కొత్త నాయకుడి ప్రతిభ కనపడింది. ప్రజలకి నమ్మకం కలిగేలా మాట్లాడడం, చెప్పిన మాటలు నీటి మూటలు కావని చేతల ద్వారా నిరూపించడం, బాధితుల పట్ల సానుభూతి పూర్వక ధోరణి అవలంభించడం లాంటి మౌలిక నాయకత్వ లక్షణాలున్న దేశాధినేత పరిస్థితిని సానుకూలంగా మార్చే దిశలో అడుగులు వేసాడు. విపక్షాల సహకారాన్ని భేషజం లేకుండా అభ్యర్థించాడు. టీకా కొనుగోలు వితరణ వ్యవస్థని కేంద్రీకృతం చేసి రాష్ట్రాలకి భారం లేకుండా చేశాడు.

భారత దేశంలో రెండవ తరంగం దేశ ప్రజల జీవితాలని ప్రగాఢంగా ప్రభావితం చేస్తోంది. ఆక్సిజన్ కొరత, అర కొర టీకా అందుబాటు మరియు సరఫరా కరోనా నివారణకి అవరోధంగా ఉన్నాయి. వంద కోట్ల జనాభాకి అవసరమయిన టీకా సేకరణ ఏర్పాట్లు జరిగినట్లు లేదు. పైపెచ్చు ఉన్న వాటిని దానం కూడా చేశారు. టీకా కొనుగోలు, వినియోగ బాధ్యత వంటి భారం రాష్ట్రాలపై నెట్టడంతో మరింత గందరగోళం నెలకొంది. టీకాల సంగతి ఇలా ఉంటే, వ్యాధిగ్రస్తుల చికిత్సకి కనీస అవసరమైన ఆక్సిజన్ కొరతతో ఎంతోమంది నిష్కారణంగా చనిపోతున్నారు. చనిపోయిన వారి అంత్యక్రియలకి కూడా సామాన్య ప్రజలు ఇక్కట్లు పడుతున్నారు. చేసేదేమీ లేకనో, ఏదో నమ్మకంతోనో మృతదేహాలని నదులలోకి తోసేస్తోంటే, కలుషిత జలం వేరే సమస్యలు తెచ్చే ముప్పు ఉంది. కట్టడి, నివారణకి ఒక సమగ్ర విధానం లేకపోవడంతో సమస్య మరింత జటిలంగా మారుతోంది. లక్షలాది జనంతో ఎన్నికల సభలు, కుంభమేళాలు నిర్వహించడం పాలకుల బాధ్యతారాహిత్యాన్ని, నాయకత్వ దివాలాతనాన్ని తెలియచేస్తున్నాయి.

కరోనాతో ప్రజలు అనేక ఇబ్బందులు పడుతూ పక్షుల్లా రాలిపోతూంటే సందట్లో సడేమియా అన్నట్లు కులాల కుంపటి, రాజకీయ రచ్చలు తెలుగు రాష్ట్రాలలో కరోనాని మించి కలకలం లేపుతున్నాయి. అసలు సమస్య నుంచి ప్రజల దృష్టి మళ్లించేందుకు పాలకులు చేస్తున్న ప్రహసనం అయినా కాకున్నా ఇది హేయమైన, గర్హించదగ్గ విషయం. సాంత్వననిచ్చే సానుభూతి మాటలు మాట్లాడే సంస్కారం కూడా లేని పాలకులు రాష్ట్రాలలోనూ, కేంద్రంలోనూ ఉండడం దురదృష్టకరం. దేశం ఎదుర్కుంటున్న విపత్కర పరిస్థితులలో అన్ని పక్షాల వారినీ కలుపుకుని సమస్య పరిష్కారానికి సమష్టి కృషి చేయడం మాని ఒంటెత్తు పోకడలు, హేయమైన భేషజాలతో కాలం గడిపే పాలకులు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ ఉండడం దేశానికి పట్టిన కరోనాని మించిన జాడ్యం. విపక్షాలను శత్రువులుగా చూస్తూ అవహేళన చేసే విష సంస్కృతి కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ మారితే తప్ప సంఘటితంగా కరోనాతో పోరాటం జరపడం అసాధ్యం. ముఖ్యంగా, మితిమీరిన వ్యక్తి ఆరాధన జాతి పురోగతికి గొడ్డలిపెట్టు. ఆసక్తికరమైన విషయమేమంటే, అగ్రరాజ్యంలో కూడా సంప్రదాయవాద రాజకీయ పక్షం వ్యక్తి పూజకి అలవాటు పడడంతో దేశ సమగ్రతకే ముప్పు వాటిల్లే ప్రమాదం తలెత్తుతోంది.

కరోనా సోకిన, కరోనాతో మరణించిన వారు మనలో చాలా మందికి తెలుసు. ఈ ప్రాపంచిక విపత్తు మనుషులలో మంచిని, మానవతని పెంచి, స్వంత లాభం కొంత మాని విస్తృత సమాజ శ్రేయస్సుకి పాటుపడేలా ప్రేరణ కలిగిస్తుందని ఆశిద్దాం.

క్లిష్ట పరిస్థితులలో చూపించ వలసిన నాయకత్వ లక్షణాలు పి. వి. నరసింహారావు గారి జీవితంనుంచి ఎన్నో నేర్చుకోవచ్చు. అదే భారత పాలకులు ఆయనకి ఇవ్వదగ్గ నిజమైన నివాళి.



**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు

# ముఖచిత్రం

పి.వి. నరసింహారావు




# లోపల

# నవ యుగ సమారంభమే ఉగాది !!!



శ్రీమతి రవీణ చవాన్, పూణే
✆ 99229 27527

హిందువులు జరుపుకునే పండుగలైనా, పాటించే ఆచార వ్యవహారాలైనా, శాస్త్ర ప్రధానంగా ప్రాముఖ్యత కలిగి ఉంటాయి. ఉగాది పండుగ వెనుక శాస్త్రీయ కారణాలు కూడా అనేకం.

యుగానికి ఆది ఉగాది.. శాలివాహన శకం సరిగ్గా ఉగాది నాడే మొదలయ్యింది. సృష్టి కర్త బ్రహ్మ కూడా విశ్వాన్ని ఇదే రోజున సృష్టించాడు అని బ్రహ్మపురాణంలో ఉంది. పద్నాలుగేళ్ల వనవాసం తరువాత శ్రీ రాముడి పట్టాభిషేకం కూడా ఇదే రోజున జరిగిందని, ఉత్తరాదిన విజయోత్సవంగా ఈరోజును జరుపుకుంటారు.

ఏది ఏమైనా మన పండుగలన్నీ ప్రకృతిలో జరిగే మార్పుని అనుసరించే ఉన్నాయి. మన దేశంలో చాంద్రాయనాన్ని బట్టి కాలచక్రం పాటిస్తాము. ఉగాది కూడా చంద్ర భ్రమణాన్ని బట్టి చైత్ర శుద్ధ పాడ్యమి నాడు జరుపుకుంటూ వస్తున్నాము. పంటలు చేతికి వచ్చి ఇంటిల్లిపాదిని సంతోషపెట్టిన సంక్రాతి పండుగ ముగిసాకా మన రైతులు కొత్త పంటలకి శ్రీకారం చుడతారు. మాగాణులన్నీ మళ్ళీ గర్భం ధరించడానికి సిద్ధమవుతాయి. రబీ పంటలు ఈ కాలంలో వేయటానికి కారణం వాతావరణం అందుకు అనుకూలంగా ఉండటమే. ఈ సమయంలో చలికాలం వెళ్ళిపోయి వేసవికి సన్నద్ధం అవుతుంది. అయితే కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఈ స్థితిగతులు ఉంటాయి. ఏ ప్రాంతంలో అయితే ఈ స్థితిగతులు వుంటాయో ఆ ప్రాంతాలన్నీ కూడా ఉగాది మహోత్సవాన్ని వివిధ రకాలుగా వివిధ పద్ధతులలో జరుపుకుంటారు, మన తెలుగువారు 'ఉగాది' పేరుతో, కన్నడీగులు 'యుగాది'గా, మరాఠీలు 'గుడి పడ్వా'గా, అస్సామీలు 'బిహు'గా కేరళీయులు 'విషు'గా జరుపుకుంటారు.

**ఉగాది పంచాంగం:** చాంద్రమానాన్ని బట్టి మన భూ భ్రమణం చైత్ర శుద్ధ పాడ్యమినాడు మొదలవుతాయి అంటే మళ్ళీ నక్షత్రాలు ఆ రోజున ఒక సంవత్సరం తరువాత యధాస్థితికి చేరుకొని, వాటి ప్రయాణాన్నీ మళ్ళీ సంవత్సరంపాటు కొనసాగిస్తుంటాయి. అయితే ఆ భ్రమణ సందర్భంలో వాతావరణంలో కొన్ని మార్పులు జరుగుతాయి. వాతావరణంలో మార్పులని, మనుషుల మానసిక స్థితిగతులని అంచనా వేసే ప్రక్రియ పంచాంగం. పంచాంగంలో చెప్పినవన్నీ నిజమవుతాయా అంటే మనుషుల స్థితిగతులు మినహాయించి అంచనాలు అన్నీ దాదాపుగా నిజమవుతాయనే చెప్పవచ్చు. మన రాశి యొక్క వాసిని పంచాంగంలో ఉన్నట్టుగానే ఉంటుందా అని మనం ప్రశ్నించుకుంటే, పంచాంగం ఒక సాధారణ విశ్లేషణ. మన మనః స్థితి, పరిస్థితులు, మనం పెరిగిన వాతావరణం, తీసుకునే నిర్ణయాలను బట్టి మన భవిష్యత్తు ఉంటుంది. పంచాంగం ఒక హెచ్చరికగానో, ఒక అప్రమత్తతగానో పాటించడంలో తప్పు లేదు. పాడిపంటలకు పంచాంగంలో ఇచ్చే సూచనలు పాటించడంలో తప్పు లేదు. ఆదాయ, వ్యయాలు ఈ విధంగా ఉంటాయి అని పంచాంగంలో చెబితే, ఆచి తూచి ఖర్చులు చేయడం, ఆర్థికాభివృద్ధికి కృషి చేయడం మన మంచికే కదా.

**ఉగాది పచ్చడి:** షడ్రుచుల ఉగాది పచ్చడి ఆయుర్వేద ఔషధం నిండు వేసవిని, మారుతున్న వాతావరణాన్ని, ఈ సమయంలో వచ్చే ఎన్నో వ్యాధులకు దివ్య ఔషధం ఉగాది పచ్చడి. ప్లేగ్, కరోనా, స్వైన్ ఫ్లూ వంటి వ్యాధులు ఏవి చూసినా ఉగాది ముందు వచ్చినవే. వేప - ఆంటీ బాక్టీరియల్, ఏంటీ వైరల్ ఔషధంగా పరిగణించవచ్చు. అందుకే మనం వేప పువ్వును ఉగాది పచ్చడిలో వేస్తాము. మామిడిలో, కొత్తగా పండిన చింతపండులో విటమిన్ 'సి' అధికంగా ఉండి వ్యాధి నిరోధక గుణాన్ని కలిగి ఉంటాయి. అందుకే షడ్రుచుల ఉగాది పచ్చడి అత్యంత ప్రాశస్త్యం కలిగి ఉంది.

**మరాఠీల "గుడి పడ్వా":** కర్రకి కలశాన్ని తలక్రిందులుగా తగిలించి, ఆ కర్రకి పట్టువస్త్రాలని తొడిగి మామిడి తోరణాలు, వేపాకులు, చెక్కెర చిలుకల మాల, పూలమాలతో అలంకరించి "గుడి" పేరుతో లక్ష్మి దేవిలా కొందరు పూజిస్తే, అది విజయకేతనంగా ప్రతి గడపలో నిలిపి కొందరు ఆచరిస్తారు. ఈ విజయకేతనం శాలివాహన విజయకేతనంగా కొందరు, శ్రీరామ పట్టాభిషేక మహోత్సవంగా కూడా కొందరు నమ్ముతారు. యుగారంభ శుభసూచిక అయిన బ్రహ్మధ్వజ ప్రతిష్టాపన అని కూడా కొందరు నమ్ముతారు.

**కేరళీయుల "విషు":** దాదాపుగా ఇదే సమయం లో అంటే ప్రతి సంవత్సరం ఏప్రిల్ 14న కేరళీయులు ఉగాది పండుగని 'విషు' గా జరుపుకుంటారు. వారికి కూడా ఇది నూతన సంవత్సరమే. ఇంటి యజమానురాలు పంచలోహాల పళ్లెంలో కొత్త ధాన్యాలు, బాదం జీడిపప్పు, మామిడికాయ, పనసకాయ, బంగారం, వెండి... వంటివన్నీ అమర్చి పొద్దున్న లేవగానే ఇంటిల్లిపాదికి అద్దంలో ఈ పళ్లెం ని చూపిస్తారు. అది వచ్చే సంవత్సరానికి శుభసూచకంగా వారు భావిస్తారు.

**పంజాబీల "బైసాఖి":** అదే సమయంలో సూర్య భ్రమణాన్ని అనుసరించి వైశాఖ మాస ఆరంభాన్ని పురస్కరించుకొని "బైసాఖి" పండుగను నూతన సంవత్సరంగా పంజాబీలు జరుపుకుంటారు. భారతదేశంలో 'ఉ'తో అన్నమయ్యే గోధుమలు, వారి ఆవాలు వంటి ఎన్నో పంటలు పంజాబ్ రాష్ట్రం నుండే వస్తాయి. ఈ వైశాఖ సమయంలో పంటలు చేతికి రావడం, వారికి సంపదలు కూడా ఆ సమయంలో ఎక్కువగా ఉండటంతో ప్రతి సంవత్సరం ఏప్రిల్ 13, 14 తేదీల్లో 'బైసాఖి'ని మహోత్సవంగా జరుపుకుంటారు. దక్షిణ భారత దేశంలో సంక్రాంతి పండుగ జరుపుకున్నంత సంబరంగా పంజాబీయులు 'బైసాఖీ'ని జరుపుకుంటారు. ఆడవాళ్లు ఊయలలు ఊగుతారు. మగవారు ఎడ్లబండ్లలపై పరివారాన్ని ఊరేగింపుగా చుట్టూ తిప్పుతారు. గురుద్వార్ లో ప్రత్యేక ప్రవచనాలు గుర్బానీలు ఉంటాయి. ఇదే రోజున సిక్కుల మత గురువైన గురు గోబింద్ సింగ్ 10వ గురువుగా నియమితులయ్యారు.

**సింధీల "చెటీ చాంద్":** చైత్రమాస పంటలు చేతికొచ్చే ఈరోజును చంద్రభ్రమణాన్ని అనుసరించి భారతదేశంలో సింధీలు 'చెటీ చాంద్' ను నూతన సంవత్సరంగా జరుపుకుంటారు. ఒకప్పుడు సింధీలు ఇప్పటి పాకిస్తాన్లో సింధ్ రాజ్య వాస్తవ్యులు. ఒకానొకప్పుడు ఓకే ముస్లిం రాజు సింధీలను ముస్లిం మతం స్వీకరించమని ఇబ్బంది పెడుతున్నప్పుడు, సింధీలు వరుణ దేవుణ్ణి రక్షించమని వేడుకున్నారు. వరుణ దేవుడు, ఒక ముసలి వాని రూపంలో వచ్చి ముస్లిం రాజుకు అన్ని మతాలూ ఒక్కటే అని హితబోధ చేసాడు. ఆ ముస్లిం రాజు అప్పటినుండి సింధీయులని వేధించడం మానుకున్నాడు. ఆ వరుణదేవుని రూపాన్నే ఝులెలాల్ అన్న పేరుతో సింధీయులు కొలుస్తుంటారు. పంజాబీయుల మాదిరే సింధీయులు కూడా సంబరాలని జరుపుకుంటారు. నది దగ్గర ఝులెలాల్ ఫోటో పెట్టి, కొబ్బరికాయ, మిఠాయి, పూలు సమర్పించుకుంటారు.

**మిగితా రాష్ట్రాలలో:** తమిళనాడులో 'పుతండు'గా, 'జుర్ సీతల్'గా బీహార్ లో సూర్య భ్రమణాన్ని అనుసరించి, విక్రమశకంగా ఉత్తర భారతదేశంలో జరుపుకుంటూ ఉంటారు.

**కరోనా కాలంలో ఉగాది:** 2020 సంవత్సరంలో సరిగ్గా ఉగాది సమయంలో... అంటే ప్రకృతిలో షష్ఠ గ్రహ కూటమి ఏర్పడినపుడు కరోనా మహమ్మారి భూతలంలో ప్రవేశించి విశ్వం అంతటా విలయతాండవం చేస్తున్నది. మళ్ళీ ఉగాది సమయం ఇది. ఆ మహమ్మారి ఇంకా మన చుట్టూనే ఉంది. ఇంకా విజృంభించే అవకాశం కూడా ఉన్నది. మన పెద్దలు చెప్పిన ఆచార వ్యవహారాలను పాటిస్తూనే, ఈ సమయంలో సరైన ఆహార పానీయాలు తీసుకుంటూ, సోషల్ డిస్టెంసింగ్ పాటిస్తూ, మాస్క్ లు ధరించి వీలైనంతగా మనల్ని, మన కుటుంబాన్ని కాపాడుకోవాలి. ఈ వ్యాపారాలు దెబ్బతింటున్న ఈ తరుణంలో ఉన్నవాళ్లు లేని వాళ్ళని ఆదుకుంటూ, మనుషులకి మనుషులు సహాయ సహకారాన్ని అందించుకోవాలి. అప్పుడే విలయతాండవం చేస్తున్న ప్రకృతితో మానవుడు పోరాడి విజయకేతనం ఎగరవేస్తాడు. అందరికి నవ ఉగాది శుభాకాంక్షలు !!!

**సర్వేజనాః సుఖినో భవంతు !!!**



# కర్మ యోగి, ధర్మ మూర్తి



ఆచార్య గోపాలకృష్ణ కొవ్వలి

చాలామంది భగవద్గీత చదువుతారు. చాలా కొద్ది మంది అందులోని సారాన్ని ఆకళింపు చేసుకుంటారు. అతి కొద్దిమంది గీతలో స్తుతించిన వ్యక్తిత్వాన్ని స్వంతం చేసుకుంటారు. అలాంటి నరులలో అరుదైన సింహం, నరసింహారావు. ఎత్తు అయిదు అడుగుల మూడంగుళాలు; వ్యక్తిత్వం హిమవత్ శిఖరం; సంఘంలో ఉంటూనే నిస్సంగత్వమ్; తన సమాజ శ్రేయస్సుకు పనిచేస్తూనే ఏకాకి జీవితం. తామరాకు మీద నీటిబొట్టులాంటి తాత్వికత. కలుషిత చెరువునే సంస్కరించాలనే ఆలోచనా తపస్వి. నింద, స్తుతి పంకాలంటని అనింద్యానంద మూర్తి. భూకామందైనా భూమి వితరణ సౌభాగ్యశీలి. ఇన్ని చెప్పాక, ఇంత చెప్పాక నేను రాస్తున్న వారి గురించి మీకు అర్థమయ్యే ఉంటుంది. నవ భారత అర్థశాస్త్ర కోవిదుడు, భారత నవశక నిర్మాత, నరసింహారావు. పాములపర్తి నరసింహారావు.

"కర్మ నిర్వాహణాయ సంభవామి యుగే యుగే" అన్నట్లు భారతదేశం అత్యంత క్లిష్ట పరిస్థితిలో ఉన్నప్పుడు వానప్రస్థంలో ఉన్న రావుగారు ఆయన నమ్మిన, ఆయన జీవితాంతం సేవ చేసిన పార్టీ అభ్యర్థన మేరకు ప్రధాని పదవిని చేపట్టారు. పైరవీలు లేవు, కుల సమీకరణ అర్హతలు లేవు. వర్గ, వర్ణ సమీకరణ అర్హతలూ లేవు. ఎలాంటి ఆశ గాని, వాంఛ గాని లేని, కరుడుగట్టిన కాంగ్రెస్ పార్టీ విధేయుడు అన్న అర్హత ప్రాతిపదికన నివురుగప్పిన ప్రతిభాగ్నికి ప్రధాని పదవి వరించింది. అందరికీ ఆమోద యోగ్యుడు, 'అణిగి మణిగి ఉండే మనిషి' అనే ముద్రబిళ్ళ సాయంతో ఒక "రాజకీయ సన్యాసి" భారత ప్రధాని అయ్యాక అంతర్జాతీయంగానూ, జాతీయంగానూ పెద్ద మార్పులు వస్తాయని ఎవరూ నమ్మలేదు, ఊహించలేదు. అందరూ నరసింహారావును ఒక 'ఆపద్ధర్మ కీలుబొమ్మ' గా ఉంటారని ఊహించారు. హస్తినారణ్యంలో పాములపర్తి సింహం దేశ రక్షణార్థం జూలు విదిలించి, కార్యరంగంలోకి దూకి, ఆర్థిక సంస్కరణలు, రాజకీయ సంక్షోభాలు, విశ్వాస రాహిత్యాలు, అవిశ్వాస తీర్మానాలు,



అసమ్మతి సెగలూ, అంతర్గత బడబాగ్నిలూ, నిరసనలూ, నిర్లక్ష్యాలు, ఉపేక్షలూ... ఇలా అన్నింటినీ అధిగమించి భారత ధర్మాకృతిని చాటిన కర్మయోగి, భారత సింహం, నరసింహారావు. పి.వి. తరవాత వచ్చిన ప్రభుత్వాలన్నీ ఆయన వేసిన బలమైన పునాది మీద నడుస్తున్నాయనడం అతిశయోక్తి కాదు.

రాజీవ్ గాంధీ హత్య తర్వాత కాంగ్రెస్ పార్టీ అవసరాలు, దేశ అవసరాల ప్రాతిపదికన పి.వి. ప్రధాని అవడం అందరికీ తెలుసు. పి.వి. ప్రధానిగా ఉన్న కాలంలో ఎలాంటి వివాదలూ, కుంభకోణాలూ రాలేదు. ఎంత వేగంగా ఆర్థిక సంస్కరణలు జరిగినా ఏ 'దానీలు' లబ్ధిదారులుగా నిందింపబడలేదు. రామజన్మభూమి వివాదం మనిషిని నమ్మిన మంచి మనసున్న మనిషిగా, శ్రీరామ భక్తుడిలా పి. వి. భరించిన అపవాదు మాత్రమే. ఇంకొక వివాదం ఆయనని సుఖంగా మరణించకుండా చేసిన వివాదం అయినా అభియోగాలలో పస లేదని తెలిసినా ప్రతీకార భావంతో కొనసాగిన కేసు. మోసేవాడు లేకపోతే ఎంతగా అలంకరింపబడిన పల్లకి అయినా, అందులో ఎక్కినవాడు ఎంత ఉన్నత వంశ వ్యక్తి అయినా, పల్లకి, ఎక్కిన వాడూ వెలవెల బోతారు. పి.వికి తనని పొగిడి, మోసి, ప్రచారం చేసే అనుచరగణం లేదు. ఆయన వల్ల లబ్ధి పొందిన వారూ లేరు. పార్టీ యంత్రాంగమూ వెనక లేదు. హస్తినలో తుది శ్వాస విడిచినప్పుడు ఏ ప్రధానికి జరగని అవమానం జరిగింది. 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' కి ప్రతినిధి అయిన పి.వి. కి ఇటాలియన్ కోడలు సంస్కారయుత సంస్మరణ స్థలం కేటాయింపుకి కాలొడ్డిందని వినికిడి.

నెహ్రూ, ఇందిర తర్వాత భారత దేశాన్ని అత్యంత ప్రగతిశీల పథంలో నడిపిన వ్యక్తికి దేశరాజధానిలో సంస్మరణ స్థలం నిరాకరించడం, రాజమర్యాదలతో సాగవలసిన స్వర్గారోహణ పర్వం రాజకీయ కుయుక్తులతో ముగియడం బాధ గానూ, ఆశ్చర్యంగానూ లేదూ!!

తెలుగు వారు దేశ అభివృద్ధికి ఎంత పాటుపడినా, ఎంత తోడ్పడినా వారికి తగిన ప్రతిఫలం దక్కడం అరుదు. పి.వి. తెలుగు వాడు అవటం తెలుగు వారి అదృష్టం అయితే, ఆయన తెలుగు వారిగా పుట్టడం ఆయనకి పెద్దగా కలిసొచ్చినట్టు లేదు! ఆయన తెలుగు వారి సొత్తు. ప్రాంతీయ తత్వ జ్వాలలని తట్టుకుని భారతమాత ముద్దు బిడ్డగా నిలబడ్డ పి.వి. తెలుగుబిడ్డ. ఆయన సమైక్యవాది, దేశ సమైక్యాభిలాషి. వట్టిమాటలు కాక గట్టిమేల్ తలపెట్టిన

గురజాడ స్ఫూర్తి రత్నం పి.వి. ఆయన ప్రధానిగా ఉన్న రోజుల్లో దేశ సమగ్రతకి భంగం కలిగేలా మారుతున్న పంజాబ్, కాశ్మీర్ రాజకీయ పరిస్థితులని చాకచక్యంగా, ఆర్భాటం లేకుండా పరిష్కరించిన తీరు అనితర సాధ్యం. పి.వి. జీవితం నాయకత్వ లక్షణాలు నేర్పే ఒక పాఠ్య గ్రంథం. ఆర్భాటాలూ, హడావిడీ లేకుండా దేశాన్ని ఎలా నడపాలో చూపిన చతురుడు పి.వి. దేశానికి ఇంత చేసినా ఎవరికీ పట్టిని పి.వి! ఎంత ఆశ్చర్యం!!? జీవితాంతం పనిచేసిన పార్టీకి 'అంటరాని' వాడు, ఒక 'ప్రాంతానికి మాత్రమే' చెందినవాడు అయ్యాడు. 14 అంతర్జాతీయ భాషలని ఆపోసన పట్టిన తెలుగు తేజాన్ని కుత్సిత రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు విస్మరించినా, మంచిని గుర్తించి పెంచే మనుషుల మనసుల్లో పి.వి. వేసిన ముద్ర శాశ్వతం. పి.వి. భరత మాత గర్వపడే జాతి రత్నం. భారత దేశ అభ్యున్నతికి అత్యంత దోహద పడడమే అర్హత అయితే భారత రత్న బిరుదుకి పి.వి.ని మించిన అర్హుడు లేడు. త్వరలో ఆయనకి 'భారత రత్న' బిరుదు దక్కాలని కోరుకుందాం.

**స్వీయ అనుభవం :**

నేను పి.వి.గారి పేరు మొదట విన్నది ప్రత్యేక ఆంధ్ర ఉద్యమ సమయంలో. అప్పుడు నేను ఏడవ తరగతి చదువుతున్నాను. ఆయన పేరు రాష్ట్రం అంతటా మారు మ్రోగేది. ఆ ఉద్యమ పర్యవసానంగా వెలసిన హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయంలో నేను M.Sc. పట్టా పుచ్చుకోవడం యాదృచ్ఛికం కావచ్చు కానీ, నా జీవితాన్ని మలుపు తిప్పిన పరిణామం. తరవాత, నేను ఢిల్లీ లో AIIMSలో నా Ph.D. పని నిమిత్తం ఒక రోజు నా విభాగానికి వెడుతున్నప్పుడు కలిగిన ఆయన ప్రత్యక్ష దర్శనం. ఒక రోజు నేను AIIMS ప్రధాన ద్వారం నుండి నా విభాగానికి ప్రైవేట్ suites ఉండే ప్రాంతం ద్వారా వెడుతున్నాను. హఠాత్తుగా పి.వి. గారు అటుగా వస్తూ కనిపించారు. ఒకింత విస్తుపోయిన నేను తేరుకుని "నమస్కారం సర్" అన్నాను. ఆయన కొంచెం ఆగి, ప్రతి నమస్కారం చేసి కదిలి వెళ్ళారు. ఆయన వెనక గాని, ముందు గాని వందిమాగధులు లేరు. వైద్యం కోసం AIIMS లో చేరి, విడుదల అయిన ఆయన అప్పుడు ఆయన విదేశాంగ శాఖ మంత్రి అని నాకు గుర్తు. ఎంతటి నిరాడంబరత!

> **"About the government, I think it is for the people and, of course, journalists, commentators, and intellectuals -- to comment, which they have done copiously. All I would say is, i am grateful."**
>
> *— P. V. Narasimha Rao*

# ప్రగతి భారత ప్రతిష్ఠా శిఖరం



**శ్రీ ముప్పవరపు వెంకయ్యనాయుడు**
భారత ఉపరాష్ట్రపతి

పి.వి. నరసింహారావు గారితో ఎన్నో ఏళ్ళ అనుబంధముంది. ఆయనంటే నాకు అపారమైన గౌరవం. మాతృదేశం, మాతృభాష పట్ల ఆయనకు ఎనలేని అభిమానం. అది ఆయన మాటల్లో, చేతల్లో వ్యక్తమయ్యేది. బహుభాషా పరిజ్ఞానం, సాహితీవేత్త కావడం, దేశ ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులు మార్చి ఆధునిక భారతానికి దారిని నిర్మించిన ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టి దేశానికి అంతార్జాతీయ ఖ్యాతి సాధించడమే కాదు, గ్రామాల్లో నిజమైన స్వరాజ్యం గురించి తపించిన పి.వి. నరసింహారావు ఒక తెలుగువాడని నేను సగర్వంగా చెప్పుకుంటాను.

పి.వి. సమైక్యవాది. సమైక్య రాష్ట్రం ఉండాలని ఆయన అభిలషించేవారు. కాని అందుకు భిన్నంగా నేను రెండు తెలుగు రాష్ట్రాలుండాలని అనుకునేవాడిని. ఈ ఒక్క అభిప్రాయ వ్యత్యాసాన్ని మినహాయిస్తే మా ఇద్దరి మధ్యా సత్సంబంధాలుండేవి. ఎన్నో కీలక మంత్రిత్వ శాఖలు ఉన్నప్పటికీ నేను వాజపేయి ఆశ్చర్యపోయే విధంగా నాకిష్టమైన గ్రామీణాభివృద్ధి శాఖనే కోరుకుని గ్రామాలకు సేవ చేయాలనుకున్నాను. ఆ సమయంలో మా ఇద్దరిమధ్యా ఎన్నోసార్లు చర్చలు జరిగేవి. ఒక తెలుగువాడిపై ఉండి ఇంత చిన్న వయస్సులో మంచి విషయ పరిజ్ఞానం సంపాదించి ఈ స్థాయికి చేరుకోవడం అనేది ఎంతో సంతోషకరమని ఆయన భుజం తట్టేవారు. ఆయన ప్రధాని అయిన వెంటనే 73, 74వ రాజ్యాంగ సవరణల ద్వారా పంచాయితీ రాజ్ వ్యవస్థ బలోపేతం చేసే నిర్ణయాలు తీసుకోవడం వల్ల నాకు గ్రామీణాభివృద్ధి శాఖలో ఆ రంగంలో మరిన్ని చర్యలు చేపట్టే అవకాశం లభించిందని చెప్పక తప్పదు. ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్‌లో సాహసోపేతంగా భూసంస్కరణలు, వ్యవస్థలో సమూల మార్పులు తీసుకువచ్చే అధికార వికేంద్రీకరణ చేపట్టి గాంధీ కలలు కన్న గ్రామస్వరాజ్యాన్ని సాకారం చేసేందుకు ప్రయత్నించిన పి.వి. ఒక క్రాంతదర్శి.

పి.వి. నరసింహారావు మితభాషి. అన్ని హంగులూ, ఆర్భాటాలకు ఆయన దూరంగా ఉండేవారు. ఆర్థిక సంస్కరణలతో పలు విద్యా సంస్కరణలను, భూ సంస్కరణలను ప్రవేశపెట్టినప్పటికీ, బహుముఖ ప్రజ్ఞాశాలి అయినప్పటికీ ఎంతో నిగర్విగా, నిరాడంబరంగా ఉండడం అందరూ ఆదర్శంగా తీసుకోవాలి. స్థితప్రజ్ఞుడైన పి.వి. భారత రాజకీయాల్లో చాణుక్యుడుగా గుర్తింపు పొందారు.

హాస్యప్రియుడైన పి.వి. నిశ్శబ్ద ప్రవాహం లాగా ప్రసంగించేవారు. మంచి ఉపన్యాసకుడైన ఆయన ప్రసంగాల్లో భాషా చాతుర్యం, భావ స్పష్టత, విషయాల పట్ల గాఢత ప్రస్ఫుటమయ్యేది. విమర్శలకు క్రుంగి, ప్రశంసలకు లొంగే మనస్తత్వం కాదు ఆయనది. ఎటువంటి విమర్శలొచ్చినా తొణకకుండా శాంతచిత్తంతో అందర్నీ ఒప్పించేలా సమాధానం ఇచ్చేవారు.

తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో ఉన్న దేశాన్ని కీలకమైన విధానాలు చేపట్టి ఆర్థికవ్యవస్థను తిరిగి పట్టాలపైకి తీసుకురావడం పి.వి. పాలనా దక్షత ప్రపంచానికి సుస్పష్టమైంది. పార్లమెంటులో మెజారిటీ లేకపోయినా అత్యంత చాకచక్యంతో మైనారిటీ ప్రభుత్వాన్ని ఆరేళ్లపాటు నడిపించడం వల్లనే పి.వి. రాజనీతి ఏమిటో తేటతెల్లమైంది.

ప్రధానమంత్రిగా బాధ్యతలు తీసుకున్న మరుసటిరోజే పి.వి. జాతినుద్దేశించి ప్రసంగిస్తూ దేశంలో విస్తృత ఆర్థిక సంస్కరణలు తీసుకురావాల్సిన అవసరాన్ని ప్రస్తావించారు. వేగవంతమైన పారిశ్రామికీకరణకు ఉన్న అడ్డంకులను తొలగించేందుకు ప్రభుత్వం దృఢనిశ్చయంతో వుంది. అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలు కల్పిస్తున్న అవకాశాలను, అధునాతన సాంకేతిక పరిజ్ఞానం సహకారంతో అందిపుచ్చుకుంటూ అంతర్జాతీయ విపణిలో పోటీపడే దిశగా భారతదేశాన్ని తీర్చిదిద్దేందుకు కృషి చేస్తాం అని ఆయన తన ఆలోచనా విధానాన్ని స్పష్టం చేశాడు. వాణిజ్య సరళీకరణ చేపట్టడంతో పాటే ఆయన భారత ఆర్థిక వ్యవస్థను అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థతో అనుసంధానం చేశాడు. 'అన్ని ద్వారాలు తెరవాలి. ఏ గాలికీ మనం కొట్టుకుపోకూడదు' అన్న ఆయన సిద్ధాంతం వల్లనే భారత ఆర్థిక అంతర్జాతీయ పోటీలో నిలదొక్కుకుంది. అప్రతిష్టపాలైన లైసెన్స్ పర్మిట్ రాజ్ వ్యవస్థను నిర్వీర్యం చేస్తూ పటిష్టమైన సంస్కరణలు చేపట్టిన ఘనత పి.వి.కి దక్కుతుంది. అంతేకాదు వినూత్నమైన, విప్లవాత్మకమైన మార్పులు చేపట్టినప్పటికీ వాటికి ఆమోద యోగ్యత సాధించాడు. ఆయనకు అనుగుణమైన రాజకీయ వాతావరణాన్ని సృష్టించాడు.

దౌత్య సంబంధాల విషయంలో కూడా ఆయన తన ప్రజ్ఞాపాటవాలతో భారతదేశ కీర్తి ప్రతిష్టలను పరిరక్షించడంతో పాటు మన ప్రాధాన్యతలను, లక్ష్యాలను అంతర్జాతీయ వేదికలపై చాలా స్పష్టంగా చెప్పేవారు. ప్రపంచంలో విదేశాంగ, ఆర్థిక అంశాలపై ఆయనకు విస్తృతమైన అవగాహన ఉండేది. విదేశాంగ శాఖ మంత్రితో ఇండో-యూరో, జీ-77 సదస్సులకు అధ్యక్షత వహించి తన సామర్థ్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పారు. గల్ఫ్ యుద్ధం సందర్భంగా జరిగిన అలీనోద్యమ దేశాల (నామ్) విదేశాంగ మంత్రుల సమావేశానికి అధ్యక్షతను వహించి మన దేశ ప్రయోజనాలను కాపాడటంలో చొరవ తీసుకున్నారు. 'లుక్ ఈస్ట్ పాలసీ' ద్వారా ఆసియన్ దేశాలకు చేరువయ్యే విధంగా చొరవ తీసుకోవడం, ఇజ్రాయేల్‌తో దౌత్య సంబంధాలు నెలకొల్పడం, అమెరికాతో సత్సంబంధాల పునరుద్ధరణ వంటి సాహసోపేతమైన చర్యలు చేపట్టారు. అధికారిక సమావేశాల్లోనే కాదు. తెరవెనుక మంతనాల ద్వారా ఆయన ప్రదర్శించిన దౌత్య నీతి వల్ల భారతదేశానికి ప్రత్యేక గుర్తింపు లభించింది.

విదేశాంగశాఖ మంత్రిగా, కేంద్ర గృహ మంత్రిగా, రక్షణ మంత్రిగా, ప్రణాళిక శాఖ మంత్రిగా, మానవ వనరుల అభివృద్ధి శాఖ మంత్రిగా.... ఇలా తను బాధ్యతలు చేపట్టిన ప్రతి శాఖలోనూ అవసరమైన సంస్కరణలు తీసుకొచ్చి విమర్శకులతోనూ ప్రశంసలు అందుకున్నారు. పంజాబ్ కాశ్మీర్‌ల్లో వేర్పాటువాదాన్ని నియంత్రించడంలో ఆయన కృషి కొనియాడదగినది.

ముఖ్యమంత్రిగా ఉన్నా, ప్రధానమంత్రి హోదాలో ఉన్నా అసమ్మతిని ఎదుర్కొన్నప్పటికీ చాకచక్యంగా నెగ్గుకురాగలిగారు. మన రాష్ట్రం నుంచే కాక పొరుగు రాష్ట్రమైన మహారాష్ట్ర నుంచి కూడా పార్లమెంటుకు ఎన్నికయ్యారు. దేశాభివృద్ధిలో, జాతిప్రగతిలో సాంస్కృతిక రంగం పాత్ర కీలకం. జాతి సమగ్రతను పరిపుష్టం చేయడంలో కళారంగం పోషించే పాత్ర బృహత్తరం. సాంస్కృతిక సమైక్యతతోనే నిజమైన భావసమైక్యత సిద్ధిస్తుందని నేను విశ్వసిస్తున్నాను' అని ఓ సందర్భంలో పి.వి. పేర్కొన్నారు. కళలు, సాహితీరంగంపై వారికున్న మక్కువకు ఇదొక నిదర్శనం. మన భారతీయ భాషలన్నింటితో పాటు మాతృభాష అయిన తెలుగుపై వారికి మమకారంతో పాటు పట్టు ఎక్కువ. అందుకే సమైక్యాంధ్రప్రదేశ్ విద్యాశాఖ మంత్రిగా ఉన్న సమయంలో తెలుగు భాషాభివృద్ధికి కృషిచేశారు. అంతేకాదు, ప్రాథమిక విద్య తప్పనిసరిగా మాతృభాషలోనే ఉండేటట్లు చర్యలు కూడా తీసుకున్నారు.

1967లో అధికారభాషగా తెలుగు అమలుకు చట్టబద్ధతను తీసుకురావడంతో పాటు ప్రామాణిక కీబోర్డులు, టైప్ రైటర్లు తయారుచేయించి పరిపాలనా భాషగా తెలుగు అమలు కావడంలో ప్రత్యేక చొరవ తీసుకున్నారు. అధికార భాషాసంఘం, తెలుగు అకాడెమీ ఏర్పాటులోనూ పి.వి. నరసింహారావు చొరవ చిరస్మరణీయం. అంతర్జాతీయ స్థాయిలోనూ తెలుగు సంస్థల ఏర్పాటును ప్రోత్సహించారు. ప్రజల్లో భాషా చైతన్యం కలిగించేందుకు భాషోద్యమం రూపుదిద్దుకోవాలని కూడా వారు ఆకాంక్షించేవారు. రాజహంస, భట్టాచార్య, రాజా అనే కలం పేర్లతో రచనలు కూడా చేశారు.

తెలుగుపై అభిమానాన్ని చాటుతూనే.... వివిధ భారతీయ భాషల అభివృద్ధి గురించి తీవ్రంగా కృషిచేశారు. తొమ్మిది భారతీయ భాషల్లో, 6 విదేశీ భాషల్లో అలవోకగా మాట్లాడేవారు.అందుకేవారినిబహుభాషాకోవిదుడుఅంటారు.విషయ పరిజ్ఞాన విచక్షణతో కూడిన ప్రవర్తనతో బృహస్పతిగా కూడా పేరు తెచ్చుకున్నారు. భారతీయ సంస్కృతి, సంప్రదాయాలను గౌరవించి, ప్రోత్సహించేవారు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రచించిన 'వేయి పడగలు' నవలను హిందీ భాషలోకి 'సహస్రఫణ్' పేరుతో అనువాదం చేసి ప్రశంసాపాత్రుడయ్యారు. పి.వి.కి అటల్ బిహారీ వాజపేయితో సన్నిహిత సంబంధాలుండేవి. ఇద్దరూ మంచి ప్రజ్ఞాపాటవాలు కలిగినవారు, సాహిత్య అభిరుచి కలిగినవారు, రచయితలు కావడంతో ఈ సాన్నిహిత్యం పెరిగిందనుకోవచ్చు. ఆయన చేపట్టిన సంస్కరణలు తిరుగులేనివి. వాటిని వాజపేయి ఫలవంతంగా అమలు చేస్తే, ప్రస్తుత ప్రధాని నరేంద్రమోదీ మరింత వేగవంతం చేస్తున్నారు. నేను పట్టణాభివృద్ధి శాఖామంత్రిగా ఉన్నప్పుడు ఢిల్లీలో పి.వి. నరసింహారావు గారికి స్మారక చిహ్నం ఏర్పాటు చేసేందుకు చొరవ తీసుకోగలగడం నాకు లభించిన బృహత్తర అవకాశం. దక్షిణాది వాడు, ప్రధానంగా తెలుగువాడైన పి.వి. అంతరాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చుకోవడం మనందరికీ గర్వకారణం.

(గమనిక: ఈ వ్యాసం తొలుత తెలుగు అకాడెమీ వారి "తెలుగు" లో ప్రచురితమైంది)



**Patriotic statesman who believed that the nation is bigger than the political system**

*— APJ Abdul Kalam*

# తెలుగు వైభవ దీప్తి శ్రీ పి.వి.



**డా॥ మండలి బుద్ధప్రసాద్**
మాజీ మంత్రి, ఆంధ్రప్రదేశ్ పూర్వపు ఉప-సభాపతి
✆ 98487 80872

“తెలుగు వారికి ఒక వ్యక్తిత్వం ఏర్పడలేదనిపిస్తుంది. తెలుగు వాళ్లకొక వ్యక్తిత్వం పునర్నిర్మించుకోవటం అవసరం కూడా!

ఆ వ్యక్తిత్వం మనకుగా మనం నిర్మించుకోవాలంటే ఒక వ్యక్తి అవసరం... ఆ వ్యక్తి చుట్టూ అది నిర్మితమవుతూ ఉంటుంది.

ఇతర రాష్ట్రాల్లో చరిత్ర ప్రసిద్ధి పొందిన మహావ్యక్తుల చుట్టూ, వారి గొప్పదనం చుట్టూ అల్లుకుని ఆయా రాష్ట్రాల కొక వ్యక్తిత్వం సముపార్జితం అవుతుంది.

కానీ, తెలుగు వారి ప్రత్యేకత ఏమిటంటే ఎవరికీ వ్యక్తిత్వం రాకుండా చేసుకోవటం...!

కనీసం ఇక మీదటైనా ఆ వ్యక్తిత్వాన్ని మన రాష్ట్రానికి, మన తెలుగు వాళ్లకు కల్పించటానికి మనం దోహదం చేస్తే తొందరగా అది నిర్మాణం అవుతుందనే ఆశ కూడా ఉంది.” ఇది ఆంధ్రకేసరి ప్రకాశం శతజయంతి ఉత్సవాలను ప్రారంభిస్తూ నాటి ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు నోట వెంట వెలువడిన ఆయన ఆత్మఘోష.

వ్యక్తి యొక్క నడవడి, ఆలోచనాసరళి, భావనా రీతులను అభివ్యక్తం చేసేదే వ్యక్తిత్వం. వ్యక్తం అయినదాన్ని వ్యక్తిత్వం అంటారు. ఆశయాలు, ఆచరణలే వ్యక్తిత్వాన్ని చాటుతాయి.

స్వాతంత్ర్య సమరకాలంలో నాయకత్వం వహించిన నాయకుల్లో ప్రకాశం పంతులుగారి ప్రభావశీలమైన, దృఢమైన ఉన్నత వ్యక్తిత్వం తెలుగువారి విశిష్ట వ్యక్తిత్వంగా భాసిల్లిందనే భావన పి.వి. గారి ఈ మాటల్లో ధ్వనిస్తోంది.

ఈ మాటలు ఆయన నోటి వెంట వచ్చిన సరిగ్గా 18 యేళ్ల తరువాత తాను భారత ప్రధానమంత్రి పదవిని అధిష్టించి తెలుగు జాతికి ఎనలేని కీర్తి ప్రతిష్టలు తీసుకువస్తానని బహుశా ఆయన ఆనాడు ఊహించి ఉండరు.

"ఢిల్లీకి రాజైనా తల్లికి బిడ్డనే" అంటూ ప్రధానిగా పదవి స్వీకరించిన తరువాత ఆంధ్రప్రదేశ్ వచ్చినప్పుడు ఆనందపడిన తెలుగుతల్లి ప్రియపుత్రుడు ఆయన.

> "ఢిల్లీకి రాజైనా తల్లికి బిడ్డనే" అంటూ ప్రధానిగా పదవి స్వీకరించిన తరువాత ఆంధ్రప్రదేశ్ వచ్చినప్పుడు ఆనందపడిన తెలుగుతల్లి ప్రియపుత్రుడు ఆయన.

తెలుగువారిగా మనం సంతోషించినా, సంతోషించకపోయినా యావత్ భారతదేశం తన వాడిగా శ్రీ పి.వి.ని గుర్తించి గౌరవించింది. అంతకు పూర్వమే స్వంత నియోజకవర్గ ప్రజలు నిరాదరించినా మహారాష్ట్ర ఆ మహనీయుడిని అక్కున చేర్చుకుంది. ఆయన మాట్లాడే మరాఠీ, హిందీలు స్థానికులకన్నా తియ్యగా ఉండటం ముఖ్యంగా ఔత్తరాహికులను పులకింపచేసింది.

బహుభాషా కోవిదుడాయన. ఇంగ్లీషు, హిందీ సహా మొత్తం 17 వరకూ భాషలు నేర్చినవాడాయన. కోబాల్, బేసిక్, యునిక్స్ ప్రోగ్రామింగ్ వంటి కంప్యూటర్ భాషలు కూడా నేర్చినవాడు. అయినా తెలుగు పట్ల మక్కువ వదలని వాడు. పాండిత్యం ఆయన వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడం చేత, దేశంలో ఆర్థిక సంస్కరణలు తొలిసారిగా ప్రవేశపెట్టిన ఘనతని పొందారాయన. పాలనా వ్యవహారాలలో కంప్యూటరీకరణకు నాంది పలికినది కూడా ఆయనే!

**అధికారభాషగా తెలుగు కోసం...**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలుగు భాషకు చెప్పుకోదగిన ఆరంభాలన్నింటికీ శ్రీ పి.వి. కారకుడని చెప్పాలి. ఆయన న్యాయ, దేవాదాయ శాఖ మంత్రిగా ఉన్న కాలంలో అధికారభాషా చట్టం తెచ్చారాయన. 1966లో అధికారభాష పరిశీలనా సంఘ అధ్యక్షులుగా రాష్ట్రమంతా పర్యటించి, తెలుగులో పాలనకు ఎదురయ్యే సాధక బాధకాలను స్వయంగా తెలుసుకుని దాని ప్రకారం అధికార భాషాసంఘ చట్టానికి రూపకల్పన చేశారు. ఆ తరువాత రాష్ట్ర రాజకీయాల్లో వారు ఉన్నంత కాలం అధికారభాషా శాఖ ఆయన్నేఅంటిపెట్టుకు వుంది.

1967 వరకు న్యాయ, దేవాదాయ శాఖ మంత్రిగా; ఆ తరువాత వైద్య, ఆరోగ్య శాఖ మంత్రిగా; న్యాయ, సమాచార శాఖ మంత్రిగా, విద్యామంత్రిగా ఆయన వివిధ

బాధ్యతలు నిర్వహించినప్పటికీ, ఆయా ముఖ్యమంత్రులు అధికారభాషను మాత్రం శ్రీ పి.వి.కే కేటాయించే వారంటే ఆయన నిబద్ధత ఎంతటిదో అర్థం అవుతుంది.

అధికారభాషగా తెలుగు అమలు విషయంలో ఎదురౌతున్న సమస్యలపై ఆయన శాసనసభలో ఒక శ్వేతపత్రం ప్రకటించారు. అనువాదాల విషయంలో ఎదురవుతున్న ఇబ్బందుల్ని ఆయన అందులో ప్రస్తావించారు. "చట్టాలలోని పదాలకు ప్రామాణిక పదనిర్వచనం, భాషా సౌలభ్యం, శైలి, సమన్వయపూర్వక సహజత్వాన్ని ప్రతిబింబింప చేయటంతోపాటు అనువాదాలు సాధ్యమైనంత ఆమోదయోగ్యమైనవిగా ఉండేటట్టు వుండేటట్టు శ్రద్ధవహించటం అత్యవసరం" అన్నారు. పండితులను పిలిపించి వివిధ పదకోశాలు రూపొందింపచేశారు.

1968లో ప్రామాణిక కీబోర్డు తయారు చేయించి, కొత్త తెలుగు టైపు రైటరును విడుదల చేశారు. టైపురైటరు తయారీదార్ల దగ్గరకు వెళ్లి స్వీయపర్యవేక్షణలో తెలుగు టైపురైటర్లకు రూపకల్పన చేశారు. దాదాపు 1990 దశకం దాకా తెలుగు టైపురైటర్లు మన అవసరాలను చాలా వరకూ నెరవేర్చాయి. తరువాతి కాలంలో వచ్చిన ఎలక్ట్రానిక్ టైపురైటర్లకు కూడా పి.వి. గారి 'కీబోర్డు'నే ఉపయోగించారు.

ఇంగ్లీషు షార్ట్ హ్యాండ్ స్థానంలో తెలుగు షార్ట్ హ్యాండ్ మాన్యువల్నుని కూడా తయారు చేయించి వాటిని నేర్చుకునేందుకు వీలుగా శిక్షణా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు.

**తెలుగు అకాడెమీ నిర్మాత :**

కేంద్రప్రభుత్వం నియమించిన కొఠారీ కమీషన్ బోధనావాహికగా కళాశాల స్థాయిలో మాతృభాషను ప్రవేశపెట్టటం కోసం ప్రాంతీయ భాషలలో 'భాషా సంస్థ'లను ఏర్పాటు చేయాలని కోరింది. తదనుగుణంగా 1967 ఏప్రియల్లో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ మాజీ కార్యదర్శి శ్రీ జె.పి.యల్.గ్విన్ (ఐ.సి.ఎస్.) అధ్యక్షతన నిపుణుల సంఘాన్ని శ్రీ పి.వి. ఏర్పాటు చేశారు. ఈ సంఘం "తెలుగు భాషను సర్వశక్తిమంతమైనదిగా రూపొందించటానికి "తెలుగు భాషాసంస్థ" పేరుతో ఒక రాష్ట్రస్థాయి సంస్థని ఏర్పాటు చేయాలని సూచించింది. ఆ విధంగా 1968లో "తెలుగు అకాడెమీ" ఏర్పడింది. పి.వి. నరసింహారావు గారి మానసపుత్రిక ఇది. విద్యాశాఖామంత్రిగా ఆయనే దానికి తొలి అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆ తరువాత ముఖ్యమంత్రిగా ఉన్నకాలంలోనూ, ముఖ్యమంత్రి పదవిలోంచి వైదొలగిన తరువాత కూడా 1974 వరకూ ఆయనే తెలుగు అకాడెమీ అధ్యక్షులుగా

వ్యవహరించారు. తెలుగు అకాడెమీని స్వయంపోషక సంస్థగా చేశారాయన.

తెలుగు అకాడెమీపట్ల ఆయనకు గల అనురక్తికి రెండు ఉదంతాలు చెప్పాలి. 1972లో శ్రీ పి.వి.నరసింహారావు ముఖ్యమంత్రి అయ్యారు. ఆయన మంత్రివర్గంలో శ్రీ భాట్టం శ్రీరామమూర్తిని విద్యామంత్రిని చేశారు. కానీ, ఉన్నత విద్యని మాత్రం తన ఆధీనంలోనే అట్టేపెట్టుకున్నారు. "తెలుగు భాష అధికారభాష, కాలేజీ, విశ్వవిద్యాలయాలభాషగా రాణించాలి. అందుకోసం ఏర్పడిన తెలుగు అకాడెమీ నా సృష్టి. దాన్ని పరిపుష్టం చెయ్యాలి అని నా దగ్గరే ఉంచుకున్నాను" అని శ్రీ భాట్టానికి చెప్పారట.

శ్రీ పి.వి. పదవీకాలం ముగిసి, జై ఆంధ్ర ఉద్యమం అనంతరం శ్రీ జలగం వెంగళరావు ముఖ్యమంత్రి అయ్యారు. ఆయన మంత్రిమండలిలో మా నాన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు విద్యా, సాంస్కృతిక శాఖామాత్యులయ్యారు. ఆ తరువాత ధన్యవాదాలు చెప్పటానికి వెళ్లి "నేను మేధావిని కాను, సాధారణ కార్యకర్తని, విద్యామంత్రికి తగను. సాంఘిక సంక్షేమ శాఖ అయితే మక్కువతో చేస్తాను" అన్నారు. దానికి ముఖ్యమంత్రి శ్రీ జలగం "నేను అన్నీ ఆలోచించే ఈ శాఖను ఇచ్చాను. ఛాలెంజిగా తీసుకుని చెయ్యాలి" అన్నారు.

ఆ సందర్భంలో విద్యాశాఖ వ్యవహారాల గురించి ముఖ్యమంత్రి కొన్ని వివరాలు కూడా మానాన్నకు తెలియజెప్పారు. తెలుగు అకాడెమీ శ్రీ పి.వి. స్వంత సంస్థలా తయారయ్యిందంటూ... సంచాలకుడు డా|| పి.యస్.ఆర్. అప్పారావు పేరు కూడా ప్రస్తావించారు. తదనంతర కాలంలో మా నాన్న ముఖ్యమంత్రిని ఎలా సమాధాన పరిచారో తెలీదు. వెంగళరావుగారి కాలంలో కూడా శ్రీ పి.వి.నే తెలుగు అకాడెమీ అధ్యక్షులుగా కొనసాగగా, డా|| పి.యస్.ఆర్.అప్పారావు ముఖ్యమంత్రికి అభిమానపాత్రుడయ్యారు. అంతేకాదు, తెలుగు అకాడెమీ సమావేశాలలో ముఖ్యమంత్రి హోదాలో శ్రీ జలగం ఉత్సాహంగా పాల్గొనేవారు కూడా!

తెలుగు అకాడెమీ తెలుగులో బోధన, తెలుగు పాలనా భాషల కోసం విస్తృత స్థాయిలో కృషిచేసిందంటే ఆ కీర్తి శ్రీ పి.వి.కే దక్కాలి. అకాడెమీకి సంబంధించిన ఒక సభలో ఆయన అత్యంత వినయంగా "దీంతో ఆది నుండీ నాకు సంబంధం ఉంది. కానీ నేను పెద్దగా చేసిందేమీ లేదు, చేసేవాళ్లు చేస్తూనే ఉన్నారు. మనమంతా చేస్తూనే ఉన్నాం. నేను కూడా, అధ్యక్షుడుగా, వీలైనంత వరకూ దేనిలోనూ ఇబ్బందులు రాకుండా చూసుకోవటం, విద్యపరంగా వాళ్లకు పూర్తి స్వేచ్ఛనివ్వటం చేసేవాణ్ణి. వాళ్లు చేసే ప్రతి కార్యక్రమంలో ఇదెందుకు చేశావనీ, అదెందుకు రాయలేదనీ, నాకు రాని విషయాలన్నింటిలో ప్రశ్నించటమనే

అలవాటు పబ్లిక్ లీడర్సుకు ఉండేదే! దాన్ని కాస్త కంట్రోల్ చేసుకుని వాళ్ల పని వాళ్లని చేయనిచ్చాను. అంత క్రెడిట్ మాత్రమే నేను తీసుకోవలసి ఉంది..." అన్నారు. వారి మాటల్లో ఎంతో వినమ్రత, హుందాతనం ప్రస్ఫుటమయ్యేవి. బహు భాషలు తెల్సిన మేధావి అయినా ఇసుమంతైనా అతిశయం ఆయన మాటల్లో ధ్వనించేది కాదు. తాను ఏమీ తెలియని వాడిననుకోవటమే మేధావితనానికి సాక్ష్యం.

1974-77 వరకూ మా నాన్నగారు తెలుగు అకాడెమీ అధ్యక్షులుగా వ్యవహరించారు. మహోన్నత బాషాపరిశోధకులు, సాహితీవేత్తలు ఆరోజుల్లో తెలుగు అకాడెమీలో పనిచేస్తుండేవారు. వారంతా శ్రీ పి.వి. హయాంలో ఎంపిక అయినవారే! గొప్పగొప్ప వాళ్లందరినీ గుదిగుచ్చి తెలుగు అకాడెమీలోకి తెచ్చారు. అకాడెమీ పక్షాన "తెలుగు" మాసపత్రికను కూడా శ్రీ పి.వి.యే ప్రారంభించారు.

శ్రీ పి.యస్.ఆర్.అప్పారావు తెలుగు అకాడెమీ సంచాలకులుగా వుండేవారు. ఆయన గొప్ప పండితుడు, నిరాడంబరుడు. శ్రీ పి.వి.కి ఎంతో సన్నిహితుడిగా పేరుండేది. ఆయన మా నాన్నకు కూడా అత్యంత సన్నిహితులు. మా కుటుంబంలో ఒకరుగా ఉండేవారు.

తెలుగు భాషకు అనితరసాధ్యమైన సేవ తెలుగు అకాడెమీ చేసింది. విద్యాస్థాయిలో పాఠ్యగ్రంథాలు, పఠనీయ గ్రంథాలు, అనువాద గ్రంథాలు, పదకోశాలు, నిఘంటువులు ప్రచురించింది. తెలుగు మాతృభాష కానివారికి తెలుగు బోధించింది.

## ప్రపంచ తెలుగు మహాసభలు :

1975లో ప్రప్రథమ ప్రపంచ తెలుగు మహసభలు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగలరావు నాయకత్వంలో మానాన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావు ఆధ్వర్యంలో జరిగాయి.

ప్రపంచ తెలుగు మహాసభల చర్చా గోష్టులను అఖిలభారత కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి శ్రీ పి.వి. నరసింహారావు ప్రారంభించారు. తెలుగుభాషకు అంతర్జాతీయ స్వరూపం కల్పించటానికి ప్రపంచ తెలుగు మహాసభలు తోడ్పడతాయన్నారు. ఆనాటి శ్రీ పి.వి. ప్రసంగంలో కీలకమైన అంశాలు అనేకం ఉన్నాయి.

మానవుడు ప్రతీక్షణం వాడే భాష ఇప్పుడు ఎలా ఉంది? రేపు ఎలా ఉండాలి? అని చర్చించవలసిన అవసరం ఉందన్నారు. తెలుగు, కన్నడ భాష లిపులను

ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో ఏకీకృతం చేయటానికి ఉభయ ప్రభుత్వాలూ ప్రయత్నించాలన్నారు. మాండలికాలను నిర్దిష్టంగా అన్ని ప్రాంతాలవారూ తీసుకోవాలి. వేరొకప్రాంతంలో భాష సరైనది కాదన్న ధోరణి విడనాడినప్పుడే భాష విస్తరిస్తుందని, భాష స్వరూపం ఎప్పటికప్పుడు మారకతప్పదనీ దాని ప్రాతిపదికగా ఎప్పటికప్పుడు మార్పులు తెచ్చుకున్నప్పుడే భాష విస్తరిస్తుందనీ, పరిపుష్టి అవుతుందనీ వివరించారు. "భాషకు మాండలిక స్వరూపం ఉంటుంది. జిల్లా స్వరూపం ఉంటుంది. రాష్ట్ర స్వరూపం ఉంటుంది. దేశవ్యాప్తమైన స్వరూపమూ ఉంటుంది. అంతకు మించి అంతర్జాతీయ స్వరూపం కూడా సాధించాలి! అభివృద్ధిచెందిన ఇతర భాషలతో సమానమైన వైశిష్ట్యాన్ని మన భాషల్లోకి తేవాలన్నదే దీని భావం" అన్నారు.

గతంలో తెలుగు అకాడెమీ ఏర్పాటు ప్రతిపాదన చేసిన శ్రీ జె.పి.యల్. గ్వైన్ 'అంతర్జాతీయ తెలుగు సంస్థ' ఏర్పాటు కూడా జరగాలని చేసిన ప్రతిపాదనకు శ్రీ పీ.వి. మద్దతు పలికారు. మా నాన్నగారి అధ్యక్షతన ఏర్పడిన "అంతర్జాతీయ తెలుగు సంస్థ"కు తెలుగు అకాడెమీ తొలి డైరెక్టరు డా|| పి.యస్.ఆర్. అప్పారావే డైరెక్టరు కావటం విశేషం.

**"సహస్రఫణ్" అనువాదం :**

కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన "వేయిపడగలు" నవలను శ్రీ పి.వి.నరసింహారావు "సహస్రఫణ్" పేరుతో హిందీలోకి అనువదించి, తెలుగు సాహితీవైభవాన్ని ఉత్తరాదివారికి రుచిచూపించారు. తత్ఫలితంగా శ్రీ విశ్వనాథకు జ్ఞానపీఠ పురస్కారం లభించటం, ప్రధానోత్సవ సభలో ముఖ్యమంత్రిగా వున్న శ్రీ పి.వి.యే విశ్వనాథ వారిని పరిచయం చేయటం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవిగా నియమించటం ఇవన్నీ విశ్వనాథపట్ల శ్రీ పి.వి.కి గల ప్రగాఢమైన అభిమానానికి తార్కాణాలు.

> కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన "వేయిపడగలు" నవలను శ్రీ పి.వి. నరసింహారావు "సహస్రఫణ్" పేరుతో హిందీలోకి అనువదించి, తెలుగు సాహితీవైభవాన్ని ఉత్తరాదివారికి రుచిచూపించారు.

1976 అక్టోబరు 10న శ్రీ విశ్వనాథ మరణవార్త విన్నప్పుడు శ్రీ పి.వి. ఎంతో

కదిలిపోయారు. అంత్యక్రియలకు తాను వస్తున్నట్టు వర్తమానం పంపారు. ప్రభుత్వలాంఛనాలతో విశ్వనాథ అంత్యక్రియలకు మా నాన్నగారు అన్ని ఏర్పాట్లు చేశారు. ఉదయం 10 గంటలకు మంత్రి శ్రీ పరకాల శేషావతారంతో కలిసి శ్రీ పి.వి. విజయవాడలో విశ్వనాథ ఇంటికి వచ్చి ఆయన భౌతిక కాయాన్ని చూసి కన్నీరు కార్చారు. దగ్గరుండి అంతిమయాత్రలోనూ, అంత్యక్రియలలోనూ పాల్గొన్నారు. సాయంత్రం వారి అధ్యక్షతన సభ జరిగింది.

ఈ మధ్య డా. పరకాల ప్రభాకర్ ఒక ఆసక్తికరమైన సంఘటన చెప్పారు. విశ్వనాథ మరణ వార్త విని, శ్రీ పి.వి. పరకాల శేషావతారం గారికి ఫోను చేశారట. ఆ ఫోనుని శ్రీ ప్రభాకర్ అందుకుని 'నాన్నగారు బయటకు వెళ్లారని' చెప్పారట. కొద్ది విరామంలోనే మళ్లీమళ్లీ ఫోను చేశారట. ఆఖరుసారి ఫోను చేసినప్పుడు... "విశ్వనాథ అంత్యక్రియలకు వెళ్లాలంటే నా కారు విజయవాడ దాకా వెళ్ళేలా లేదు, నాన్న వస్తే నాన్నకార్లో వెళ్లాలని ఇన్నిసార్లు ఫోను చేశాను. నాన్న రాగానే చెప్పి, ఉదయమే వచ్చి నన్ను తీసుకు వెళ్లమని చెప్పు" అని అన్నారట. అదే విధంగా శ్రీ శేషావతారం గారు తనకారులో శ్రీ పి.వి.ని విజయవాడ తీసుకువచ్చారు. ముఖ్యమంత్రిగా పనిచేసిన వ్యక్తికి సరైన కారు కూడా లేదంటే నమ్ముతారా? ఒక ఫియట్ కారు మాత్రమే వుండేదిట!

ఇంకొక సంఘటన: శ్రీ చదలవాడ పిచ్చయ్య ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం వ్యవస్థాపకుల్లో ఒకరు. నవభారతి పత్రిక నడుపుతుండేవారు. శ్రీ పి.వి.కి కూడా ఆయన సన్నిహితులు. ఒక సందర్భంలో ఆయన శ్రీ పి.వి. ని కలవటానికి ఢిల్లీ వెళ్లి శ్రీ పి.వి. ఇంట్లోనే బస చేశారు. ఆ రోజు అర్ధరాత్రి ఆయనకు పక్షవాతం వచ్చింది. శ్రీ పి.వి. ఇంట్లో పరిచారికలు ఎవరూ లేరు. డ్రైవరు కూడా లేడు. శ్రీ పి.వి.యే ఆయన్ని కారులో ఎక్కించుకుని స్వయంగా కారు నడుపుకుంటూ ఆస్పత్రికి తీసుకు వెళ్లి జేర్పించారట. ఆ తరువాత శ్రీ పిచ్చయ్యగారు హైదరాబాదు వచ్చినప్పుడు స్వయంగా ఈ విషయం చెప్పారు.

కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు కృష్ణాపత్రిక శతజయంతి సంఘానికి నన్ను ప్రధాన కార్యదర్శిని చేశారు. ఢిల్లీలో ప్రధానమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజపేయి శతజయంతిని తన నివాసంలోని ఆడిటోరియంలో ప్రారంభించటానికి అంగీకరించారు. ఆ సభకు శ్రీ పి.వి.ని ముఖ్య అతిథిగా ఆహ్వానించారు. సాయంకాలం సభ. ఆరోజు ఉదయం ఆహ్వానపత్రం అందించటానికి శ్రీ పి.వి. ఇంటికి వెళ్లాను. చాలాసేపు అనేక విషయాలు మాట్లాడాము. మాట్లాడుతుండగా "సాయంత్రం సభలో ఏం మాట్లాడమంటావ్?" అని హఠాత్తుగా అడిగారు. నేను

నిర్ఘాంతపోయి, "సార్! తమకు చెప్పేపాటి వాణ్ణా? మీరు ఏం చెప్తారో విందామనే ఆతృతలో ఉన్నవాణ్ణి" అన్నాను. ఎవరెష్టు శిఖరం వంగి చిన్నరాతిని సలహా అడిగినట్టనిపించింది. 'వ్యక్తిత్వ మహోన్నతుడు' శ్రీ పి.వి.

ఆ సాయంకాలం సభ చారిత్రాత్మకమైనది. శ్రీ వాజపేయి తన ఇంట్లో జరుపుతున్న ఈ సభకు ముఖ్య అతిథిగా శ్రీ పి.వి.ని సాదరంగా ఆహ్వానించి, సగౌరవంగా వెంటబెట్టుకుని వేదికమీదకు తోడ్కొని వెళ్ళారు. ఇరువురూ మహాపండితులే! సాహితీవేత్తలే! ఒకరు ప్రధాని కాగా, వేరొకరు మాజీ ప్రధాని. ఇద్దరూ పోటీపడి ప్రసంగించారు.

భిన్నదృక్పథాలు కలిగిన రాజకీయ పక్షాలకు చెందిన వారైనప్పటికీ, ఆ ఇద్దరిమధ్యా ఉన్న మైత్రీబంధాన్ని ఆ సభలో కళ్ళారా చూశాను. ఒక తెలుగు పత్రికకు ప్రధానమంత్రి ఇంట శతజయంతి జరగటం, స్వాతంత్ర్యోద్యమ కాలంలో కృష్ణాపత్రిక సేవలను వారిద్దరూ ప్రస్తుతించటమూ, పాత్రికేయ విలువల గురించి మాట్లాడటమూ ఎంతో ఆనందాన్నిచ్చాయి.

2002లో హైదరాబాదులో శ్రీ పి.వి. నరసింహారావు రాజభవనులో బసచేసి ఉన్నారు. తెలుగు భాషా చైతన్యసమితి సభ్యులను తీసుకువెళ్లి తెలుగు భాషోద్యమం గురించి, రాష్ట్ర రాజధాని నగరంలో తెలుగుతల్లి విగ్రహానికి తెలుగులో నామ ఫలకం మార్పించటానికి చేసిన పోరాటం గురించి, సచివాలయం ప్రవేశ ద్వారం వద్ద పెద్ద తెలుగు అక్షారాలలో వ్రాయటం కోసం చేసిన ఆందోళన గురించి వివరించాము.

తెలుగుభాష పరిస్థితి నానాటికీ దిగజారిపోతోందని ఆవేదన వ్యక్తం చేశారాయన. "తెలుగు భాషను కాపాడేందుకు పెద్ద ఎత్తున ఉద్యమించండి. నా ఆశీస్సులు మీకుంటాయి. ఈ ఆందోళన మొదట ఆంధ్రప్రదేశ్ లో చేపట్టండి. తర్వాత జనాభాలో 11% తెలుగువారున్న తమిళనాడు , ఒరిస్సా తదితర తెలుగు ప్రాంతాలకు విస్తరించండి. తెలుగుకు వెలుగు తేవటానికి ఉద్యమించాల్సిన సమయం ఇదే!" అన్నారు. ఆయన మాటలు ఆనాడు మాకు ఏనుగంత బలాన్నిచ్చాయి.

తెలుగుకి ఇతర భాషలతో సమానమైన హోదా-ప్రతిపత్తి రావాలంటే, తెలుగువారు తమ భాషపై గౌరవం పెంచుకున్నప్పుడే సాధ్యం అవుతుందన్నారాయన. మన రాష్ట్ర సరిహద్దు ప్రాంతాల్లో ఆదిలాబాద్ వాళ్లు మహారాష్ట్రలోనూ, చిత్తూరు వాళ్లు తమిళంలోనూ మాట్లాడటం ఫ్యాషన్ అనుకుంటారు. కానీ మహారాష్ట్రులు గానీ, తమిళులుగానీ తెలుగు మాట్లాడటం

ఫ్యాషన్ అనుకోరు. వారు తమ భాషలకు ఇస్తున్న గౌరవాన్ని మనం మన భాషకు ఇవ్వకపోవటమే ఇందుకు కారణం. మొదట మనం మన బాషకు గౌరవం ఇవ్వాలి. అందువలన మన భాషకు కొత్త శక్తి వస్తుంది...” అని శ్రీ పి.వి. మాటలు మనం సదా గుర్తుంచుకోవాలి. మన భాషను మనం గౌరవించుకోవాలి. అప్పుడే మన మాతృభాష మృతభాష కాకుండా ప్రపంచ భాషగా రూపుదిద్దుకుంటుంది

రాజకీయంగా శ్రీ పి.వి. అనుభవాలు వేరు. దేశానికి వారు చేసిన సేవ నిరుపమానం. తెలుగు భాషా పరిరక్షణకు దారి చూపిన దీపస్తంభం ఆయన! ఆ వెలుతురు బాటలో తెలుగు వ్యక్తిత్వ నిర్మాణానికి నడుంకట్టడమే ఈ సందర్భంగా వారికి మనం ఇవ్వగలిగిన నివాళి.

**చివరిగా ఒక మాట :**

1972లో భారత స్వాతంత్ర్య రజతోత్సవాల సందర్భంగా ఆగష్టు 14 అర్థరాత్రి ప్రత్యేక శాసనసభా సమావేశం జరిగింది. అ సమావేశాన్ని గేలరీలో కూర్చుని ప్రత్యక్షంగా వీక్షించాను. ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు తన సందేశాన్ని

“ఆ నిద్రాణ నిశీథిని మానిసి మేల్కాంచిన నాడు
ఒళ్లు విరిచి కళ్లు తెరిచి ఓహో అని లేచినాడు” అంటూ ప్రారంభించారు



“నేనొక చైతన్యోర్మిని...
నిస్తుప్రగతి శకలమును...
ఇది నా సంతతకర్మ!
మరే హక్కులు లేవు నాకు...
ఆ నిద్రాణ నిశీధి మహిత జాగృతి పుంజముగ
వెలుగుటయే నా తపస్సు
వెలిగించుట నా ప్రతిజ్ఞ!!!”

ఇవి శ్రీ పి.వి. మనసులోని మాటలు. అంతరంగపు లోతుల్లోంచి పెల్లుబికి వచ్చిన ‘ఆర్తి’ ఈ కవిత! అద్రిప్రోన్నత వ్యక్తిత్వానికి తెలుగుదనాన్నిస్తే అది శ్రీ పి.వి. రూపంలో వెలుగులీనుతూ ఉంటుందివుంటుంది!

(గమనిక: ఈ వ్యాసం తొలుత తెలుగు అకాడెమీ వారి “తెలుగు” లో ప్రచురితమైంది)

# అరుదైన రాజనీతిజ్ఞుడు పి.వి. నరసింహారావు



**డా. కొండుభట్ల రామచంద్రమూర్తి**
జర్నలిస్టు, హైదరాబాద్
99080 02211

భారత ప్రధానులలో ఎవరి ప్రత్యేకత వారిది. జవహర్ లాల్ నెహ్రూ నవభారత నిర్మాత. రెండు వందల సంవత్సరాలు ఈస్ట్ ఇండియా కంపెనీ యజమానులుగా, వలస రాజ్యాధిపతులుగా బ్రిటిష్ వారు నిర్దాక్షిణ్యంగా పీల్చి పిప్పిచేసి దీనస్థితిలో వదిలివెళ్ళిన దేశాన్ని పునర్నిర్మించుకోవడానికి నెహ్రూ వంటి సమున్నత వ్యక్తిత్వం కలిగిన దార్శనికుడు అవసరమైనాడు. ఒకవైపు ప్రభుత్వ పెట్టుబడులతో భారీ పరిశ్రమలనూ, భారీ నీటిపారుదల ప్రాజెక్టులనూ నిర్మిస్తూనే, ఐ.ఐ.టీ. వంటి ప్రపంచస్థాయి విద్యాసంస్థలు నెలకొల్పుతూ ప్రగతి బాటలు వేశారు. దేశాభివృద్ధికి శక్తివంచన లేకుండా కృషి చేశారు. స్వాతంత్ర్యం సముపార్జించిన తర్వాత దేశాన్నిపునః నిర్మించడానికీ, ఆధునిక దేశాల సరసన నిలపడానికీ అవలంభించిన విధానాలు కాలమాన పరిస్థితులకు అనుగుణమైనవి. ప్రధానిగా పి.వి. సాధించిన విజయాలను మూడు విధాలుగా చెప్పుకోవచ్చు. మొదటిది - దేశానికి శాశ్వతంగా మేలు చేసే ఆర్థిక సంస్కరణలను అనితరసాధ్యమైన రీతిలో ప్రవేశపెట్టడం. రెండవది - మైనారిటీ ప్రభుత్వాన్ని అయిదేళ్ళూ నిరాఘాటంగా నడిపించడం. మూడోది - ఇజ్రాయిల్ తో దౌత్యసంబంధాలు పెట్టుకోవడం. 'లుక్ ఈస్ట్ పాలసీ' పేరుతో తూర్పు ఆసియా దేశాలతో దౌత్య, వాణిజ్య సంబంధాలను విశేషంగా పెంపొందించడం. తక్కిన విజయాలు అనేకం ఉన్నాయి. ఈ మూడు మాత్రం పి.వి.ని అసాధారణ రాజనీతిజ్ఞుడుగా నిలిపాయి.

## మధ్యేమార్గమే శరణ్యం :

జయప్రకాశ్ నారాయణ వంటి సోషలిస్టు నాయకులు చెప్పినట్టు మొత్తం ప్రభుత్వరంగంపైనే ఆధారపడలేదు. చక్రవర్తి రాజగోపాలాచారి ప్రబోధించినట్టు ప్రారంభంలోనే ప్రైవేటు రంగానికి పట్టం కట్టలేదు. మధ్యేమార్గం అనుసరించారు.

ఇటు సోవియెట్ యూనియన్ నూ, అటు అమెరికా, పశ్చిమ ఐరోపా దేశాలనూ గమనించి భారతదేశానికి ఎటువంటి ఆర్థిక విధానాలు సరిపోతాయో నిర్ణయించారు. అన్ని ప్రజాస్వామ్య దేశాల రాజ్యాంగాలను పరిశీలించి భారత రాజ్యాంగాన్ని బాబాసాహెబ్ అంబేడ్కర్ నాయకత్వంలో ఏ విధంగా రాసుకున్నామో, అన్ని దేశాల ప్రగతిపథాలను పరిశీలించి మనదేశానికి అనువైన అభివృద్ధి బాటను నిర్ణయించుకున్నాం. ప్రభుత్వరంగాన్ని నిర్మించడం, ప్రాథమిక సదుపాయాలను ప్రభుత్వ వ్యయంతో కల్పించడంతో పాటు ప్రైవేటురంగానికి సైతం మద్దతు ఇచ్చాం. అధికారపార్టీకి ఎన్నికల నిధులు అపారంగా అందజేస్తూ ప్రభుత్వ విధానాల నుంచి లబ్ధిపొందే 'క్రోనీ' కేపిటలిస్టులు ఆ రోజుల్లో అంతగా ఉండేవారు కాదు. టాటా, బిర్లా వంటి సాంప్రదాయక పెట్టుబడిదారులు ఉండేవారు. ఇటు ప్రభుత్వ రంగం, అటు ప్రైవేటు రంగం అభివృద్ధి చెందాయి కనుకనే 1947 నుంచి 1991 వరకూ మనది మిశ్రమ ఆర్థికవ్యవస్థ అని చెప్పుకునేవాళ్ళం. నెహ్రూ, ఇందిరాగాంధీ పాలనలో అమలు జరిగిన మిశ్రమ ఆర్థిక విధానం ఫలితంగానే 1991లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టడానికి తగిన ప్రాతిపదిక ఏర్పడింది. ఆర్థిక అసమానతలు కొంతవరకూ తగ్గాయి. తలసరి ఆదాయం ఒక మోస్తరుగా పెరిగింది. నవభారత ఆర్థికవ్యవస్థకు బలమైన పునాదివేసిన కార్యదక్షుడైన తొలి ప్రధానిగా నెహ్రూ పేరు చరిత్రలో సువర్ణాక్షరాలతో నిలిచి ఉంటుంది. నెహ్రూ అనంతరం ప్రధాని పదవిని స్వీకరించిన లాల్ బహద్దూర్ శాస్త్రి పాకిస్తాన్ పైన జరిగిన యుద్ధంలో విజయం సాధించి భారత్ ఆత్మగౌరవాన్ని నిలిపారు. ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించారు. 'జైజవాన్, జైకిసాన్' నినాదాన్ని ప్రజల మనస్సులలో బలంగా నాటారు.

## మందగించిన ప్రగతి :

లాల్ బహద్దూర్ ఆకస్మిక మృతి తర్వాత ప్రధానమంత్రి పదవి కోసం జరిగిన ఎన్నికలలో మొరార్జీ దేశాయ్ పైన ఇందిరాగాంధీ గెలుపొంది పదవీ బాధ్యతలు స్వీకరించారు. మిశ్రమ వ్యవస్థ కారణంగా ఆర్థికాభివృద్ధి గణనీయంగా జరగలేదు. హిందూ రేట్ ఆఫ్ గ్రోత్ అంటూ మన కురచదనాన్ని ప్రపంచ దేశాలు ఎద్దేవా చేసేవి. చైనా, పాకిస్తాన్ తో వైరం కారణంగా రక్షణ వ్యయం పెరిగింది. హరితవిప్లవం విజయవంతం అయ్యేవరకూ ఆహారధాన్యాలు సైతం దిగుమతి చేసుకునే దుస్థితిలో ఉన్నాం. 1970-71లో తూర్పు పాకిస్తాన్ లో పాకిస్తాన్ ప్రభుత్వం అరాచకపాలన కారణంగా, షేక్ ముజీబుర్ రెహ్మాన్ నాయకత్వంలో జరిగిన స్వతంత్ర పోరాటానికి ఇందిరాగాంధీ నేతృత్వంలోని భారత దేశం మద్దతు ఇచ్చింది.

నాటి తూర్పు పాకిస్థాన్ విమోచనకోసం పోరాటం చేసిన యోధులకు భారత సైన్యం బాసటగా నిలిచింది. మూడువేలమందికి పైగా భారత జవాన్లు నేలకొరిగారు. జనరల్ నియాజీ నాయకత్వంలో సుమారు లక్ష మంది పాకిస్తాన్ సైనికులు జనరల్ అరోరాకు లొంగిపోయారు. స్వతంత్ర బంగ్లాదేశ్ ఆవిర్భవించింది. పోఖ్రాన్ లో అణుపరీక్ష నిర్వహించడం ద్వారా ఇందిరాగాంధీ స్థాయి మరింత పెరిగింది. 1972 నాటి ఎన్నికలలో ఘనవిజయం సాధించిన ఇందిరాగాంధీ చుట్టూ గుజరాత్ పరిణామాలూ, జయప్రకాశ్ నాయకత్వంలో ప్రతిపక్షాల ఉద్యమ రాజకీయాలూ, రాయ్ బరేలీ నుంచి ఇందిర ఎన్నిక చెల్లదంటూ అలహాబాద్ హైకోర్టు తీర్పూ అకస్మాత్తుగా కమ్ముకొని వచ్చాయి. పోరాటశీలిగా పేరుతెచ్చుకున్న ఇందిరాగాంధీ దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించారు. రెండేళ్ళ తర్వాత ఆమే స్వయంగా ఎన్నికలు ప్రకటించారు. ఎన్నికలలో ఘోర పరాజయం చవిచూశారు. ఆత్యయిక పరిస్థితిని దేశ ప్రజలు ఆమోదించలేదని తెలుసుకున్నారు. జే.పీ. ఆశీస్సులతో మొరార్జీ దేశాయ్ నాయకత్వంలో ఏర్పడిన జనతా ప్రభుత్వం రెండేళ్ళు నిండకుండానే పడిపోయింది. తర్వాత ఏర్పడిన చరణ్ సింగ్ ప్రభుత్వం ఆయుష్షు మరీ అల్పం. ఆరు మాసాలకే ఆరిపోయింది. అనంతరం జరిగిన ఎన్నికలలో ఇందిరాగాంధీ నాయకత్వంలోని కాంగ్రెస్ పార్టీ ఘనవిజయం సాధించింది. ఆ తర్వాత పంజాబ్ లో తలెత్తిన వేర్పాటువాదాన్ని అణచివేయడానికి ఇందిరాగాంధీ తనదైన శైలిలో స్వర్ణదేవాలయంపైకి భద్రతాదళాలను పంపించి భింద్రేన్ వాలాను మట్టుపెట్టారు. అందుకు మూల్యంగా ఆత్మబలిదానం చేశారు. సిక్కు భద్రతాధికారుల చేతులలోనే హతమైనారు. అయినా ఆమె అత్యంత సాహసోపేతమైన ప్రధానిగా చరిత్రపుటలలో నిలిచిపోతారు.

> చరిత్రలో నిలిచిపోయే మూడవ ప్రధాని పాములపర్తి వేంకట నరసింహారావు. దక్షిణాది నుంచి ప్రధానమంత్రి పదవిని అధిష్టించిన తొలి వ్యక్తి.

**చరిత్రలో నిలిచే ప్రధాని :**

చరిత్రలో నిలిచిపోయే మూడవ ప్రధాని పాములపర్తి వేంకట నరసింహారావు. దక్షిణాది నుంచి ప్రధానమంత్రి పదవిని అధిష్టించిన

తొలి వ్యక్తి. తనకంటూ కులబలం కానీ, రాజకీయ అండదండలు కానీ లేని మేధావి. వివాదరహితుడు. లోక్ సభ కు పోటీ చేయకుండా హైదరాబాద్ కి తిరిగి వచ్చేందుకు సర్వం సిద్ధం చేసుకొని కూర్చున్న పెద్దమనిషిని అనూహ్యమైన పరిస్థితులు అకస్మాత్తుగా ప్రధాని పీఠంపైన కూర్చోబెట్టాయి. ఎల్.టీ.టీ. చేతిలో రాజీవ్ గాంధీ హత్య జరగడం, సోనియాగాంధీ శోక సముద్రంలో మునిగి ప్రధాని పదవిని స్వీకరించడానికి సిద్ధంగా లేకపోవడం, డాక్టర్ శంకర్ దయాళ్ శర్మ అనారోగ్య కారణాలపైన ప్రధాని పదవిని చేపట్టడానికి సంసిద్ధత వ్యక్తం చేయకపోవడంతో దేశంలోని అత్యున్నత రాజకీయ పదవి పి.వి.ని వెతుక్కుంటూ వచ్చింది. పి.వి. అమాయక చక్రవర్తి కాదు. మంచితనం, మర్యాద, విలువలు మూర్తీభవించిన వ్యక్తి. కానీ రాజకీయంగా తనకు కలిసి వచ్చే అంశాలు ఏమిటో, ఎదురయ్యే అవకాశాలు ఏమిటో తెలిసిన గడసరి. రాజీవ్ గాంధీ మరణం తర్వాత ప్రధాని పదవి తనను వరించే అవకాశం ఉన్నట్టు గ్రహించి అందుకు తనదైన రీతిలో పావులు కదిపిన రాజకీయనేత.



**అపారమైన అనుభవం, విశేషమైన వివేకం :**

ప్రధాని పదవిని నిర్వహించేందుకు అవసరమైన అనుభవం పి.వి.కి దండిగా ఉన్నది. విశేషమైన వివేకం ఉంది. ఆంధ్రప్రదేశ్ లో విద్యామంత్రిగా, జైళ్ళ శాఖామంత్రిగా, ఇతర శాఖల మంత్రిగా అనేక ప్రయోగాలు చేసి తన సృజనాత్మకతను నిరూపించుకున్నారు. ముఖ్యమంత్రిగా భూసంస్కరణలనూ నిజాయితీగా అమలు చేయడానికి ప్రయత్నించారు. తన కుటుంబం పేరు మీద ఉన్న 500 ఎకరాల భూమినీ 1971లోనే ముఖ్యమంత్రి హోదాలో ప్రభుత్వానికి అప్పగించారు. సీమాంధ్రలో భూస్వాములు 'జై ఆంధ్ర ఉద్యమం' నడిపించారు. కాకాణి వెంకటరత్నం అకాల మరణంతో ఉద్యమం ఉధృతమైంది. ఇందిరాగాంధీ ఆదేశాలమేరకు ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పుకున్నారు. తిరిగి ఇందిరాగాంధీ అభీష్టం మేరకే దిల్లీలో ఏ.ఐ.సీ.సీ. ప్రధాన కార్యదర్శిగా చేరిపోయారు. ఆత్యయిక పరిస్థితిలో జనతా ప్రభుత్వంపైన ఇందిరాగాంధీ చేసిన పోరాటంలో ఆమెకు కొండంత అండగా వున్నారు. ఇందిర, రాజీవ్ ప్రభుత్వాలలో హోంమంత్రిగా, మానవ వనరుల అభివృద్ధి శాఖ తొలి మంత్రిగా, విదేశాంగ మంత్రిగా, రక్షణ మంత్రిగా అనేక శాఖలు నిర్వహించారు. దేశంలో విద్యారంగంలో బలమైన సంస్కరణలు తెచ్చిన మేధావి

పి.వి. దిల్లీలో సిక్కుల నరమేధం జరిగినప్పుడు హోంమంత్రిగా పి.వి. అనేక పరిమితుల కారణంగా విఫలమైనారు. ఆత్యాయిక పరిస్థితి ప్రకటన సమయంలో కాసు బ్రహ్మానందరెడ్డి కేంద్ర హోంమంత్రిగా ఉంటూ ఎట్లా నామమాత్రంగా మిగిలిపోయారో అందరికీ తెలిసిందే. పైనుంచి ఆదేశాలూ, జోక్యాలూ, పరిమితులూ లేని శాఖల నిర్వహణలో పి.వి. సమర్థంగా, సృజనాత్మకంగా వ్యవహరించారు.

## పి.వి. పగ్గాలు చేపట్టినప్పుడు దేశం ఎట్లా ఉంది? :

పి.వి. నరసింహారావు ప్రధానిగా బాధ్యతలు స్వీకరించిన సమయంలో దేశ పరిస్థితులు ఎట్లా ఉన్నాయి? ఆర్థికంగా అత్యంత దిగజారిన దేశం దివాళా తీయడానికి సిద్ధంగా ఉన్నదివున్నది. పంజాబ్ వేర్పాటు ఉద్యమంతో రక్తమోడుతోంది. కశ్మీర్ లో ఉగ్రవాదులు విజృంభించి వినాశనం సృష్టిస్తున్నారు. నిజానికి రాజీవ్ గాంధీ ఇద్దరు కానిస్టేబుల్స్ తన నివాసం వద్ద తిరుగుతూ కనిపించారనే పేలవమైన సాకుతో చంద్రశేఖర్ ప్రభుత్వానికి కాంగ్రెస్ మద్దతు ఉపసంహరించకపోయి ఉన్నట్లయితే పరిస్థితి భిన్నంగా ఉండేది. ఆర్థిక సంస్కరణలు అమలు చేయడానికి చంద్రశేఖర్ సిద్ధపడుతున్న దశలో ఆయన ప్రభుత్వం కూలిపోయింది. ఫలితంగా లోక్ సభ కు మధ్యంతర ఎన్నికలు జరిగాయి. ఒక దశ పూర్తయిన తర్వాత రెండో దశ పోలింగ్ ప్రారంభం కావడానికి ముందు రాజీవ్ హత్య జరిగింది. రెండో దశలో కాంగ్రెస్ పార్టీకి సానుభూతి పవనాల కారణంగా ఎక్కువ సీట్లు వచ్చాయి. తొలి దశలో పేలవమైన ప్రదర్శనే. మొత్తం మీద లోక్ సభలో అతిపెద్ద పార్టీగా కాంగ్రెస్ అవతరించింది. కానీ ప్రభుత్వాన్ని నిబ్బరంగా నడిపించడానికి అవసరమైనన్ని సీట్లు రాలేదు. మైనారిటీ ప్రభుత్వ సారథిగా పి.వి. చేసిన పనులు ఆయనను సాహసోపేతమైన, సమర్థమైన, చాణక్యం తెలిసిన ప్రధానిగా ప్రపంచానికి చాటాయి. వైఫల్యాలు అందరికీ ఉంటాయి. సుదీర్ఘమైన రాజకీయ జీవితంలో విజయాలూ, అపజయాలూ ఉంటాయి.

## బాబరీ మసీదు అపకీర్తి అనివార్యం :

నెహ్రూకు చైనా చేతిలో భాతర్ చిత్తుగా ఓడిపోవడం అనే మచ్చ ఎప్పటికీ ఉంటుంది. ఇందిరాగాంధీకి ఎమర్జెన్సీ విధించారనే పేరు ఎంత చెరిపినా పోదు. అదే విధంగా బాబరీ మసీదు విధ్వంసం జరిగినప్పుడు అధికారంలో ఉన్న పి.వి.కి దాని తాలూకు బదనాం అనివార్యం. కానీ చరిత్రకారులు దేశంపైన ప్రభావం వేసిన అంశాలకే ప్రాధాన్యం ఇస్తారు. బాబరీ మసీదు విధ్వంసం తర్వాత మతకలహాలు

జరిగి కొన్ని వందల మంది ప్రాణాలు పోయినమాట నిజమే. ఆ వాస్తవం కూడా చరిత్రలో నమోదు అవుతుంది. కానీ పంజాబ్ లో వేర్పాటువాదాన్ని కే.పీ.ఎస్. గిల్ అనే పోలీసు ఉన్నతాధికారి ఆధ్వర్యంలో అణచివేసి శాంతిసుస్థిరతలను నెలకొల్పిన సంగతి కూడా నమోదు అవుతుంది. కశ్మీర్ లో హింస తగ్గి మానవ సంబంధాలు మెరుగుపడటానికి ప్రధాని దూతగా ప్రముఖ ఐ.ఏ.ఎస్. అధికారి కె.ఆర్. వేణుగోపాల్ చేసిన కృషి, దాని సత్ఫలితాలు కూడా రికార్డు అవుతాయి. అన్నింటికంటే ముఖ్యమైనదీ, దేశ దశనూ, దిశనూ మార్చివేసిందీ ఆర్థిక సంస్కరణలు. భాతరదేశంలో ఆర్థిక సంస్కరణలకు పి.వి. పితామహుడని మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ స్వయంగా అనేక సందర్భాలలో ప్రకటించారు. కాంగ్రెస్ అధినేతకు సరిపడని కారణంగా కాంగ్రెస్ నాయకత్వం ఆర్థిక సంస్కరణలకు పూర్తి మార్కులు మన్మోహన్ సింగ్ కి ఇవ్వవచ్చు గాక. పి.వి. ప్రమేయం లేకుండా ఆర్థిక సంస్కరణలను మన్మోహన్ సింగ్ అమలు పరిచారని చెప్పుకోవచ్చు గాక. కానీ చరిత్ర నిస్పాక్షికంగా ఉంటుంది . కాలం గడిచిన కొద్దీ నిజం నిగ్గుతేలుతుంది. వినయ్ సీతాపతి వంటి రచయితలు వాస్తవాలు వెలికి తీస్తారు.

> పి.వి. ప్రమాణస్వీకారం చేసినప్పటికి మూడు వారాలకు సైతం సరిపోను విదేశీమారక ద్రవ్యం మన దగ్గర లేదు. అంటే దిగుమతి చేసుకున్న వస్తువులకు చెల్లించవలసిన ద్రవ్యం మన దగ్గర లేదు.

### లండన్ బ్యాంకులో బంగారం తాకట్టు :

పి.వి. ప్రమాణస్వీకారం చేసినప్పటికి మూడు వారాలకు సైతం సరిపోను విదేశీమారక ద్రవ్యం మన దగ్గర లేదు. అంటే దిగుమతి చేసుకున్న వస్తువులకు చెల్లించవలసిన ద్రవ్యం మన దగ్గర లేదు. అంటే దేశం దివాళా అంచున దయనీయస్థితిలో నిలబడి ఉంది. లండన్ బ్యాంక్ కు రిజర్వ్ బ్యాంకు నుంచి బంగారం నిల్వలను తరలించి తాకట్టుపెట్టి ఐ.ఎం.ఎఫ్. రుణం పొందవలసిన దుస్థితిలో ఉన్నాం. ప్రధానిగా ప్రమాణం స్వీకరించక పూర్వమే పి.వి. ఆర్థిక పరిస్థితి గురించి ప్రవీణులతో చర్చించారు. ప్రధాని ఎవరైనా దేశం అప్పుడున్న దశలో ఏదో ఒకటి చేయకుండా ఉండలేని పరిస్థితి. ఏ రకమైన ఆర్థిక సంస్కరణలను ఏ దిశగా అమలు పరచాలో నిర్ణయించుకున్నారు. ప్రమాణం

స్వీకరించి ఇంటికి రాగానే మన్మోహన్ సింగ్ కు కబురు పెట్టారు. అంతకు ముందు రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ ఐ.జి. పటేల్ ను అడిగారు. అనారోగ్యం కారణంగా తనవల్ల కాదని పటేల్ చెప్పారు. అప్పుడు మన్మోహన్ సింగ్ ని పిలిపించుకున్నారు. మన్మోహన్ సింగ్ ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పని చేస్తున్న రోజులవి. విషయం చెప్పగానే మన్మోహన్ సింగ్ ఎగిరి గంతులు వేయలేదు. తనవల్ల అవుతుందో కాదో అనే సందేహం వెలిబుచ్చారు. పి.వి. పూర్తి భరోసా ఇచ్చిన తర్వాత అంగీకరించారు. తర్వాత జరిగింది జగమెరిగిన చరిత్ర.

## చరిత్ర చెప్పని నిజాలు :

చరిత్రలో చెప్పని అంశాలు కొన్ని ఉంటాయి. 1991నాటి కాంగ్రెస్ పరిస్థితి ఏమిటి? పి.వి.కి దక్కిన ప్రధాని పదవికోసం అర్రులు చాచిన శరద్ పవార్, అర్జున్ సింగ్ లు అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. పి.వి. పగ్గాలు చేపట్టిన సమయంలో ఆయన ప్రభుత్వం కొన్ని నెలలు తిరగకుండానే పడిపోతుందని గట్టిగా విశ్వసించినవారే అధికం. అయిదేళ్ళూ పి.వి. ప్రభుత్వం కొనసాగుతుందని ఎవ్వరూ ఊహించలేదు. బహుశా పి.వి.కి కూడా అంత నమ్మకం లేదేమో. రాజకీయాలలో రోజురోజుకీ పరిస్థితులు మారుతుంటాయి. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా తన వైఖరినీ, ప్రభుత్వ వైఖరినీ మార్చుకుంటూ వెళ్ళగలిగిన నైపుణ్యం, దక్షత పి.వి.కి ప్రత్యర్థుల అంచనాలకు అందని స్థాయిలో ఉన్నాయి. రాంటెక్ నుంచి లోక్ సభలో ప్రాతినిధ్యం వహించిన కారణంగానూ, నాగపూర్, పుణె లో చదువుకున్న కారణంగానూ మహారాష్ట్ర రాజకీయాలతో, రాజకీయ నాయకులతో పి.వి.కి లోతైన పరిచయాలూ, అవగాహనా ఉన్నాయి. పి.వి.కి శరద్ పవార్ తో సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. పవార్ కు పి.వి. పట్ల గౌరవభావం ఉన్నది. అర్జున్ సింగ్ తోనే పేచీ. మధ్యప్రదేశ్ కు చెందిన ఈ ఠాకూర్ కి ప్రధాని పదవిపైన వ్యామోహం పెరిగిందే కానీ తగ్గలేదు. ఎంత కాలం వేచి ఉండాలనే వుండాలనే అసహనం పెరిగింది. ఆయన వామపక్షాలకు సన్నిహితంగా ఉండేవారు. కాంగ్రెస్ లో అధిక సంఖ్యాకులు నెహ్రూవియన్ ఆర్థిక సిద్ధాంతాలకు దూరంగా జరగడాన్ని సహించే స్థితిలో లేరు. ఆర్థిక సంస్కరణలను ఆమోదించే మానసికస్థితిలో లేరు. రాజీవ్ గాంధీ ఆర్థిక సంస్కరణల అవసరాన్ని గుర్తించి కూడా ధైర్యం చేయకపోవడానికి కారణం కాంగ్రెస్ పార్టీ సైద్ధాంతిక స్థితే.

## అర్జున్ సింగ్ ప్రతికూల ధోరణి :

అటువంటి పార్టీకి నాయకుడుగా మౌలికమైన ఆర్థిక సంస్కరణలను ముందు పీటీలో ఉంటూ అమలు చేయించడం సాధ్యం కాదు. పార్టీలో

తిరుగుబాటుకు దారితీస్తుంది. అటువంటి తిరుగుబాటుకు నాయకత్వం వహించడానికి అర్జున్ సింగ్ సిద్ధంగా ఉన్నారు. సోనియాగాంధీని ప్రభావితం చేసే అవకాశం, సాన్నిహిత్యం ఆయనకు ఉన్నాయి. పి.వి.పైన సోనియాకు పితూరీలు చెప్పడం, ఆమె చెవిలో అబద్ధాలు నూరిపోయడం అర్జున్ సింగ్ ఒక నిరంతర కార్యక్రమంగా పెట్టుకున్నారు. పి.వి.కీ, సోనియాగాంధీకి మధ్యం ఎంత దూరం పెంచగలిగితే తన అభీష్టం అంత త్వరగా నెరవేరుతుందని మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి తలబోశారు. ఆయన దృష్టికోణం నుంచి ఆయన చేసింది రాజకీయంగా సరైన పనే కావచ్చు. సోనియాగాంధీ విషాదం నుంచి తేరుకొని రాజకీయాలలో ఆసక్తి ప్రదర్శించడం ప్రారంభించారు. రాజీవ్ గాంధీ హత్య దర్యాప్తు కుంటినడకన నడుస్తోందంటూ ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టే ప్రకటన ఆమె పేరుతో జారీ చేయించారు.

ఈ నేపథ్యంలో పోరాట పటిమ కంటే చాకచక్యం ప్రధానం అని భావించిన పి.వి. తాను తెరచాటున ఉంటూ మన్మోహన్ సింగ్ ను ముందు పెట్టుకొని దేశానికి అత్యవసరమైన ఆర్థిక సంస్కరణలను అమలు చేశారు. సంస్కరణలు ఏ మోతాదులో, ఏ విధంగా, ఎప్పుడు అమలు చేయాలో నిర్ణయించింది పి.వి.. వాటిని అమలు చేసింది ఆర్థిక మంత్రిగా మన్మోహన్ సింగ్. ఇద్దరూ సంయమనంతో సొంతపార్టీవారూ, ప్రతిపక్షాలవారూ మన్మోహన్ సింగ్ పైన దాడి చేసినప్పుడు ఆయన రాజీనామా పత్రం ప్రధాని కార్యాలయంలో సమర్పించి ఇంట్లో కూర్చుంటే పి.వి.ఆర్.కె. ప్రసాద్ ను పంపించి అనునయించి కర్తవ్యోన్ముఖుడిని చేసింది పి.వి.నే. 'మీరు సంస్కరణలు అమలు చేస్తూ వెళ్ళండి. మీకు రాజకీయంగా నా మద్దతు ఎప్పటికీ వుంటుంది. మీ మీద దాడి చేస్తున్నవారి ఉద్దేశం నన్ను గాయపరచాలనే. మీ పట్ల వారికి వ్యతిరేకత లేదు. వారి సంగతి నాకు వదిలేయండి. నేను చూసుకుంటాను. మీ పని మీరు కానివ్వండి,' అంటూ కురుక్షేత్రంలో అస్త్ర సన్యాసం చేసిన అర్జునుడికి కృష్ణుడు గీత బోధించినట్టు ఆధునిక భారత ఆర్థిక సమర మధ్యంలో మనోధైర్యం కోల్పోయిన మన్మోహన్ సింగ్ కి పి.వి. కర్తవ్య బోధ చేసేవారు.

## లైసెన్స్, పర్మిట్ రాజ్ రద్దు :

లైసెన్స్, పర్మిట్ వ్యవస్థను రద్దు చేయడం గొప్ప సంస్కరణ. ఇది పరిశ్రమల శాఖ పరిధిలోనిది. ఆ శాఖను పి.వి. నిర్వహిస్తున్నారు. పరిశ్రమల శాఖకు చెందిన పెను సంస్కరణలను ఆర్థిక శాఖ సహాయమంత్రి ప్రొఫెసర్ పి.జె.. కురియన్ (తర్వాత రాజ్యసభ ఉపాధ్యక్షుడుగా పని చేశారు.) ద్వారా పార్లమెంటులో

ప్రకటింపజేశారు. ఆర్థిక సంస్కరణల అనివార్యతను గుర్తించిన తర్వాత శరవేగంగా పావులు కదిపారు పీవీ. కాంగ్రెస్ పార్టీలోని మెజారిటీ వర్గం, ప్రతిపక్షాలూ, బీజేపీ వంటి ప్రతిపక్షాలూ వ్యతిరేకించినా లెక్కపెట్టకుండా, తొట్రుపడకుండా స్థిరమైన అడుగులు వేసి ఆర్థికరంగాన్ని ఆదుకొని అందలం ఎక్కించారు. ఈ రోజున ప్రపంచ బ్యాంకు ఇండియా పదిశాతానికి పైగా డీ.జీ.పీ. వృద్ధిని సాధించే రోజు త్వరలోనే ఉన్నదని ప్రకటించడం పి.వి.నాడు చేసిన సాహస ఫలితమే. పి.వి. తర్వాత వాజపేయి వచ్చినా, మన్మోహన్ సింగ్ వచ్చినా, నరేంద్రమోదీ వచ్చినా ఆయన అడుగుజాడలలో నడుచుకోవలసిందే. పి.వి. హయాంలో అమలు జరిగిన ఆర్థిక సంస్కరణలను కొనసాగించవలసిందే. వాటికి అనుబంధ సంస్కరణలనూ, తాజా తరం సంస్కరణలనూ అమలు చేయవలసిందే. దేశానికి పి.వి. చేసిన సేవ గురించి అంచనా వేయాలంటే పి.వి. ప్రధానిగా దేశం ఎటువంటి ఆర్థిక పరిస్థితిలో ఉన్నదో తెలుసుకొని, నేటి ఆర్థిక పరిస్థితితో పోల్చుకుంటే చాలు. ఆర్థికరంగంలో దేశానికి తిరుగులేని దిశానిర్దేశం చేసిన పి.వి. నిస్సందేహంగా చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయే అరుదైన, సమర్థుడైన, దార్శనికుడైన ప్రధానమంత్రి. ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెడుతున్న సమయంలో పి.వి. మానవీయదృష్టిని (రిఫార్మ్స్ విత్ హ్యూమన్ ఫేస్) మరచిపోరాదంటూ వక్కాణించారు. సంపద పెరగాలనీ, అది కిందివరకూ చేరాలనీ, పేదరికం నిర్మూలన కావాలనీ ఆయన ఆకాంక్షించారు. ఆయన జీవిత కాలంలోనే ఆ ఆశ అడియాసగానే మిగిలిపోయిందని గ్రహించి చింతించారు. పి.వి.ది అసాధ్యమైన ఆకాంక్ష మాత్రం కాదు.

### రాబడి వ్యత్యాసాలు తగ్గించడానికి ఆర్థిక సంస్కరణలు అడ్డంకి కాదు :

'రైజింగ్ ఇన్ ఈక్వాలిటీస్ ఇన్ ఇన్ కం ఇన్ ఇండియా, కీ రోల్ ఆఫ్ సోషియో-పొలిటికల్ ఫ్యాక్టర్స్' అనే పరిశోధనాపత్రంలో సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్ (సెస్) గౌరవాచార్యుడు డాక్టర్ సీ.హెచ్. హనుమంతరావు (ప్రణాళికాసంఘం మాజీ సభ్యుడు) ఒక కొత్త విషయాన్ని వెల్లడించారు. ప్రజల ఆదాయాలలో అంతరాలు తగ్గించిన దేశాలలో ఒకే భావజాలం కలిగిన ప్రభుత్వాలు లేవనీ, అనేక రకాల భావజాలాలు కలిగిన ప్రభుత్వాలు ఉన్నాయనీ వున్నాయనీ ఆయన తెలియజేశారు. 'జినీ ఇండెక్స్' ప్రకారం నిర్ణయించిన ఇటువంటి (ఆదాయాల మధ్య అంతరం తగ్గించిన) 19 దేశాలలో నాలుగు దేశాలు రైటిస్ట్ పార్టీల (మితవాద పార్టీల) పాలనలో ఉన్నాయనీ, నాలుగు దేశాలు వామపక్ష పాలనలో ఉన్నాయనీ, మూడు దేశాలు కుడివైపుకు వొరిగిన ప్రభుత్వాలు ఉన్నాయనీ, మరి మూడు దేశాలలో ఎడమవైపునకు వొరిగిన ప్రభుత్వాలు

ఉన్నాయనీ, ఐదు మధ్యేమార్గ ప్రభుత్వాలు కలిగి ఉన్నాయనీ వున్నాయనీ తేల్చారు. లాటిన్ అమెరికాలో ఆధునిక వామపక్షాలు అసమానతలను తగ్గించగలిగాయి. రాజకీయాధికారం అసమానంగా ప్రజల అనుభవంలోకి రావడం కారణంగా అమెరికా వంటి దేశాలలో రాబడిలో అసమానతలు పెరుగుతున్నాయని హనుమంతరావు అధ్యయనం నిరూపించింది. పిండితార్థం ఏమంటే ఆర్థిక సంస్కరణలు అమలు జరుగుతున్న దేశాలలో కూడా రాబడుల మధ్య వ్యత్యాసం తగ్గుతున్న సందర్భాలు ఉన్నాయి.

### పీవీ ఆకాంక్ష అసాధ్యం కాదు :

అందువల్ల 'ఎకనమిక్ రిఫార్మ్స్ విత్ హ్యూమన్ ఫేస్' అనే పి.వి.గారి నినాదం అసాధ్యమైనది కాదు. కొన్ని దేశాలలో సుసాధ్యమైనట్టు అధ్యయనాలు నిరూపిస్తున్నాయి. ఆర్థిక సంస్కరణలు అమలు పరిచేవారికి హృదయం ఉంటే, మానవీయ దృక్పథం వుంటే అట్టడుగున మగ్గుతున్న ప్రజలకు సాంత్వన చేకూరుతుంది. రాజ్యాంగ నిర్మాణం పూర్తయిన తర్వాత జాతికి అంకితం చేస్తూ అంబేడ్కర్ - ఈ రాజ్యాంగం ఫలాలు ఎట్లా ఉండబోతున్నాయనేది రాజ్యాంగాన్ని అమలు చేసేవారిపైన ఆధారపడి ఉంటుందని చెప్పారు. అది ఆర్థిక సంస్కరణలకూ వర్తిస్తుంది. నేల విడిచి సాము చేయడం పి.వి. జీవితంలో ఎన్నడూ జరగలేదు. ఆయన వాస్తవిక వాది, సంస్కరణ వాది, అభ్యుదయవాది, సృజనశీలి, ధీశాలి, ప్రభావశీలి. భారత రాజకీయ నాయకులలో శిఖర సదృశుడు. నిన్న ఎవరేమన్నా, ఈ రోజు ఎవరి అభిప్రాయం ఏమైనా, రేపు చరిత్ర స్పష్టంగా నిగ్గుతేల్చే నిజమిది. ఎవ్వరూ కాదనలేని సత్యం ఇది.



"The congress for some time remained as a respectable residue. But a comprehensive party cannot survive too long as a residue. It may be small in size at a given time, but its composition should still remain comprehensive. This could be termed as the widest connotation of secularism. The congress, therefore, is the most secular party in the real sense."

*— P. V. Narasimha Rao*

# విప్లవ తపస్వి, పి.వి.



అప్పరసు కృష్ణారావు
98102 23863

స్వాతంత్ర్యానంతరం దేశ ఆర్థిక సామాజిక చరిత్ర నెహ్రూ నుంచి రాజీవ్ వరకు ఒక ఘట్టమైతే, పి.వి. నరసింహారావు ప్రధాని కావడంతో మరో ఘట్టం ప్రారంభమైంది. పి.వి. తీసుకున్న నిర్ణయాలు దేశ ఆర్థిక, సామాజిక పరిణామాలను మలుపు తిప్పి మన కళ్లముందు కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించాయనడంలో సందేహం లేదు. పి.వి. ఇవాళ మన మధ్య లేకపోయినా పి.వి. యుగాన్ని మాత్రం మనం అనుభవించగలుగుతున్నాం.

మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు గారు ప్రధానమంత్రి పదవి చేపట్టినకాలం నుంచి ఆయన మరణించే వరకూ ఢిల్లీలో వివిధ పత్రికల్లో పనిచేసే అవకాశం నాకు లభించింది. ఉదయం, వార్త, ఆంధ్రప్రదేశ్ టైమ్స్, ఆంధ్రజ్యోతి పత్రికల్లో నేను విలేకరిగా ఉన్నాను. ఈ రీత్యా ఆ సమయంలో అతి సమీపం నుంచి దేశ రాజకీయ పరిణామాలను చూసే అవకాశము, ఆయన సన్నిహితులైన ఎంతో మందితో సంభాషించే అవకాశమూ లభించింది.

రాజకీయాల నుంచి పదవీ విరమణ చేయాలని భావించిన పి.వి. నరసింహారావు అనుకోకుండా అవకాశం రాగానే దేశ విస్తృత ప్రయోజనాల కోసం అనేక చర్యలు తీసుకున్నారు. అయిదేళ్లూ అనేక వ్యూహ, ప్రతివ్యూహాలతో తన ప్రభుత్వాన్ని కాపాడుకున్నారు. .

ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టడం మినహా గత్యంతరం లేదని గ్రహించడమే కాదు, సాహసోపేతంగా వాటిని అమలు చేసి దేశంలో నూతన ఆర్థిక సంస్కృతికి ఒరవడి దిద్దిన నేత పి.వి. నరసింహారావు. నిజానికి పి.వి. నరసింహారావు కూడా ఆర్థిక సంస్కరణల ద్వారా తానేదో దేశాన్ని మలుపు తిప్పుతున్నట్లు చిత్రించుకోవడానికి తొలి రోజుల్లో ఇష్టపడలేదు. అందుకు కారణం కాంగ్రెస్ లో ఉన్న అంతర్గత శక్తులు. మరో వైపు ఆర్థిక సంస్కరణలను తీవ్రంగా వ్యతిరేకిస్తున్న వామపక్షాలు ప్రబలంగా ఉండడంవుండడం. ఆయన ప్రధాని

కావడాన్ని జీర్ణించుకోలేని వారు మాత్రమే కాదు, ఒక దక్షిణాది నేత ప్రధాని కావడాన్ని సహించలేని వారు ఉన్నందువల్ల తనను తాను నిలదొక్కుకునేందుకు ఆయన అతి జాగ్రత్తగా వ్యవహరించారు. ప్రతి నిర్ణయాన్నీ ఆచితూచి తీసుకున్నారు. ప్రతి మాటనూ ఆచితూచి ఉపయోగించారు. కాంగ్రెస్ లో ఇందిరాగాంధీ, రాజీవ్ భక్తులు ఉన్నారని, ముఖ్యంగా రాజీవ్ గాంధీ అనుయాయుల ప్రాబల్యం ఎక్కువగా ఉన్నదని పి.వి.కి తెలుసు. అందుకే పార్టీ వేదికల్లో ఏ ఉపన్యాసం ఇచ్చినా నెహ్రూ, ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధీ పేర్లు ప్రస్తావించకుండా ఉండలేదు. ఈ ముగ్గురి ఆలోచనలకు భిన్నంగా తాను విప్లవాత్మకంగా వ్యవహరించానని తెలిసినప్పటికీ ఆయన వ్యూహాత్మకంగా తాను వారి అడుగుజాడల్లోనే నడుస్తున్నానని చెప్పేందుకు ప్రయత్నించారు.



సంస్కరణల ప్రయోజనాల పరిమితి, మార్కెట్ శక్తులను ఎంతవరకు అనుమతించాలన్న విషయంలో పి.వి.కి స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. మార్కెట్ శక్తులకు అందకుండా అత్యధిక సంఖ్యాకులైన ప్రజలు ఉన్నందువల్ల ప్రభుత్వాలు అవసరమైన మౌలిక సదుపాయాలు, సంస్థాగత మద్దతు, సమాజంలో సమాన అవకాశాలు, న్యాయపూరితంగా జీవించే పరిస్థితులు కల్పించగలిగినప్పుడే మార్కెట్ శక్తులు సరిగా పనిచేయగలుగుతాయని ఆయన అభిప్రాయపడ్డారు. అత్యంత సాహసోపేత నిర్ణయాలు తీసుకున్నప్పటికీ సాధ్యమైనంతవరకూ అన్ని వర్గాలను ఒప్పించే విధంగానే వ్యవహరించారు. చివరకు కార్మిక సంఘాలను కూడా ఆయన స్వయంగా మెప్పించే ప్రయత్నం చేశారు. కొత్త సవాళ్లు ఎదురైనప్పుడు కాలం చెల్లిన మాటల్ని పట్టుకుని వ్రేళ్లాడకూడదని ఆయన స్పష్టం చేశారు. అదే సమయంలో తన ప్రభుత్వం తీసుకున్న చర్యల విషయంలో వెనక్కు తగ్గేది లేదని, అదే సమయంలో ఐఎంఎఫ్ ముందు ఓడిపోవడం కానీ, లొంగిపోవడం కానీ తలెత్తే ప్రశ్నే లేదని పి.వి. పలు సందర్భాల్లో స్పష్టం చేశారు.

పి.వి. హయాంలో 18 పరిశ్రమలకు తప్ప అన్నిటికీ లైసెన్స్ రాజ్ ను రద్దు చేయడంమే కాదు, పరిశ్రమలపై నియంత్రణలు, అనుమతులకు సంబంధించిన అనేక సంస్థల్ని రద్దు చేశారు. ఇంటికి పంపించారు. స్టాక్ మార్కెట్ కు సంబంధించి

అనేక సంస్కరణలు అమలు చేశారు.

ప్రణాళికా సంఘానికి ప్రణబ్ ముఖర్జీని డిప్యూటీ చైర్మన్ గా నియమించి తర్వాత రాష్ట్రాలకు సహాయాన్ని క్రమబద్ధీకరించారు. నరసింహం కమిటీ సిఫారసుల ఆధారంగా బ్యాంకింగ్ సంస్కరణలను అమలు చేశారు. ప్రభుత్వ ప్రైవేట్ రంగ భాగస్వామ్యం (పి.పి.ఏ.) పి.వి. హయాంలోనే ప్రారంభమైంది. రహదారులు, ప్రైవేట్ టీ.వీ. ఛానెల్స్, విమానరంగంలో ప్రైవేటీకరణ, టెలికమ్ రంగంలో విప్లవం, మొబైల్ ఇంటర్నెట్ సేవలు అప్పుడే ప్రారంభమయ్యాయి.

పి.వి. నరసింహారావు హయాంలో జరిగాయని ప్రచారం జరిగిన కుంభకోణాలు ఏవీ నిజంగా కుంభకోణాలు కావని, అవన్నీ పి.వి.ని అప్రతిష్ట పాలు చేయడానికి కుట్రపూరితంగా సృష్టించాయని అర్థం చేసుకోవడానికి పెద్ద ఆలోచన అవసరం లేదు. వీటిలో స్టాక్ మార్కెట్ కుంభకోణం, జైన్ హవాలా వ్యవస్థీకృత లోపాలు, పి.వి.కి వారసత్వంగా వచ్చిన అవినీతి కార్యకలాపాల మూలంగా తలెత్తినవి కాగా, ప్రధానమైనవి కాగా లఖుభాయి పాథక్, సెయింట్ కిట్స్ ఆరోపణలు పి.వి. పై దుష్ప్రచారం చేసేందుకు సృష్టించినవని వేరే చెప్పనక్కర్లేదు. అందువల్లనే పి.వి.పై ఏ ఆరోపణా కోర్టులో నిలవలేదు. నిజానికి సెయింట్ కిట్స్ కుంభకోణం వి.పి.సింగ్ పై రాజీవ్ గాంధీ సృష్టించింది. దానికీ, పి.వి.కి ముడిపెట్టారు. లఖుభాయి పాథక్ అనే లండన్ వ్యాపారి న్యూస్ ప్రింట్ దిగుమతి కి సంబంధించిన పనిపై పి.వి. ఎక్కడో కలిస్తే హోజాయెగా (మీ పని జరుగుతుంది) అని పి.వి. హామీ ఇచ్చారట. నిజానికి న్యూస్ ప్రింట్ దిగుమతికీ, పి.వి. నిర్వహించిన విదేశీ శాఖకూ సంబంధం లేదు. స్టాక్ మార్కెట్ కుంభకోణం చేసింది హర్షద్ మెహతా. ఆయన పి.వి.ని కలుసుకుని ముడుపులు ఇచ్చారనడానికి ఒక్క ఆధారమూ దొరకలేదు. ఆయనను పి.వి. ప్రత్యర్థులే ప్రయోగించారని తర్వాతి కాలంలో తేలింది. జైన్ వ్యాపారులనుంచి ముడుపులు తీసుకున్నది వివిధ రాజకీయ పార్టీల నేతలు. జైన్ డైరీ సి.బి.ఐ.కి దొరికితే దానిపై విచారణకు ఆదేశించింది సుప్రీంకోర్టు. పివి ఎటువంటి రాజకీయాలు చేయకుండా చట్టం తన పని తాను చేసుకుంటుందని మౌనంగా ఉండడంతో ఆయన తమను కాపాడలేదని ప్రత్యర్థులు మండిపడ్డారు. తర్వాత వారే పి.వి.కి సమస్యలు సృష్టించారు.

పి.వి. మాజీ ప్రధానిగా ఉన్నప్పుడు అనేకసార్లు నేను ఆయనతో అయోధ్య గురించి చర్చించాను. నేను బాబ్రీ మసీదు కూలిపోతున్న సమయంలో అక్కడే

ఉన్నానని చెప్పినప్పుడు ఆయన ఆసక్తిగా అక్కడేం జరిగిందో తెలుసుకున్నారు. పి.వి. వాదనలు విన్న వారికెవరికైనా అయోధ్య ఉదంతంలో ఆయన పొరపాటు ఏమీ చేయలేదని అనిపిస్తుంది. నిజానికి అయోధ్య పై సానుకూల పరిష్కారం సాధించేందుకు పి.వి. ప్రయత్నాలు చేశారు. సాధువులు, చరిత్ర కారులు, పురాతత్వ శాస్త్రవేత్తలు, మఠాధిపతులతో చర్చలు సాగించారు. అయోధ్యపై పి.వి. స్వయంగా చర్చ జరిపితే సమస్య పరిష్కారం అవుతుందనే ఉద్దేశంతో ఆ చర్చలను ప్రత్యర్థులు సాగనివ్వలేదు. ఈ చర్చలు సాగుతున్న సమయంలోనే వి.హెచ్.పి. కరసేవ ప్రకటించడం, ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రి కల్యాణ్ సింగ్ సుప్రీంకోర్టుకు, జాతీయ సమగ్రతా మండలికి ఇచ్చిన వాగ్దానాలకు భిన్నంగా బాబ్రీమసీదు కూల్చివేత జరగడంతో పి.వి. ప్రయత్నాలు విజయవంతం కాలేదు. బిజెపి నేత ఎల్.కె.ఆద్వాణీ - పి.వి.ని బలహీనుడుగా భావించి కదిపిన పావుల వల్లే బాబ్రీ మసీదు కూల్చివేత జరిగిందనడంలో అనుమానం లేదు. కానీ, పి.వి. ఆ పరిణామాన్ని తట్టుకోగలిగారు.

ఆర్థిక విధానాలు, విదేశీ సంబంధాల విషయంలో గత నేతలుసాధించలేని ఎన్నో విజయాలను సాధించిన పి.వి. గత నేతలు సృష్టించిన అంతర్గత కల్లోలాలను కూడా పరిష్కరించేందుకు చెప్పుకోదగిన ప్రయత్నాలు చేశారు. పి.వి. నరసింహారావు ప్రధానమంత్రి పదవి చేపట్టే నాటికి అమెరికా, చైనాతో సహా అనేక దేశాలతో పి.వి. అధికారంలోకి రాగానే అంతర్జాతీయ వాతావరణానికి తగ్గట్లుగా చర్యలు తీసుకోవడం ప్రారంభించారు. ప్రచ్ఛన్న యుద్ధం సమసిపోయిన నేపథ్యంలో అమెరికాతో బలమైన సంబంధాలు అవసరమని ఆయన భావించారు. చైనాకు స్నేహ హస్తాన్ని చాచారు. ప్రధానంగా ఆసియాన్ దేశాలతో



వినూత్న సంబంధాలు ఏర్పర్చుకుని 'లుక్ ఈస్ట్' విధానానికి శ్రీకారం చుట్టారు. భారత అణు, క్షిపణి కార్యక్రమాన్ని బలోపేతం చేసి ఒక బలమైన దేశంగా భారత్ ను నిర్మించడం ప్రారంభించారు.

1995 డిసెంబర్ లో అణు పరీక్షలకు కూడా పి.వి. రంగం సిద్ధం చేశారు. ఆ విషయాన్ని అమెరికా పసికట్టడంతో ఈ పరీక్షలను వాయిదా వేసి ఆ బాధ్యతను వాజపేయికి అప్పజెప్పారు. తాను తిరిగి ప్రధాని అయితే తొలుత అణు పరీక్షల్ని నిర్వహించాలనుకున్నానని పి.వి. తనకు చెప్పినట్లు కార్గిల్ కమిటీ ఛైర్మన్, ఇనిస్టిట్యూట్ ఆఫ్ డిఫెన్స్ స్టడీస్ మాజీ డైరెక్టర్ కె. సుబ్రహ్మణ్యం ఒక వ్యాసంలో వెల్లడించారు.

తన హయాంలోనే కశ్మీర్ లో కూడా ఎన్నికలు జరిపించేందుకు పి.వి. రంగం సిద్ధం చేశారు. చరారేషరీఫ్ ఘటన జరిగి కశ్మీర్ లో కూడా పి.వి. హయాంలోనే ఎన్నికలు జరిగేవి. అంతర్జాతీయ వేదికల్లో కశ్మీర్ సమస్యను పాకిస్తాన్ లేవనెత్తకుండా ఉండేందుకు ప్రధాన ప్రతిపక్షమైన భారతీయ జనతా పార్టీని ఉపయోగించుకోవడం పి.వి. మేధావిత్వానికి అద్దం పడుతుంది. అంతర్జాతీయ వేదికల వరకు వచ్చే సరికి భారత దేశంలో అధికార పక్షం, ప్రతిపక్షం ఐకమత్యంగా వ్యవహరిస్తాయన్న సందేశం పంపడమే కాదు, స్వదేశంలో ప్రతిపక్షాలను తనతో పాటు కలుపుకుపోవడం కూడా ఆయన లక్ష్యంగా పెట్టుకున్నారు. ఐక్యరాజ్యసమితి మానవ హక్కుల వేదికపై పాకిస్తాన్ ప్రయత్నాలను తిప్పికొట్టేందుకు 1994లో అటల్ బిహారీ వాజపేయిని అమెరికాకు పంపారు.

అధికారంలోకి వచ్చినప్పటి నుంచీ, ఎప్పటికప్పుడు పి.వి. నరసింహారావు పార్టీలో అంతర్గతంగానూ, ఇతరపార్టీలతో బహిరంగంగానూ ఏకాభిప్రాయ సాధనకు ప్రయత్నం చేశారు. కాని ఆయనను పార్టీలో అంతర్గత శక్తులు, బయటి ప్రత్యర్థులు బలహీనుడుగా భావించి అవకాశం వచ్చినప్పుడల్లా గద్దె దించేందుకు ప్రయత్నించాయి. అదే సమయంలో తన అభిమానులు, కాంగ్రెస్ లో చాలా కాలంగా తనకు తెలిసిన సీనియర్ నేతల సహకారంతో ఆయన ఎప్పటికప్పుడు గట్టెక్కగలిగారు. పి.వి. నరసింహారావు ప్రారంభించిన సాహసోపేతమైన విప్లవాత్మకమైన ఆర్థిక సంస్కరణల చారిత్రక అవసరం కానీ, దేశానికి ఆయన విధానాల ఆవశ్యకత గానీ, అర్థం చేసుకోగలిగిన విశాల దృష్టి, అధికార కైవశ్యంపై పై దృష్టి పెట్టిన వారికి లేకపోయాయి. అలా ఉంటే ఇవాళ దేశం ఈ పరిస్థితుల్లో ఉండేది కాదు.

పి.వి. ప్రధాని అయిన తర్వాత కూడా ఆయన ఎక్కువ కాలం కొనసాగరని చాలా మంది భావించారు. మైనారిటీ ప్రభుత్వం కుప్పకూలిపోతుందని అనుకున్నారు. కాని ఆయన అనేక సవాళ్లను ఎదుర్కొని రాజకీయ చదరంగాన్ని అద్భుతంగా ఆడడం, బిజెపితో పాటు ప్రతిపక్షాల ఎత్తులకు పై ఎత్తులు వేయడమే కాక, పార్టీలో ప్రత్యర్థులను కూడా చిత్తు చేయడంతో బలంగా పాతుకుపోయారు. పి.వి.కి తిరుగులేదని ఆయన తప్పులు చేస్తే తప్ప తామేమీ చేయలేమని అర్జున్ సింగ్, శరద్ పవార్ అనుయాయులు వాపోయారు. అన్ని పీసీసీల్లో పి.వి. తన వారిని నియమించుకున్నారు. అయోధ్యలో బాబ్రీ కట్టడం కూల్చివేత, దక్షిణాదిలో జరిగిన ఎన్నికల్లో ఓటమి, హర్షద్ మెహతా ఆరోపణలు ఇవేవీ ఆయనను కదల్చలేకపోయాయి.

ప్రాచీన భారత దేశ సాంస్కృతిక మూలాలు, వేదాలు, ఉపనిషత్తులు, సాహిత్యం, మత విశ్వాసాల ప్రాధాన్యత పట్ల పి.వి.కి ఎంత ప్రగాఢమైన అవగాహన ఉన్నదో, అంతే ఆధునిక భావాలు, టెక్నాలజీ పట్ల స్పృహ ఆయనకు వున్నాయి. ఒక రకంగా ఆయన పాత కొత్తల మేలు కలయిక. అతివాద, మితవాదాలకు దూరంగా ఉండే మధ్యే మార్గ వాది. బౌద్ధం తెలిసిన జ్ఞాని. చుట్టూ ఉన్న పరిస్థితులపై మనసు తిరుగుబాటు చేస్తున్నా అదుపులో పెట్టుకుని అడుగులు ముందుకు వేసే విప్లవ తపస్వి. అలల్ని ఉధృతంగా పంపి సునామీ సృష్టించగల శక్తి ఉన్నా ఒకోసారి ప్రశాంతంగా కనపడే సముద్రం. ఆయన లాంటి భావాలు కలవారు ఈ దేశానికి ఎంత అవసరమో కాంగ్రెస్ నేతలకు అర్థం కాలేదు. 'యద్యపి శుద్ధం, లోక విరుద్ధం, నాచరణీయం, నా కరణీయం.' (ఆలోచన మంచిదైనప్పటికీ, ప్రజలు వ్యతిరేకిస్తే అది చేయకూడదు) అని ఒక సందర్భంలో చెప్పిన పి.వి. నిజమైన ప్రజాస్వామిక వాది.



**"In july 1991, he opened the economy and dismantled import controls, lowered customs duties, and devalued the currency. The move virtually abolished licensing controls on private investment, dropped tax rates, and broke public sector monopolies. It was felt as though a second independence had arrived"**

*— R.P. Bhattacharjee*

# మహామంత్రి పి.వి.



మా శర్మ, కాలమిస్ట్
✆ 93931 02305

నేటికి కచ్చితంగా వంద సంవత్సరాల క్రితం (1921), ప్రఖ్యాత జంటకవులు కొప్పరపు సోదరులు పశ్చిమ గోదావరి జిల్లా వంగిడిగూడెంలో రాజా బొమ్మదేవర నాగన్ననాయుడు రాజాస్థానంలో 'సంపూర్ణ శతావధానం' చేశారు. పీవీ నరసింహారావు పుట్టిన సంవత్సరం కూడా 1921. ఈ మహామనిషి పుట్టి శతవసంతాలు సంపూర్ణమయ్యాయి.ఈ సందర్భంలో, ఈ సంరంభంలో కొప్పరపు కవులు రచించిన ఒక పద్యాన్ని గుర్తు చేసుకుందాం.ఇది ఆశువుగా చెప్పినది. ఎట్టివారు మంత్రిపదవికి అర్హులు? ఇది ఒక పృచ్ఛకుడు సంధించిన ప్రశ్న. దీనికి కొప్పరపు కవుల పద్యరూపమైన సమాధానం. "పతికిన్ భూప్రజకాప్తుడై, బహు విధోపాయంబులన్ శాత్రవ/ప్రతతిం గీఢ్వడ జేసి, రాణ్మణికి హర్షశ్రీలు సేకూర్చి, ధీ/ చతురుండై, పటుకార్య కౌశలుడునై సత్కీర్తులం బొల్తునే/ మతిమంతుండతడే యమాత్యపద సంభావ్యుండగున్ భూవరా" - ఇదీ సంపూర్ణ పద్యం. మంత్రిగా పీఠంపై కూర్చోవలసిన వారికి ఎటువంటి అర్హతలు ఉండాలో  కవులు స్పష్టంగా వివరించారు. రాజుకు, ప్రజలకు పరమ ఆప్తుడై, బహు ఉపాయాలతో శత్రువులను తొక్కిపడేసేవాడై, రాజ్యానికి ఎల్లవేళలా సంతోషాన్ని, ఆనందాన్ని కలుగజేస్తూ, చతుర బుద్ధిబల సంపన్నుడై, ఎటువంటి కార్యాన్నైనా అలవోకగా నిర్వహించే చాతుర్యం కలిగి, రాజ్యానికి, రాజుకు, ప్రజలకు, మంత్రిమండలికి, సత్కీర్తులు కలుగజేసే మతిమంతుడు ఎవరై ఉంటారో? అటువంటివారే మంత్రిపదవికి సంపూర్ణంగా అర్హులౌవుతారు రాజా!.... అని ఈ పద్యం చెప్పే తాత్పర్యం. ఎప్పుడో వందల సంవత్సరాల క్రితం రాజాస్థానాలలో అటువంటి ప్రధానమంత్రులు, మహామంత్రులు ఉండేవారు. అటువంటివారినే మంత్రులుగా నియమించుకొనే ప్రభువులు ఉండేవారు. స్వాతంత్ర్యం రాక ముందు, దివానులు కూడా అటువంటివారే ఉండేవారు. పీవీ నరసింహారావు నాటికి నూరుశాతం అటువంటి విలక్షణ లక్షణ సంపన్నుడైన మంత్రీశ్వరుడే.అటువంటి మహామంత్రులకు అసలు సిసలైన వారసుడే.స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత

మారుతున్న రాజకీయ ప్రభుత్వాల నేపథ్యంలో, పూర్వుల వలె సకల సద్గుణ, సర్వజ్ఞాన క్రియాశూరులైన మంత్రులు దొరకడం దుర్లభమేనని నడుస్తున్న చరిత్ర చెబుతోంది. ఇటువంటి సంధికాలంలోనూ కేంద్రమంత్రిగా, ప్రధానమంత్రిగా పీవీ నరసింహారావు దొరకడం దేశానికి వైభవ చిహ్నం. ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధీ ప్రధానులుగా దేశాన్ని పాలించిన సమయంలో, కేంద్రమంత్రిగా పీవీ విశేషమైన సేవలు దేశానికి అందించారు. వ్యక్తిగతంగానూ వారికి విశిష్టమైన సలహాలను అందజేశారు. తర్వాత కొంతకాలానికి ఆయనే రాజు అయ్యారు. ఆ సమయాన్ని అద్భుతంగా సద్వినియోగం చేసుకున్నారు. ప్రభువుగా తనకు దక్కిన స్వాతంత్ర్యానికి పొంగిపోయి, నియంతగా మారక, ప్రజాస్వామ్యయుతంగా పాలనను అందించారు. రాజు - మంత్రి ఇద్దరి అంతరంగాలు బాగా ఎరిగిననవాడు కాబట్టి, మంచి మంత్రులను, మంచి సలహాదారులను నియమించుకున్నారు. " రాగ ద్వేషాలకు అతీతంగా, నిష్పక్షపాతంగా విధులను నిర్వహిస్తాం, అని ప్రమాణ స్వీకార మహోత్సవంనాడు అందరు మంత్రులు ప్రమాణం చేస్తారు. అదికూడా ఆత్మసాక్షిగా అంటూ ఒట్టు కూడా వేస్తారు. ఆ తర్వాత చరిత్రను గమనిస్తే, ఎందరు ఆ ప్రమాణాన్ని పాటించారన్నది లోక విదితమే. దాన్ని అక్షరాలా పాటించినవారు అతి తక్కువమంది. వారిలో ప్రథమశ్రేణీయుడుగా గణనీయుడు పీవీ. ఆణిముత్యాల వంటి ఎందరినో తన సలహా మండలిలో, వివిధ హోదాల్లో నియమించుకున్న ప్రతిభా పక్షపాతి. ఆ జాబితా అతి పెద్దది. ఒక్క మన్ మోహన్ సింగ్ చాలు, గొప్పగా ఉదాహరించడానికి. పాఠాలు చెప్పుకుంటున్న ఆచార్యుడిని తీసుకువచ్చి, కేంద్రమంత్రి స్థానంలో కూర్చోబెట్టారు. తదనంతరం ఆయనే ప్రధానమంత్రిగా పదేళ్లు దేశాన్ని పాలించారు. అంతటి దార్శనికత పీవీ ప్రతిభ. ఎవరిని ఎప్పుడు ఎక్కడ ఎలా నియమించుకోవాలో తెలియడం కూడా మంచి మంత్రికి వుండే మంచి లక్షణం. పీవీని అపరచాణుక్యుడుగా అభివర్ణిస్తారు. పీవీలో చాణుక్యుడుతో పాటు తిమ్మరసు, తిక్కన, అల్లసాని పెద్దన కూడా ఉన్నారు. చాణక్యుడు అనగానే అర్థశాస్త్రం గుర్తుకు వస్తుంది. పీవీ అనగానే ఆర్థిక సంస్కరణలు గుర్తుకు రాక తప్పవు. 'అర్థశాస్త్రం'లో కేవలం ఆర్థిక అంశాలే కాదు. అనేకం ఉన్నాయి. పాలన, రాజనీతి, మనస్తత్వశాస్త్రం, భౌగోళిక పరిజ్ఞానం, విదేశాంగ విధానం మొదలైన విశేష అంశాల కలయిక కౌటిల్యుడి 'అర్థశాస్త్రం'. పీవీ జ్ఞానం కూడా వీటన్నిటి సముదాయమే. చాణుక్యుడు /కౌటిల్యుడు ఎన్నో ఆర్థిక సంస్కరణలను అమలు పరచాడు. పీవీ కూడా ఇంచుమించుగా అదే వరుసలో సంస్కరణలు చేపట్టాడు. కాలమానాలను బట్టి వ్యూహాలు, ప్రాధాన్యతలు మారాయి అంతే. చాణుక్యుడు

పేదలపట్ల ఎంతో దయకలిగి ఉండేవాడు. చివరి దశలో తన సంపదనంతా పేదలకే దానం చేశాడు. పీవీ తన వందలాది ఎకరాల భూమిని తొలిదశలోనే పేదలకు దానం చేశారు. చాణుక్యుడికి భయం అంటే ఏమిటో తెలియదు. పీవీ కూడా తాను చేపట్టాలనుకున్న కార్యక్రమాలన్నీ నిర్భీతిగా చేశారు. ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో భూసంస్కరణలు చేపట్టినప్పుడు భూస్వాములంతా బెదిరించే ప్రయత్నం చేసినా, ఎక్కడా లొంగలేదు, తగ్గలేదు. చివరికి పదవిని కోల్పోయినా లెక్కచేయలేదు. ప్రధానమంత్రి పదవిని చేపట్టినప్పుడు కూడా ఎవరి బెదిరింపులకు చలించలేదు. ఆయన అంతరాత్మకు తప్ప దేనికీ వెరవలేదు. అందుకే, ఏ పని చేసినా త్రికరణశుద్ధితోనే ఆచరించారు. రాజు తన ఆధిపత్యాన్ని కాపాడుకోడానికి, శత్రువుల నుంచి తనను, తన రాజ్యాన్ని రక్షించుకోడానికి అవలంబించాల్సిన మార్గాలను కౌటిల్యుడు వివరించాడు. విదేశీ వాణిజ్యం ఎలా చెయ్యాలి, ధనానికి సంబంధించిన విషయాల్లో ఎలా వ్యవహరించాలి తెలిపాడు. పీవీ వాటన్నింటినీ అందిపుచ్చుకుంటూనే తనదైన మార్గంలో నడిచారు. జ్ఞానయోగిగా తాను పొందిన జ్ఞానాన్ని, ఆ మహా గ్రంథాల సారాంశాన్ని ఆధునిక మార్గంలో ఆచరణలో చూపించారు. జవహర్ నెహ్రూ, ఇందిరాగాంధీ నిర్దేశించిన ఆర్థిక విధానాలకు గౌరవం, ప్రచారం కలిపిస్తూనే, దేశ పరిస్థితులకు అనుగుణంగా, తన సరళిని జతపరచి జేజేలు కొట్టించుకున్నారు. అదే పీవీ చూపించిన లౌక్య ప్రతిభ. చీఫ్ ఎలక్షన్ కమీషనర్ గా టీ ఎన్ శేషన్ ధిక్కార స్వరంతో సర్వ స్వతంత్రుడుగా వ్యవహరిస్తున్న సమయంలో,అదనంగా మరో ఇద్దరు కమీషనర్లను నియమించి, సరిచేసి సమతుల్యతను ఏర్పరచారు. ఇదీ మంత్రాంగంలో భాగమే. కౌటిల్యుడు 'అర్థశాస్త్ర' రచనకు శ్రీకారం చుట్టినపుడు అర్థశాస్త్ర ప్రవర్తకులుగా భావించే బృహస్పతికి, శుక్రాచార్యుడికి తొలి నమస్కారం సమర్పించాడు. అట్లే, పీవీ కూడా చాణుక్యుడు, తిమ్మరసు మొదలు మహామంత్రులందరికీ మనసులో నమస్కారం చేసుకొని, ముందుకు సాగి వుంటారు. ఇదంతా భారతీయమైన ఆలోచనా విధానమే. పీవీ ఆసాంతం భారతీయతను అంటిపెట్టుకొని జీవించారు. కౌటిల్యుడు చాలా సూత్రాలను నిర్దేశించాడు. పెద్దల సహవాసం, ఇంద్రియాలను అదుపులో ఉంచుకోవడం మొదలైనవి ఎన్నో ఉన్నాయి. ఇంచుమించు వాటన్నింటినీ పీవీ పాటించారు. చైనా నుంచి ఎప్పటికైనా ముప్పు ఉంటుందని గ్రహించి, అమెరికాతో బంధాలను పెంచారు. అదే, ఈరోజు అక్కరకు వస్తోంది. భవిష్యత్తు మొత్తం శాస్త్ర, సాంకేతిక రంగాలదేనని గ్రహించి, టెలీకమ్యూనికేషన్ వ్యవస్థల బలోపేతానికి బలమైన పునాదులు వేశారు. ఆంధ్రప్రదేశ్ లోని ఎక్కడో

కుగ్రామం నుంచి అమెరికా రాజధాని వాషింగ్ టన్ డిసీ లో ఉండేవారితో, చూస్తూ వీడియో కాల్ మాట్లాడుకునే సౌకర్యం ఈనాడు మనం అనుభవిస్తున్నాం. ఇండియా లో కూర్చొని ఆస్ట్రేలియా యూనివర్సిటీలో ఆన్ లైన్ కోర్సును చేయగలుగుతున్నాం. అంబాసిడర్, ఫియట్, మారుతి వంటి నాలుగైదు మోడల్స్ తప్ప మిగిలిన కార్లు మనకు తెలియదు. ఇప్పుడు రోల్స్ రాయిస్ మొదలు అనేక విదేశీ కార్లు మన రోడ్లపై తిరుగుతున్నాయి. విమానాలలో ప్రపంచ దేశాలన్నింటినీ ఈనాడు చుట్టేస్తున్నాం. ఈ సకల భోగాలన్నీ పీవీ నరసింహారావు కల్పించిన ఆర్థిక సంస్కరణల మహాఫలమే.ఇదే దార్శనికత, దేశభక్తికి ప్రతీక. మౌనం విలువ, మాట విలువ తెలిసిన వాడు కాబట్టే, అన్ని భాషలను నేర్చుకున్నా కొన్ని సందర్భాల్లో మౌనాన్ని ఆశ్రయించారు. ఒక సందర్భంలో, స్పానిష్ లో అనర్గళంగా మాట్లాడి అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తారు. ఇదీ మంత్రిత్వ ప్రతిభలో భాగమే. దార్శనికత, దేశభక్తి, సకలశాస్త్ర జ్ఞానసంపద, సంయమనం,ఆచరణాశీలం కలిగిన జ్ఞానయోగి, కర్మయోగి పీవీ.మహారాజులు,చక్రవర్తుల కాలం తర్వాత, ఆధునిక యుగంలో, నేటి భారతంలో పీవీ నరసింహారావు నిస్సందేహంగా మహామంత్రి శబ్దవాచ్యుడు. అచ్చమైన ఆంధ్రుడు, స్వచ్ఛమైన భారతీయుడు. ఈ మహామనిషికి, ఈ మహామనీషికి (ప్రతిభామూర్తి) భారతప్రభుత్వం 'భారతరత్న' ప్రదానం చేసి, భారతీయ ఔన్నత్యాన్ని నిలబెడుతుందని ఆకాంక్షిద్దాం. భారతరత్న గౌరవాన్ని పొందిన పూర్వ ప్రధాని వాజ్ పెయి, పూర్వ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ కంటే పీవీ నరసింహారావు ఏ మాత్రం తక్కువవారు కారు. నిజం చెప్పాలంటే, వారిద్దరి కంటే కూడా బహుముఖ ప్రతిభామూర్తి పీవీ. శతవత్సరం సందర్భంగా సహస్రధా జోతలు పలుకుతున్నాను.



**Twenty years ago [1991], he became prime minister and initiated economic reforms that transformed india. The congress party doesn't want to remember him: it is based entirely on loyalty to the gandhi family, and rao was not a family member. But the nation should remember him as the man who changed india, and the world too**

*— S A Aiyar, Economist and Journalist*

# పి.వి. గారి రెండు కోర్కెలు



భండారు శ్రీనివాసరావు
98491 30595

పి.వి. గారు మాజీ ప్రధానమంత్రిగా పాల్గొన్న ఒక సదస్సు హైదరాబాదులోని జాతీయ గ్రామీణాభివృద్ధి సంస్థలో జరిగింది. వారికి ఔషధ మూలికలపై ఆసక్తి మెండు. నిజానికి ఆయన పట్టుదల కారణంగానే ఆ అంశానికి సంబంధించి ఆ జాతీయ సదస్సు ఏర్పాటయింది.

మధ్యాన్నం భోజన విరామ సమయంలో విలేకరులు ఒక్కొక్కరుగా ఆయన్ని కలుస్తున్నారు. ఆలిండియా రేడియో ప్రాంతీయ విభాగంలో పనిచేసే ఆర్.వి.వి. కృష్ణారావు గారు, నేనూ కాస్త వెనగ్గా నిలబడివున్నాం.

చివరికి ఆయనే మమ్మల్ని దగ్గరకు పిలిచారు.

'ఏమయ్యా కృష్ణారావూ! ఢిల్లీలో పద్మనాభరావుకి కూడా చెప్పాను. ఏవయ్యాయి నా టేపులు?"

పి.వి. గారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు తెలుగులో అనేక రేడియో ప్రసంగాలు చేశారు. వాటిని గురించి చేసిన వాకబు ఇది.

కృష్ణారావు గారు ఏదో చెప్పారు.

ఆయన నా వైపు తిరిగారు.

'మీ అన్నయ్య (కీర్తిశేషులు పర్వతాలరావు గారు) పుట్టపర్తిలో వుంటున్నాడట కదా! ఏం చేస్తున్నాడు?"

'నరసింహావతారం గురించి పుస్తకాలు రాస్తున్నాడు.'

'అలా అయితే నేనడిగానని చెప్పు. మనిషి శారీరకంగా సింహం కంటే బలహీనుడు. ఆ అవతారంలో సింహం తలా, మనిషి శరీరం ఏమిటో రాయమని చెప్పు'

నమస్కారం పెట్టి మేము వచ్చేశాము.

పి.వి. గారి సందేహానికి మా అన్నయ్య ఆ పుస్తకంలో చాలా పెద్ద వివరణే ఇచ్చారు.

ఓపిక ఉన్న వారు చదువుకోవడానికి పూర్తి పాఠం ఇస్తున్నాను.

"హిరణ్యకశిపుడు స్వతహాగా మహాబలుడు. దానికి తోడు తపశ్శక్తితో పొందిన వరాలు. అతడిని చంపేందుకు వెళ్ళే విష్ణువు నర సింహ మిశ్రమ రూపం ధరించాల్సి వుంటుంది. అలాంటప్పుడు రెంటిలోనూ గల బలమైన అంశాలనే స్వీకరించాల్సి వుంటుంది. నరుని మేధ సింహపు మేధ కన్నా చురుకు. సింహపు శరీరం నరుడి దేహం కన్నా బలమైనది. కనుక నరుని తల, సింహపు శరీరం కలిస్తే రెండు బలమైన అంశాలను స్వీకరించినట్టు అయ్యేది. కాని విష్ణువు ఈ అవతారానికి సింహపు తల, మనిషి శరీరం ఎన్నుకున్నాడు. రెండు బలహీనమైన అంశాల మిశ్రమం అది. మరి విష్ణువు అలా ఎందుకు చేశాడు? కొందరు కరాటే ఉదాహరణ చెప్పారు. కరాటేలో చేయి బలహీనంగా వుండడంకన్నా ఆ చేయిని ప్రయోగించడంలో చూపే వేగం, గురి, ఏకాగ్రత ప్రధానం. కనుక బలహీనమైన శరీరాన్ని ఎన్నుకున్నా ఇబ్బంది లేదని వారి అభిప్రాయం. అలా అనుకున్నా అట్టి ఏకాగ్రత నరుని మేధ సాధించినట్టు సింహపు మెదడు సాధించగలదా! మానసిక పటుత్వాన్ని సాధించడం నరునికే సాధ్యం కాని సింహానికి కాదు. జంతువు కావాలంటే సింహమే ఎందుకు? జిత్తులమారి నక్క తల అయితే ఇంకా ఎక్కువ ప్రయోజనకారిగా వుండేదేమో! మరి స్వామి సింహపు తలనే ఎందుకు ఎన్నుకున్నట్టు!

హిరణ్యకశిపుడు యావత్ ప్రకృతిని తన కనుసన్నలలోకి తెచ్చుకున్నాడు. అసలు హిరణ్యకశిపుడు అంటే అర్థం ఏమిటి? కళాప్రపూర్ణ వేదుల సూర్యనారాయణ శర్మగారీ విషయాన్ని తమ 'అంతరార్థ భాగవతం' లో చెప్పారు. హిరణ్యం అంటే ప్రకృతి (బంగారం కూడా). కశిపుడు అంటే హింసించేవాడు. ప్రకృతిని తన దోవన పోనీయకుండా, తాను చెప్పిన దోవనే అది నడవాలని కట్టడి చేసినవాడు. ప్రకృతిని అలా నిర్బంధించడమే హింస. ఆ రాక్షసుడి కట్టడిలో ప్రకృతి విలవిలలాడిపోయింది.

'అస్మదీయంబగు నాదేశమున గాని
మిక్కిలి రవి మింట మెరయ వెరచు'

అని ప్రగల్భాలు పలికిన వాడు ఆ రాక్షస రాజు.

అలాగే ఇంద్రుడు, యముడు, అగ్ని, వాయువు అంతా గడగడలాడారు.

పృథు చక్రవర్తి కాలంలో కూడా ప్రకృతి అన్నివిధాల ఆయనకు అనుకూలంగా నడిచింది. దున్నకుండానే పంటలు పండేవి. పృథువు పట్ల భక్తి, గౌరవం వల్లనే కాని చండశాసనుడు అనే భయంతో కాదు. రెంటికీ ఎంత తేడా! నియంతృత్వానికి, ఆదర్శ ప్రజాస్వామ్యానికి ఉన్నంత తేడా.

అలా ప్రకృతిని తన కనుసన్నల్లో పెట్టుకోవడం ఎందుకు? ఇంద్రియ సుఖాలను అనుభవించడానికే. ప్రకృతి అందరికీ అవసరమైన మేరకు ఇస్తుంది. కానీ ఆశ పడ్డంత కాదని గాంధీజీ చెప్పారు.

నరసింహావతారంలో విష్ణువుకి మనిషి తల పనికి రాకపోవడానికి ఈ ఆబే (అత్యాశే) కారణం. మనిషికి 'ఆశాపాశము తా కడున్ నిడుపులేదంతంబు'. అట్టి ఆశలమారి మేధ ఆబను, కక్కుర్తిని మరింత పెంచుతుంది. తృప్తి చెందదు. సింహం అలా కాదు. అది మృగరాజు. దానికి లేకితనం, పేరాశ లేవు. ఏ పూటకు ఎంత అవసరమో ఆ పూటకు అంతే వేటాడి సంపాదించుకుంటుంది. ఆ పైన దాచుకోవడం ఎరగదు. రేపు-మాపు అన్న చింత దానికి లేదు. అన్ని జంతువులూ అలా కాదు. పులి, చిరుతపులి కూడా వేటాడిన జంతువును దాచుకుని తింటాయి. సింహానికి అది పనికిరాదు. తన కడుపు నిండితే పక్క నుంచి పోయే జంతువులను కూడా అది పట్టించుకోదు. రేపుతో లంకె పెట్టుకోని తత్వం. ఆధ్యాత్మికంగా చూసినప్పుడు అంతకన్నా నిస్సంగత్వం లేదు. ఇలాంటి తత్వం సమాజానికి ఎంతో అవసరం. అట్టి సంస్కృతి వుంటే ప్రస్తుత పర్యావరణం ఇంత దెబ్బతినేది కాదు. అనేక పక్షి, జంతుజాలాలు అంతరించిపోయేవి కావు. మనిషిలో ఆబ పెరగడం వల్లనే ఈ వినాశనమంతా.

అట్టి ఆబ (GREED) లేని సింహం తలను స్వామి ఎంచుకోవడం హిరణ్యకశిపుని ఆబ (GREED) కు వ్యతిరేకంగా వుండే సమాజాన్ని ఆవిష్కరించడం కోసమే. మనిషి శరీరాన్ని ఎంచుకున్నా దాని బలహీనత వల్ల స్వామికి వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు. స్వామిది సంకల్పబలం. నిజానికి తాను ఎలాంటి చావు చావాలో హిరణ్యకశిపుడే కోరుకున్నట్లయింది. అతడు కోరిన కోర్కెలే, అతడు పెట్టిన నిబంధనలే అతడిని సంహరించే వ్యక్తి ఎలా ఉండాలో, ఏ సమయంలో ఎక్కడ ఎలా అతడిని చంపాలో నిర్దేశించాయి"

(ఓం నమో శ్రీ నారసింహాయ, శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి దివ్య చరిత్ర, ప్రథమ సంపుటం, రచన: కీర్తిశేషులు భండారు పర్వతాలరావు, సమర్పణ: శ్రీ వేదభారతి, హైదరాబాదు)

# నేను దర్శించిన హరివిల్లు - పి.వి.



డా॥ వి.వి.రామారావు,
రచయిత, వ్యాఖ్యాత
✆ 98492 37663

పి.వి.గారి గురించి రాస్తే రామాయణమంత.. చెబితే భారతమంత.. ఆయన మాకు అతి సన్నిహిత బంధువు. అతి దూరంగా ఉన్న రాజకీయ నేత. అతి దగ్గరి సాహితీవేత్త. అతి దూరంగా ఉండిన ఏకాంత జీవి. ఆయనలోని ద్వంద్వాలు అనేకం. అయినా మేమూ మమేకం.. ఒకవిధంగా పి.వి.గారి జీవితం, రాజకీయం, సాహిత్యం, వ్యక్తిత్వం...అన్నీ కలిపి చూస్తే, అది అందమైన సప్త వర్ణాల హరివిల్లు...

పి.వి. స్వగ్రామం కరీంనగర్ జిల్లాలోని వంగర. శ్రీపాములపర్తి సీతారామారావు, రుక్మిణి దంపతులకు వరంగల్ జిల్లాలక్నేపల్లి గ్రామంలో మాతామహుల ఇంటిలో 1921 జూన్ 28 వ తేదీన జన్మించారు.వీరి పూర్వీకులు సిద్ధిపేట సమీపంలోని పాములపర్తి గ్రామానికి చెందినవారు. పి.వి.గారు వంగర లోనే దాయాదులైన పాములపర్తి రంగారావు గారికి పెంపకం వెళ్ళాడు.

విద్యార్థిగా ఉన్నపుడే పి.వి.సాహిత్య, సాంస్కృతిక, క్రీడారంగాదులలో ప్రతిభను చూపారు. హైస్కూలు దశలో "నెహ్రూ ఆత్మకథ" ను చదివారు. "కృష్ణ కుమారి" నాటకంలో నటించారు. గార్లపాటి రాఘవరెడ్డి గారి సాహచర్యంలో సంస్కృతాంధ్ర సాహిత్యాలను అధ్యయనం చేసి తన బహుముఖీన ప్రతిభకు పునాదులు వేసుకొన్నారు.

1938 లో ఇంటర్ రెండవ సంవత్సరంలో ఉన్నపుడు వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న పి.వి.ని నిజాం ప్రభుత్వం కళాశాల నుంచి బహిష్కరించగా నాగపూర్ వెళ్ళి, ఇంటర్ పూర్తి చేశారు. 1939లో మధ్యప్రదేశ్ లో జరిగిన త్రిపురి కాంగ్రెస్ సభలకు హాజరై నేతాజి, నెహ్రూజి ఉపన్యాసాలతో స్ఫూర్తి నొందారు. గణితమంటే ఆసక్తిగల పి.వి. ఇంగ్లాండు వెళ్ళి ఆక్స్ ఫర్డ్ యూనివర్సిటిలో "ర్యాంగ్లర్" కోర్స్ చదవదలచి వర్గూసన్ కాలేజి, పూనే లో బి.యస్.సి. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయి గోల్డ్ మెడల్ సాధించారు. అయితే 1942లో క్విట్ ఇండియా

ఉద్యమం పి.వి. గారిని న్యాయశాస్త్రం చదవాలని నాగపూర్ వైపు మళ్ళించగా, అక్కడ పార్ట్ టైం ఉద్యోగం చేస్తూ ఎల్.ఎల్.బి. చదివి, గోల్డ్ మెడల్ సాధించారు.

మహారాష్ట్రలో ఉన్నకాలంలోనే మరాఠి, హిందీ భాషలలో పట్టు సాధించారు. అలహాబాద్ యూనివర్సిటీ నుంచి హిందీ "సాహిత్య రత్న"(ఎం.ఏ.) ఉత్తీర్ణులయ్యారు. లాలో స్వర్ణపతకం సాధించిన పి.వి. గారికి నాటి బ్రిటిష్ ప్రభుత్వం నాగపూర్ లో జ్యుడీషియల్ ఆఫీసర్ గా ఉద్యోగ అవకాశం ఇవ్వజూపగా, ఆయన నిరాకరించి 1946 లో హైదరాబాద్ తిరిగి వచ్చేసి బూర్గుల రామకృష్ణారావు గారి వద్ద జూనియర్ గా చేరారు. 1946 లో హైదరాబాద్ లో గాంధీజీ పర్యటనతో పి.వి. స్ఫూర్తి పొంది, వకాలత్ కు స్వస్తి చెప్పి స్వామి రామానంద తీర్థ గారి నేతృత్వంలో నిజాం ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో భాగంగా చాందా(మహరాష్ట్ర)కు వెళ్ళి పోరాటం సాగించారు. 1948 సెప్టెంబర్ 17న హైదరాబాద్ రాష్ట్రం నిజాం పాలన నుంచి విముక్తమై భారత యూనియన్ లో కలిసింది. 1948 లో పి.వి. గారు ప్రజాస్వామ్య సామ్యవాద సిద్ధాంతాల వ్యాప్తి కోసం మిత్రుడు పాములపర్తి సదాశివరావు గారితో కలిసి "కాకతీయ వార పత్రిక" స్థాపించారు.

> విదేశాంగ మంత్రిగా ఉన్న కాలంలో (1980–84) భారత అలీన విధానాన్ని, అగ్రరాజ్యా లతో మైత్రిని, పాక్ – చైనాలతో సత్సంబంధాలు నెలకొనే విధంగా చేసిన కృషిని తెలియజేస్తూ పి.వి. 1986 లో "A Role of Persuation" అను గ్రంథంలో తెలిపారు.

"రాజహంస, జయ, విజయ" మొదలగు కలం పేర్లతో కథలు, వ్యాసాలు, సమీక్షలు అనేకం రాశారు. 1952 లో "కాకతీయ" ప్రచురణ నిలిచిపోయింది. అనంతరం అదే సంవత్సరం పార్లమెంట్ తొలి జనరల్ ఎలక్షన్లలో కరీంనగర్ నుంచి ఎం.పి.గా పోటీ చేసి ఓడిపోయారు. 1954లో ఆచార్యవినోబాభావే పోచంపల్లిలో ప్రారంభించిన భూదాన ఉద్యమంలో పాల్గొని పాదయాత్ర చేశారు. పి.వి. గారు 1957లో తొలిసారి మంథని నుంచి ఎం.ఎల్.ఏ. గా ఎన్నికై శాసనసభలో అడుగిడినారు. 1962లో నీలం మంత్రివర్గంలో తొలిసారిగా న్యాయ, జైళ్ళ సహాయ మంత్రిగా చేరి సంస్కరణలకు శ్రీకారం చుట్టి, అనంతపురంలో తొలి బహిరంగ జైలు ఏర్పాటుచేసారు. 1964 లో దేవాదాయ శాఖ మంత్రిగా, సమగ్ర ఎండోమెంట్ చట్టాన్ని



రూపొందించారు. 1966లో ఆరోగ్య శాఖమంత్రిగా వైద్యుల ప్రైవేటు ప్రాక్టీసు నిషేధించారు. పల్లెల్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయించింది పి.వి.గారే. 1968 లో విద్యాశాఖ మంత్రిగా, ఎన్నో కీలక సంస్కరణలు చేశారు. ప్రాథమిక స్థాయి నుండి డిగ్రీ వరకు తెలుగు మీడియంను ప్రవేశపెట్టారు. తెలుగు అకాడమి స్థాపించారు. 1969 లో ఉవ్వెత్తున చెలరేగిన తెలంగాణా ఉద్యమం వలన కాసు బ్రహ్మానందరెడ్డి రాజీనామా చేయగా, అన్ని ప్రాంతాలకు ఆమోదయోగ్యుడైన వ్యక్తిగా తెలంగాణాకు చెందిన పి.వి. గారిని ఇందిరమ్మ నిర్ణయించి 1971లో ముఖ్యమంత్రిగా నియమించింది. "ఈ నిద్రాణ నిశీధి మహిత జాగృత పుంజము గా వెలిగించుటే నా తపస్సు" అని గేయరూపంలో ప్రతిజ్ఞ చేసి 1972 లో భూసంస్కరణల చట్టం బిల్లును అసెంబ్లీ లో ప్రవేశపెట్టాడు. అయితే ముల్కీ విషయంలో సుప్రీంకోర్టు వెలువరించిన తీర్పుతో పెల్లుబుకిన 'జై ఆంధ్రా ఉద్యమం' వల్ల ఇందిరమ్మ ఆదేశం మేరకు 1973 జనవరిలో రాజీనామా చేశాడు. 1977లో హన్మకొండ నుంచి లోక్సభ. ఎం.పి.గా ఎన్నికయ్యారు. కాని జనతా ప్రభంజనంలో ప్రతిపక్షనాయకుని స్థానంలో కూర్చున్నారు. అయితే పి.వి.ని పబ్లిక్ అకౌంట్ చైర్మన్ గా జనతా ప్రభుత్వం నియమించడం విశేషం. విదేశాంగ మంత్రిగా ఉన్న కాలంలో(1980-84) భారత అలీన విధానాన్ని, అగ్రరాజ్యాలతో మైత్రిని, పాక్ - చైనాలతో సత్సంబంధాలు నెలకొనే విధంగా చేసిన కృషిని తెలియజేస్తూ పి.వి. 1986 లో "A Role of Persuation" అను గ్రంథంలో తెలిపారు. రాజీవ్ గాంధీ మంత్రివర్గంలో నూతనంగా ఏర్పాటు చేసిన మానవ వనరుల అభివృద్ధి శాఖ మంత్రిగా పలు సంస్కరణలు చేపట్టారు. నెహ్రూ యువకేంద్రాలు, జవహర్ నవోదయ విద్యాలయాలు, జాతీయ సాక్షరతా మిషన్ స్థాపించడమే కాదు, నూతన విద్యావిధానాన్ని రూపొందించి, విద్యావికాసానికి మార్గం వేశారు. 1991లో అమెరికాలో బైపాస్ సర్జరీ గావించుకొన్న పి.వి. మాత్రం ఆధ్యాత్మిక చింతనతో తన శేష జీవితాన్ని గడపాలనుకొని కుర్తాళం పీఠాధిపతి పిలుపు మేరకు నిశ్చయించుకొని, ఢిల్లీ నివాసం లోని తన పుస్తక భాండాగారాన్ని హైదరాబాద్ తరలించారు. కానీ 1991 మే 21న కాంగ్రెస్ పార్లమెంటరీ నాయకునిగా ఎన్నుకోవడంతో పి.వి. జీవితంలో రెండో రాజకీయ ఇన్నింగ్స్ మొదలయింది.

నెహ్రూ కుటుంబేతర వ్యక్తి, దక్షిణ భారతం నుంచి తొలిసారిగా, పి.వి. ప్రధానిగా బాధ్యతలు స్వీకరించిన సంతోషం క్షణం నిలవలేదు. కారణం మన దేశ పరిస్థితి విష వలయంలో చిక్కుకుంది. ఒకవైపు తన మైనారిటి ప్రభుత్వం, మరొకవైపు దేశంలో పంజాబ్ - కాశ్మీర్ సమస్యలు, ఇంకోవైపు కాంగ్రెసులో అర్జున్ సింగ్ వంటి వారితో పోరు, అన్నిటిని మించి భారత్ ఆర్థిక దుస్థితి! ద్రవ్యోల్బణం ఆకాశాన్ని చుంబించింది. చమురు దిగుమతికి విదేశీ మారకద్రవ్యం లేక ఖజానా ఖాళీ కుండగా వెక్కిరించింది. ప్రపంచ బ్యాంకు పైసా సాయం చేయనన్నది. చివరికి 50 టన్నుల బంగారాన్ని ఐ.ఎం.ఎఫ్.బాంక్ ఆఫ్ ఇంగ్లాండు లో కుదువపెట్టిన సొమ్ముతో అప్పుల రుణ వాయిదాలు చెల్లించాల్సిన దౌర్భాగ్య విషాద స్థితి పి.వి. ముందు సవాళ్ళుగా నిలిచాయి. పి.వి. ముళ్ళబాటనే పూలబాటగా భావించారు. ఆర్థిక సంస్కరణలను పకడ్బందీగా

అమలుచేయాలని, దేశానికి పట్టిన విపత్తును తొలగించాలని భావించారు. REFORMS WITH HUMAN FACE (మానవీయ కోణంలో సంస్కరణల) అనేది పి.వి.గారి దృక్పథం. తన ఆలోచనల అమలులో భాగంగా తొలుత శ్రీ మన్మోహన్ సింగ్ గారిని ఆర్థిక మంత్రిగా తీసుకొన్నారు. మొదటి చర్యగా రూపాయి మారకం రేటు తగ్గించారు. ఫలితంగా ఎగుమతి సబ్సిడీలు తగ్గి 3000 కోట్ల రూపాయల ఆదా అయ్యాయి. లైసెన్స్ రాజ్ ను తొలగించి పారిశ్రామిక, వాణిజ్య రంగాలలో LPG (Liberalisation, privatisation, globalisation) నినాదంతో, జర్మన్ ఛాన్సలర్ విల్లీ బ్రాంట్ ను ఆదర్శంగా తీసుకొని సరళీకృత విధానాలతో విదేశీ పెట్టుబడులను ప్రోత్సహించి, ఆరు నెలల్లో "మునిగిపోతున్న భారత భారీ నౌకను" రక్షించి తీరం చేర్చారు. నెహ్రూ విధానాలకి పూర్తిగా స్వస్తి చెప్పి తనదైన చాణక్య నీతితో అమెరికా ప్రెసిడెంట్ రూజ్ వెల్ట్ వలె సంస్కరణలను అమలుచేశారు. 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక పి.వి.ని 'భారతీయ డెంగ్ సియావోపింగ్' గా అభివర్ణించింది. ఒక్క ఆర్థిక సంస్కరణల విషయంలోనే కాదు. అంతర్జాతీయ వేదికపైన కూడా భారతదేశ ప్రతిష్టను పెంచడం కోసం పి.వి. అనుసరించిన విధానం కూడా ఎంతో గణుతించదగింది. తూర్పు ఆసియా దేశాలైన సింగపూర్, మలేషియా మొదలగు దేశాలతో సత్సంబంధాలకోసం Look at East (తూర్పు వైపు చూడండి) policy ని ప్రవేశపెట్టారు. జర్మనీ, ఫ్రాన్స్ పర్యటించి భారత్ పట్ల అపోహలు తొలగించారు. 1993 లో చైనా పర్యటించి ముప్పది యేళ్ళుగా ఎడమైన బంధాన్ని పునరుద్ధరించారు. ముఖ్యంగా ఇజ్రాయిల్, పాలస్తీనా వ్యవహారాల విషయంలో చాకచక్యంగా వ్యవహరించి అటు అరాఫత్ ను ఒప్పించి, ఇటు ఇజ్రాయిల్ ను మెప్పించి ఆధునిక ఆయుధాలు, బిందు సేద్య విధానాలు,

సంపాదించిన విధానాన్ని ప్రతిపక్షాలు ప్రస్తుతించాయి. దేశానికి సంబంధించి, 1993లో పంచాయతీరాజ్ వ్యవస్థను 73, 74 రాజ్యాంగ సవరణలతో పటిష్టం చేసి గ్రామీణాభివృద్ధి పథకాలకు జీవం పోశారు. గ్రామీణాభివృద్ధి శాఖను స్వయంగా నిర్వహించి 7,000ల కోట్ల బడ్జెట్ ను 30,000 కోట్లకు పెంచి "బై పాస్ మోడల్ " పాలసీతో అభివృద్ధి చేశారు.

కాశ్మీర్‌లో కె.ఆర్. వేణుగోపాల్‌ని నియమించి వాజ్ పాయ్ వలె "జమూహియత్, కశ్మీరియత్, ఇన్సానియత్" సూత్రం అనుసరించారు. పంజాబ్ లో కె.పి.ఎస్.గిల్. ను నియమించి శాంతి భద్రతలు స్థాపించి, 57 నెలల రాష్ట్రపతి పాలనకు స్వస్తి చెప్పి, ఎన్నికలు నిర్వహించి, కాంగ్రెసు భారీ మెజార్టీతో గెలిచేలా చేసిన ఘనత పి.వి. గారిదే. 1993లో ముంబై అల్లర్లను నియంత్రించారు. పి.వి.గారు ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్ రంగంలో ముఖ్యంగా సాఫ్ట్ వేర్ రంగంలో ఇన్ఫోసిస్ మొదలయిన దిగ్గజ కంపెనీలతో చర్చించి భారత్ లో ఐ.టి. టెక్నాలజీ అభివృద్ధి చేశాడు. స్వయంగా కంప్యూటర్ నేర్చుకొని కోడింగ్ తదితర అంశాలలో నిష్ణాతుడయ్యారు. ఈనాడు మన దేశంలో మొబైల్ ఫోన్లు, విస్తారంగా వాడటానికి కారణం 1994లో పి.వి. ప్రవేశపెట్టిన నేషనల్ టెలికమ్యూనికేషన్ పాలసీయే! నాడు తొలి మొబైల్ ఫోన్ కాల్ ను కమ్యూనికేషన్ మంత్రి సుఖ్ రామ్ తో, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతి బసుకు చేయించడం విశేషం. నరసింహన్ కమిటీ సిఫార్సులను అమలు చేసిన ఘనత పి.వి. గారిదే. దాంతో ఐ.సి.సి.ఐ., హెచ్. డి.ఎఫ్.సి.మొదలగు ప్రైవేటు బ్యాంకులు ఏర్పాటై లోన్లు మంజూరీ కావడంలో నియమాలు సడలించగలిగారు. బ్యాంకింగ్ రంగాన్ని కంప్యూటర్ నెట్ వర్క్ తో అనుసంధానించడం, డెబిట్, క్రెడిట్ కార్డుల వాడకం మొదలయినవి పి.వి. గారి చర్యల ఫలితాలే. ఆర్.ఎస్. మల్హోత్రా కమిటీ సిఫార్సులు అమలుపరచి, ఎల్.ఐ.సి.కి సమాంతరంగా ప్రైవేటు ఇన్సూరెన్సు కంపెనీలను పి.వి. సమాజంలో పలు వర్గాల అభ్యున్నతికి కృషి చేశారు. 1992లో జాతీయ మైనారిటీ కమీషన్, జనాల ఆలోచనలెప్పుడు సామాన్యుడి గురించేనని "ఆంధ్రప్రదేశ్" మాసపత్రిక (జూన్ 1972)కు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు.

పి.వి. గారు రాజకీయ రంగంలో అవిశ్రాంతంగా ఊపిరి సలపని పనులతో సతమతమవుతూనే చేసిన సాహిత్య సేవ నిరుపమానమైనది. తెలుగులో "గొల్లరామవ్వ", "నీలి రంగు పట్టు చీర", "మంగయ్య అదృష్టం" కథలు రాశారు. మరాఠీ లో ప్రసిద్ధ రచయిత హరి నారాయణ ఆప్టే రాసిన "పణ్ లక్ష్యాత్ కోన్ ఘేటో" నవలను 1964 లో ఆప్టే శతజయంతి సందర్భంగా మరాఠీ అకాడమి వారి అభ్యర్థన మేరకు, పి.వి. అంగీకరించి "అబలా జీవితం" నవలగా అందించారు.

జయప్రభ గారి "అనుకోని అనురాగం" కవితా సంపుటిని 2004 లో "Unforeseen Affection" పేరిట ఆంగ్లంలో అనువదించి ముందుమాట కూడా రాశారు. పి.వి. ఆంగ్లంలో ఆరు కథలు రాశారు. అవి, "The Forgotten Briefcase", "The Guest", "Granny", "The Sorrow Minister", "The Reshuffle", "The Secret if the Ballot." పి.వి. వ్యక్తులు, సంస్థలు, రాజకీయాలు, కళలు, సాహిత్యం, సంస్కృతీ తదితర అంశాలపై 1980-96 మధ్య కాలంలో పలు వేదికలపై చేసిన దాదాపు 300ల పై చిలుకు ప్రసంగాలు, ఉపన్యాసాలను ఆరు సంపుటాలుగా ఆంగ్లంలో వెలువరించారు.

పి.వి. గారి జీవితము, సాహిత్యం వలె వ్యక్తిత్వం కూడా అసాధారణమైనది. తొలినాటి నుంచి గాంధీజీ ప్రభావం వారిపై వున్నది. పలు గాంధేయ నిర్మాణ సంస్థలైన వావిలాల, భాగ్యనగర్, మెట్ పల్లి ఖాదీ సంస్థల నిర్వహణలో ప్రధాన బాధ్యత నిర్వహించారు. నిరాడంబర జీవితం, నిర్వికార చిత్తము, కర్మయోగి తత్వము, నిరహంకారము, ఎంతటి క్లిష్ట సమస్యలకైనా చలించని స్వభావము వారిలో కనిపిస్తుంది. సుఖ దుఃఖాలకు అతీతంగా ఉండడం వారి తత్వం.

పి.వి. ఎంతటి క్లిష్టమైన అంశాన్నైనా చాలా తేలికగ వివరించగలడు. ఎంతటి తేలిక అంశాన్నైనా సంక్లిష్టంగా మార్చగలడు. "నిర్ణయాలు తీసుకోకపోవడమే నిర్ణయం" వంటి చమత్కారాలతో మాట్లాడగలగడం ఆయన ప్రత్యేకత. ఎదుటివారిని క్షణంలోనే అంచనా వెయగలిగే శక్తిగల వాడాయన.

పి.వి.గారు టెన్నిస్ షటిల్ ఆడేవారు. అలాగే సంగీతమంటే ప్రాణం. సైగల్, పన్నాలాల్ ఘోష్, బిస్మిల్లా ఖాన్, గులాం అలీ, ఎం.ఎస్. ఆల్బమ్ లు వినడం ఆయన హాబి. పి.వి.ని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం 1977లో తులనాత్మక సాహిత్యంలో గౌరవ ప్రొఫెసర్ గా నియమించి డాక్టరేటు తో సత్కరించింది. 1995 లో పి.వి. గారిని పి.వి. మనోహర్ రావు "స్థిత ప్రజ్ఞ" పురస్కారాన్ని అందించారు. అప్పాజోస్యుల విష్ణు భొట్ల ఫౌండేషన్ అమెరికా వారు 2002లో పి.వి. ప్రతిభామూర్తి పురస్కారంతో సత్కరించారు.

'మనలో పోరాట శక్తి వుండాలి. పోరాటం లేకపోతే జీవితమే లేదు' అని తరచూ ఉద్బోధించే పి.వి. జీవితంలో అడుగడుగునా పోరాడి గెలిచినప్పటికీ మృత్యువుతో జరిగిన పోరాటంలో మాత్రం ఓడిపోయి, డిసెంబర్ 23 వ తేద 2004 సంవత్సరంలో తుది శ్వాస విడిచారు.

పి.వి. మూర్తీభవించిన మానవత్వం. వారి జీవితం రాబోయే తరాలకు ఆదర్శం.

# పి.వి సాహిత్య లీవి



**డా॥ రేవూరు అనంతపద్మనాభరావు**
విశ్రాంత అదనపు డైరెక్టర్ జనరల్, దూరదర్శన్, ఢిల్లీ
✆ 98665 86805

## పి.వి గారితో ప్రథమ ముఖాముఖీ :

అది 1984 డిసెంబరు నాటిమాట. నేను ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నాను. ఆ రోజు నేను, మా డైరెక్టర్ శ్రీమతి లీలాబాల్‌డేకర్ ఒక వి.ఐ.పి.కి స్వాగతం పలకడానికి ఆకాశవాణి స్టూడియో కారిడార్ ముందు నిలుచొని ఉన్నాం. పి.వి.గారు సరిగ్గా ఉదయం పదకొండు గంటలకు కార్లోంచి దిగారు. ఎదురుగా ఉన్న డైరెక్టర్ నమస్కరించగానే కుశల ప్రశ్నల అనంతరం పక్కనేవున్న నన్ను చూచి "హౌ ఆర్ యూ పద్మనాభరావ్!" అన్నారు. నేను వారిని అదే కలవడం.

1984 జనరల్ ఎన్నికల సందర్భంగా కాంగ్రెసు పార్టీ పక్షాన ఎన్నికల ప్రసంగం జాతీయస్థాయిలో ప్రసారానికి రికార్డింగు చేయడానికి పి.వి. స్టూడియోకి వచ్చారు. ఢిల్లీ ఆకాశవాణి కేంద్రకార్యాలయంలో ఎన్నికల ప్రసంగ రికార్డింగు కో-ఆర్డినేటర్‌గా హైదరాబాదు కేంద్ర పక్షాన నా పేరు నమోదైవుంది. బహుశా ఆకాశవాణి వారు కాంటాక్ట్ ఫోన్ నెంబరు, పేరు నాది ఇచ్చి ఉంటారు. ఆయన అది గుర్తుపెట్టుకుని పేరుతో నన్ను పలకరించారు. మా డైరెక్టర్ ముఖం చిన్నబుచ్చుకున్నారు.

రికార్డింగు పూర్తయిన తరువాత ఆయన ఒకమాట అన్నారు. "రేపే ఢిల్లీ నుండి ప్రసారం కాబట్టి మీరు టేప్ సాయంత్రం నాలుగ్గంటలలోపు రాజ్‌భవన్ గెస్ట్ హౌస్‌లో నా రూంకి తెచ్చి ఇవ్వండి. రేపు మీ ఆకాశవాణికి చేరే ఏర్పాటు చేస్తానన్నారు. అప్పుడాయాన విదేశాంగమంత్రి.

సాయంత్రం మూడుగంటలకు రాజ్‌భవన్ గెస్ట్ హౌస్‌లో సీల్డ్ కవర్ టేపు వారికి స్వయంగా అందించాను. మర్యాదపూర్వకంగా ఆయన కూచోమన్నారు.

"ఎంతకాలమైంది మీరు ఆకాశవాణిలో చేరి?" అన్నారు ఆప్యాయంగా.

"పది సంవత్సరాలైంది సార్!" అన్నాను.

"రేడియో కార్యక్రమాలలో కొత్తదనం తీసుకురండి. ఒకప్పుడు దేవులపల్లి, స్థానం, బందా వంటి పర్సనాలిటీస్ పనిచేశారు. నాకు రేడియోలో కర్ణాటక సంగీతం వినడం అలవాటు" అన్నారు.

ఆయన అంత ఆదరంగా మాట్లాడటం నన్ను ఆనందపరవశుణ్ణి చేసింది. పూర్వపరిచయం లేకపోయినా నా స్థాయి ఉద్యోగితో కూడా కార్యక్రమ స్థాయిని పెంచేలా చూడమని సలహాఇవ్వడం వారి ఔన్నత్యానికి నిదర్శనం. ఆయన చేతిలో ఏదో పుస్తకం ఉంది. నిరంతర పఠనశీలి ఆయన.

1994 ఫిబ్రవరిలో కడవ బహిరంగసభలో ఆయన మాట్లాడినప్పుడు నేను ఆకాశవాణి డైరెక్టరుగా సభావిశేషాలు రికార్డుంగు చేశాను. 1991 నుండి 1996 వరకు ఆయన నంధ్యాల పార్లమెంటు సభ్యులు. భారతదేశ ప్రధాని. నంద్యాలకు ఘనచరిత్ర వుంది. 1977లో నీలం సంజీవరెడ్డి జనతాపార్టీ పక్షాన ఆంధ్రప్రదేశ్ నుండి గెలిచిన ఏకైక అభ్యర్థి. వెంటనే ఆయన రాష్ట్రపతి అయ్యారు. 14 సంవత్సరాల తర్వాత ఆ నియోజకవర్గం నుండి గెలిచిన పి.వి. ప్రధాని అయ్యారు. తొలి తెలుగు ప్రధాని.

1998లో నేను ఆకాశవాణి ఢిల్లీ కేంద్ర డైరెక్టర్. ఒక సాయంకాలం పి.వి. గారి పర్సనల్ సెక్రటరీ ఖండేకర్ మా ఆఫీసునెంబరుకు ఫోను చేసి 'పి.వి.గారు స్వయంగా మాట్లాడలనుకొంటున్నారు' అన్నాడు. ఆశ్చర్యం వేసింది. ఖండేకర్ పి.వి. వద్ద సెక్రటరీగా ఇరవై ఏళ్ళుగా పనిచేస్తున్నారు.

"ఆకాశవాణి ఇటీవల కొన్ని కర్ణాటక, హిందుస్థానీ సంగీతం ఆడియో సి.డి. లు విడుదల చేసిందని విన్నాను. అవి ఎక్కడ దొరుకుతాయి?" అన్నారు పి.వి. మృదువుగా.

"రేపు ఉదయం పదకొండు గంటలకు తమరు అనుమతిస్తే నేను స్వయంగా తెచ్చి ఇస్తాను సార్!" అన్నాను తెలుగులో.

ఒక్కనిమిషం ఆలోచించి "పన్నెండు గంటలకి రండి!" అన్నారు.

నేను ఆకాశవాణి భవన్‌లోని ఆర్కైవ్స్ విభాగానికి వెళ్ళి అక్కడి మిత్రులు పి.యన్. గోపాలకృష్ణన్‌తో మాట్లాడి ఏడెనిమిది ఆడియో సి.డి.లు తీసి ప్యాక్ చేయించాను. మర్నాడు సరిగ్గా పన్నెండింటికి వారిని మోతీలాల్ నెహ్రూ మార్గ్ లో

బంగళాలో కలిసి అందించాను. ఎంతో ఆనందించారు.

కోల్పోతున్న రేడియో ప్రాభవం గురించి క్లుప్తంగానే అయినా హెచ్చరిక చేసి చురకవేశారు. రేడియో సంగీతంలో తాను ఎక్కువసేపు విశ్రాంతి జీవితం గడుపుతున్నానన్నారు. హైదరాబాదు కవి పండితుల గూర్చి వాకబు చేస్తూ 'రావూరి భరద్వాజ బాగున్నారా?' అన్నారు. 'మీరు ఆడియన్స్ సమక్షంలో కచేరీ ఏదైనా ఏర్పాటుచేసినపుడు చెబితే వీలుచేసుకొని వస్తానన్నారు.'

ఆకాశవాణి సంగీత సమ్మేళనంలో భాగంగా ఢిల్లీ సిరిఫోర్ట్ ఆడిటోరియంలో సంగీత కచేరీ ఏర్పాటుచేసినప్పుడు స్వయంగా ఆహ్వానపత్రిక అందించాను. పి.ఏ.ని పిలిచి డైరీలో నోట్ చేయించారు.

ముందురోజు పి.ఏ. కి ఫోన్ చేసి గుర్తుచేశాను.

'సార్ వస్తారు తప్పక" అన్నారతను. ఒక రెండు, మూడు సీట్లు ఖాళీ పెట్టమన్నారు.

మర్నాడు సాయంత్రం నాలుగు గంటలకి పి.ఏ. నుంచి ఫోన్.

"సిరిఫోర్టు ఆడిటోరియంకు సెక్యూరిటీవాళ్ళు వెళ్ళగూడదని చెప్పారు. సార్ 'సారీ' చెప్పమన్నారు అన్నాడు.

**కవిగా పి.వి. :**

"నేనొక చైతన్యోర్మిని
నిస్తుల ప్రగతి శకలమును
ఇది నీ సంతతకర్మ, మరే హక్కులు లేవునాకు,
ఈ నిద్రాణ నిశీధి మహిత జాగృతి పుంజముగ
వెలుగుటయే నా తపస్సు, వెలిగించుట నా ప్రతిజ్ఞ"

రాష్ట్రముఖ్యమంత్రి పి.వి. నరసింహారావు స్వాతంత్ర్య రజోత్సవ సందర్భంగా 1972 ఆగష్టు 15 అర్థరాత్రి ఆంధ్రప్రదేశ్ శాసన సభా భవనంలో తమ సందేశాన్ని కవితాత్మకంగా ఆలాపన చేశారు.

"ఈ నిద్రాణ నిశీధిని, ఈ నీరవ వాయుతరంగిణిలో
ఒరపిడివడి



దొర్లిన భావస్ఫులింగములు వెలుగునిచ్చునా?
అటులని విశ్వసించునా పథికుడు?
మృగజలమును జలమని నమ్మిచనిన ఆచిరపిపాసి
శీతోదకసేవనమున సేదదీరునా నేటికి" అని
భవిష్యత్ దర్శనం చేసి చూపారు.

పి.వి.లో చక్కటి వ్యంగాత్మ ఉంది. కాళోజి షష్టిపూర్తి సందర్భంగా పి.వి. ఎనిమిది పాదాల గేయం పంపారు.

"ఆరుపదులు నిండెనంట నారయ! నీకాయమునకు
ఆరా? పదియా? మనస్సు కనెడు సందియముతోచును!
సూక్తులు శాపములును, పునరుక్తి దోషమందకుండ
జగత్తు నభిశంసించుచు శతవత్సరములు దాటుము!
నేటి కస్సుబుస్సుకు కన్నీటి వింత జతగూర్చుచు
అంతరంగ నవనీతము అనారతము పంచియుమ్ము!
బ్రహ్మ నీకు పొరబాటున పాపుల వయసిచ్చుగాక!
కాలుడు మా కాళయ్యను కలకాలము మరచుగాక!

ప్రతిపదము సార్థకము. కాళోజి హృదయాన్ని ఆవిష్కరించిన ఆర్ద్రమైన కవిత 'అల్పాక్షరముల అనల్పార్థ రచన' అని భారతీయ అలంకారికులు చెప్పిన సూక్తికి ఈ గీతం నిదర్శనం.

పి.వి. బహుభాషావేత్త, కవి, కథకుడు, నవలాకారుడు, ఆత్మకథాశిల్పి, అనువాదకుడు, అద్భుత ప్రసంగకర్త, అన్నిటికీ మించి మేధావి. మరాఠీ భాష నుండి తెలుగులోకి ఎంత సరళంగా అనువదించగలరో, తెలుగులోంచి హిందీలోకి అంతే ఒడుపుగా అనుసృజన చేయగల దిట్ట.

### సహస్రఫణ్ పి.వి. :

రాజకీయ చతురతతో బాటు పి.వి. సాహితీ సహస్ర షండుడు. తెలుగువారు సగర్వంగా చెప్పుకునే తొలి తెలుగు జ్ఞానపీఠం విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షం. అంతకంటే ఆయనకు ఖ్యాతి తెచ్చిపెట్టిన నవల 'వేయిపడగలు.' విశ్వనాథ పి.వి. అభిమాని. వేయి పడగలను హిందీలోకి 'సహస్ర ఫణ్' పేర అనువదించారు. వారే తమ హిందీ అనువాదానికి పీఠికను వ్రాశారు (దాని తెలుగు అనువాదం ఇది).

ఈ వేయిపడగలు 'జాన్‌క్రిస్టోఫి' వంటి నవలయైనను, దీనిలో చరిత్ర, సాంఘికశాస్త్రము, రాజనీతి, ప్రాచీన సంస్కృతి, సర్వోత్కృష్ట నిరూపణ, శిల్పసౌందర్య పరాకాష్ఠ ఇవన్నియు కలవు. అనేకములైన వాదోపవాదములు అందుగలవు. ఇందు పెద్ద ఎత్తున రసము చిప్పిలుచుండును. కొందరి ఉద్దేశములో ఇది నవల కాదు. బహుశః వారిట్లనుటకు కారణము దీనిలో నవలను మించి అనంతమైన విషయములు చెప్పబడినవి కావచ్చును.

విశ్వనాథ వర్ణనా చమత్కారం గురించి పి.వి. ఈ పీఠికలో విస్తృతమైన వివరణ చేశారు. ఆయనపై పి.వి. కి ఉన్న గౌరవభావానికది నిదర్శనం.

"ఇంకొక విషయము చెప్పవలయును. అది వేయి పడగలలోని వర్ణనలు, ఋతువర్ణనలు: పాములయొక్క వర్ణనలు చిత్రవిచిత్రముగా నుండును. అక్కడక్కడ వెన్నెలను వర్ణించుటకు తెచ్చిన ఉపమానములు, సర్పములు వర్ణించుటయందు చేసిన పోలికలు బహు విచిత్రములుగా నుండును. వర్ణనలలో కల్పనా శక్తి శూక్ష్మ దర్శిత్వము భాషధికారము, వ్యాపకమైన సంవేదనశీలత ఉట్టిపడును. వర్ణనలు లేకున్నచో కథాక్షతి జరుగదు. కాని రచన యొక్క ఉదాత్త బింబమునకు క్షతి కలుగును. ఈ ఒక్క వర్ణనలు చదివినచో చాలామంది కవులును, పండితులును కావచ్చును. అది వారికెంతో ఉపయోగపడును" ఈ చివరి వాక్యం వలన ఆధునిక కవులు వర్ణనలను హేళన చేసే విధానాన్ని ఆయన ఎంతగా నిరసించారో తెలుస్తుంది. హిందీభాషలో ఆయన అందెవేసిన చేయి. మహీదేవీవర్మ ఆయన అభిమాన హిందీ రచయిత్రి. మహీదేవీ వర్మ షష్టి పూర్తి సందర్భంగా అభినందన సంచికకు పి.వి. హిందీలో వ్రాసి పంపిన వ్యాసం ఆయన భాషాభిమానాన్ని చాటుతుంది. (ఆ వ్యాసం తెలుగు అనువాదమిలా సాగింది)

"స్త్రీ సహజ కోమలత్వం - స్త్రీ కావడమే మహాదేవి మొట్టమొదటి విశేషం. ఇది ఆమె కావ్యం చదివేటప్పుడు క్షణక్షణం స్ఫురిస్తుంది. అడుగడుగున సహృదయ నారీ సహజమైన అభివ్యక్తులే గోచరిస్తాయి. ఇది ఇతరులకు అసాధ్యమనే చెప్పవచ్చు. శృంగారసాహిత్యమే కాదు సుదీర్ఘ కావ్యచరిత్రలో నాయికకు ఆపాదించబడిన విశిష్టతలు ఈ నాయికలో లభించవు. శృంగార సాహిత్య ప్రపంచంలో మూడు నాలుగింటిలోనే స్త్రీ మనోభావాలు విశదంగా వర్ణింపబడ్డాయి"

ఇలా సుదీర్ఘమైన చర్చ చేస్తూ పి.వి. మహీదేవి వర్మ రచనలను సమీక్ష చేశారు. అలానే మరో హిందీ అనువాద గ్రంథానికి చిరు పీఠిక వ్రాస్తూ పి.వి. అనువాదంలోని క్లిష్టతను తెలియజేశారు.

చివుకుల పురుషోత్తం తెలుగు నవల - ఏది పాపం? గ్రంథాన్ని అలహాబాదు న్యాయవాది సూర్యనాథ ఉపాధ్యాయ హిందీలోకి అనువదించారు. దానికి వ్రాసిన పీఠికలో ఆదాన ప్రధానాలు భాషకు అవసరమంటూ దక్షిణ భారతదేశ భాషలోకి దక్షిణ భారతీయులే ఇప్పటివరకు చేశారనీ, ఉత్తరదేశానికి చెందిన ఈ రచయిత అభినందనీయులన్నారు.

## అనువాదంలో క్లిష్టతను గూర్చి ప్రస్తావిస్తూ పి.వి. :

"కుశల అనువాదకుడికి మూల భాషపైన, అనువాద భాషపైన, రెండింటిపైన సమానమైన అవగాహన (అధికారం) ఉండడం ఎంతగానో అవసరమన్నమాట సత్యమే. అయినా భాషపై అధికారం ఉన్నంతమాత్రాన భావ వ్యక్తీకరణ, సామాన్యపద ప్రయోగాలు, చెప్పే విధానం వీటన్నింటిల్లో కూడా తగినంత కౌశలం ఉండదు- అన్నది కూడా అంతే సత్యం. ఆ కారణంగానే చాలా అనువాదాలు ఆయా భాషల్లో ప్రాచుర్యాన్ని పొందలేక సఫలం కాలేకపోతున్నాయి" అని ఆవేదన వ్యక్తం చేశారు.

మరాఠీ ఘనీపాఠీ: పి.వి. నాగపూరులో విద్యాభ్యాసం చేశారు. మరాఠీ భాషా సాహిత్యాలతో అనుబంధం పెంచుకొన్నారు. మరాఠీ నవలా రచయిత హరి నారాయణ ఆప్టే నవల అబలా జీవితం సాహిత్య ప్రియులను అలరించింది. పి.వి. తెలుగులోను, ఇంగ్లీషులోను అనేక పుస్తకాలకు పీఠికలు వ్రాశారు. ఆర్మీమేజర్ పి.ఏ. రాజు ఇంగ్లీషులో కందుకూరి వీరేశలింగం పంతులు రాజకీయ దృక్పథం గురించి థీథీసీస్ వ్రాశారు. రక్షణ శాఖా మంత్రిగా పి.వి. పీఠిక వ్రాశారు.

> వ్యక్తిగా పి.వి. బహుముఖాల విస్తృత రూపమే. ఆయన ఆత్మకథ – The Insider. సున్నితమైన వైయుక్తిక కోణం మొదలుకొని కర్కశమైన రాజకీయ దృక్కోణం వరకూ విస్తరించిన ఈ ఇతివృత్త పరిధిలో నవల ప్రయోగ మార్గం అనుసరించింది.

పి.వి స్వయంగా తెలుగు పుస్తకాలు కొన్ని అంకితం పొందారు. హైదరాబాదు సంస్థాన విమోచనోద్యమంలో తుపాకీ చేతపట్టి గెరిల్లా క్యాంపులు నిర్వహించిన పి.వి. కలం చేతబట్టి బహుభాషాకోవిదుడై 'Indian' ఆత్మకథ ద్వారా సాహిత్యంలోకాన్ని, రాజకీయాలోకాన్ని అబ్బురపరిచారు.

బహుముఖీనప్రజ్ఞ: వ్యక్తిగా పి.వి. బహుముఖాల విస్తృత రూపమే. ఆయన

ఆత్మకథ - The Insider. సున్నితమైన వైయుక్తిక కోణం మొదలుకొని కర్కశమైన రాజకీయ దృక్కోణం వరకూ విస్తరించిన ఈ ఇతివృత్త పరిధిలో నవల ప్రయోగ మార్గం అనుసరించింది. సృజనకు అనుభవం ముడిసరుకు. అనుభవాన్ని కేవలం అనుభవంగా చెప్పడం ఒక పద్ధతి. అనుభవాన్ని సమకాలీక వాస్తవికతలో ఒక అంశంగా భావించి చెప్పడం మరొక పద్ధతి. ఈ రెండో పద్ధతి పి.వి. ఎంచుకున్నారు. ఈ పద్ధతి రచయిత బాధ్యతను రెట్టింపు చేసింది.

రెండో భాగానికి పి.వి. తయారౌతున్నప్పుడు కవి, పత్రికా రచయిత అయిన అఫ్సర్ ఆయనను కలిశారు. "నవలారచన సృజనాత్మక ప్రక్రియ కదా? ఇందులో ప్రశ్నోత్తరాలకూర్పు డ్రైగా వుండదా?" అని అఫ్సర్ పి.వి. ని ప్రశ్నించారు. దానికి పి.వి. ఇచ్చిన సమాధానమిది.

"ప్రతి రచయితా ఒక నిర్మాణ పద్ధతిని ఏర్పరచుకొంటాడు కదా. వాస్తవికతను చేరుకోవడానికీ, సత్యాన్ని అన్వేషించడానికీ తలా ఒక పద్ధతి. నేను ఈ పద్ధతి సబబుగా వుంటుందనుకొన్నాను. ఇప్పుడు రెండో భాగానికి సిద్ధమవుతున్న సమయంలో ఇప్పటికీ 50, 60 మౌలికమైన ప్రశ్నలు నా దగ్గర ఉన్నాయి. వాటి గురించి నేను వీలైనప్పుడల్లా ఆలోచిస్తుంటాను. ఇంకా ఎన్ని ప్రశ్నలు వస్తాయా?" అని ఆసక్తిగా ఎదురుచూస్తుంటాను. ఆ ప్రశ్నల్లోంచి నేను నవలలోకి వెళ్తాను" అన్నారు పి.వి.

కథాకథన చక్రవర్తి : పి.వి. వ్రాసిన "గొల్ల రామవ్వ" కథ అద్భుత నేపథ్యంతో సాగింది. ఉత్కంఠభరితంగా సాగిన ఈ కథలో రామవ్వ ఒక యువకుడిని పోలీసుల నుండి ఒక చీకటి రాత్రి రక్షించింది. సన్నివేశ వర్ణనలో పి.వి. అద్భుత చిత్రీకరణ చేశారు.

మంగయ్య అదృష్టం అనేది ఒక నవలిక. అదృష్టవంతుడిని ఎవరూ చెరచలేరు అనే దానికి ఉదాహరణగా బ్రహ్మదేవునికీ, దేవతా సముదాయానికీ మధ్య తగాదా సృష్టించి మంగయ్య రాష్ట్ర ముఖ్యమంత్రి అయితే ఆశ్చర్యపడేలా చేశారు.

నీలం రంగు సిల్క్ చీర మరో వైచిత్రితో కూడిన కథ. బొంబాయిలో వేశ్య గృహానికి వెళ్ళిన ఒక బడా వ్యక్తి ముసుగుతీసిన వనిత తన చెల్లెలేనని తెలిసి పశ్చాత్తాప పడతాడు. చనిపోయిందనుకున్న చెల్లి దుష్కరుల చేతిలో వంచితురాలైంది. ఈ విధంగా కాల్పనిక సాహిత్యంలోను పి.వి. అసమాన ప్రతిభ చూపిన ధీశాలి!

# కొనసాగుతున్న కథ 'లోపలి మనిషి'



కల్లూరి భాస్కరం
97034 45985

పి.వి. నరసింహారావుగారు ఆంగ్లంలో రచించిన 'ది ఇన్ సైడర్' ను 'లోపలి మనిషి' పేరుతో నేను తెలుగులోకి అనువదించిన సందర్భంలో వారితో ఎన్నోసార్లు సమావేశమయ్యాను, ఫోన్ లో మాట్లాడాను. ఆవిధంగా ఆయన లోని రాజకీయప్రతిభావంతుడినే కాకుండా, బహు భాషా సాహిత్యాలతో లోతైన పరిచయం ఉన్న ఒక సాహితీవేత్తను కూడా కొంచెం దగ్గరగా చూడగలిగాను. అంతేకాదు, వారి వ్యక్తిత్వంలోని మెరుపులను చూడగల అవకాశం కూడా నాకు లభించింది.

1998లో 'లోపలి మనిషి' ఆంధ్రప్రభలో ధారావాహికగా ప్రచురితమైంది. అప్పటికి నేను ఆ దినపత్రికలో న్యూస్ ఎడిటర్ ర్యాంకు ఉద్యోగిగా ఉన్నాను. అయినా సరే, నేను అనువాదం చేస్తున్న సంగతి పత్రిక సంపాదకులూ, యాజమాన్యమూ వారికి తెలియజేసిన వెంటనే కొన్ని అనువాదభాగాలు తెప్పించుకుని పరిశీలించి ఆమోదముద్ర వేశారు. ఆ తర్వాత అనువాదం గురించి నేరుగా నాతోనే సంభాషణా, సంప్రదింపులూ ప్రారంభించారు. ప్రోటోకాల్ పట్టింపులేవీలేని ఆయన వ్యక్తిత్వంలోని ఒక గొప్ప పార్శ్వం అప్పుడే నాకు అర్థమైంది.

'లోపలి మనిషి' ధారావాహిక ప్రచురణ ప్రారంభమయ్యాక ఆయన అనువాదపాఠాన్ని ఎప్పటికప్పుడు తెప్పించుకుని పరిశీలించడమే కాక, ప్రూఫులుకూడా దిద్దేవారు. మూలపాఠంపై నేను ఎప్పుడు, ఎక్కడ, ఎలాంటి సందేహం వ్యక్తం చేసినా ఎంతో ఓపికగా సమాధానం చెప్పేవారు. 'లోపలి మనిషి'ని ఎమెస్కో పుస్తకరూపంలో ప్రచురించి విజయవాడలోనూ, విశాఖపట్నంలోనూ ఆవిష్కరణ సభలు ఏర్పాటు చేసినప్పుడు పి.వి. గారితోపాటు నేను కూడా ఆ సభలకు హాజరయ్యాను. విజయవాడ సభలో ఆయన నా గురించి మాట్లాడుతూ, "ఇతనికీ నాకూ బాగా కుదిరింది. ఇతను మామూలు అనువాదకుడు కాదు.

అదెలాగా, ఇదెలాగా అంటూ సందేహాలు లేవనెత్తేవాడు. నేను సమాధానం చెబుతూ ఉండేవాణ్ణి. కనుక ఇతను నా ట్రాన్స్ లేటర్ కాదు; నా ఇంటర్ప్రెటర్. ఇన్ సైడర్ రెండవ భాగాన్ని కూడా ఇతనే అనువదిస్తాడు" అన్నారు. ఆ సమావేశంలో పాల్గొన్న వక్తలందరూ 'ది ఇన్ సైడర్' మీదా, అందులోని విషయం మీదా మాట్లాడితే తను మాత్రం అనువాదం మీద మాట్లాడారు.

ఈ విధంగా వారితో నా వ్యక్తిగత ముఖాముఖీకి సంబంధించి ఎన్నో విశేషాలు ఉన్నాయి. వాటిని అలా ఉంచి, ఒక రచనగా 'లోపలి మనిషి' తీరు తెన్నుల గురించి నా అభిప్రాయాలను కొన్నింటిని పంచుకుంటాను. పి.వి. నరసింహారావు అధికారంలో ఉన్నప్పుడు 'సైలెంట్ కిల్లర్'గా పేరుపొందారు. 'లోపలి మనిషి'గా తెలుగులోకి అనువాదమైన ఆయన రచన 'ది ఇన్ సైడర్' ను ఒక మాజీ ప్రధాని రాసిన రచనగా ఎంతోమంది ఆసక్తితో చదివారు తప్ప; సాహిత్యప్రపంచంలో మాత్రం అది మౌనహత్యకే గురైనట్టు నాకు అనిపిస్తుంది. ఎవరైనా, ఎప్పుడైనా దాని గురించి మాట్లాడవలసివస్తే దాని 'రూపం' గురించి ప్రస్తావించి, అది ఆత్మకథ అవుతుందా? నవల అవుతుందా? నవల అయితే అందులో నవలా లక్షణాలు ఏవీ? అందులో సాహిత్యపు విలువలేవీ? అని పెదవి విరిచారు తప్ప అందులోని వస్తువు గురించి మాట్లాడినవారు తక్కువ. ఒక పరిపాలకుడిగా ఆయనపై వున్న వ్యతిరేకభావన, ఆయన రచనను అంచనా వేయడంలో కూడా విపరీత ప్రభావం చూపించి క్రూరమౌనానికి దారితీసిందనిపిస్తుంది. చివరికి ఆ పుస్తకం 'సైజు'ను కూడా చూపించి కొందరు విరస వ్యాఖ్యలు చేశారంటే వ్యక్తిగా ఆయనపట్ల అప్పట్లో ఎంత వ్యతిరేకత ఉందో అర్థమవుతుంది. ఇప్పటి పరిస్థితి వేరు. గత కొన్నేళ్లుగా పి.వి.గారిపట్ల యావద్దేశం ప్రత్యేకమైన ఆసక్తిని, అభిమానాన్ని చాటుకోవడం చూస్తున్నాం. ఆయనపై వస్తున్న రచనలు కూడా అందుకు ఒక సాక్ష్యం.

> "వ్యక్తిగా, రాజకీయవాదిగా పరస్పర భిన్నమైన పాత్రలతో, వైరుధ్యాలతో ఆయన సుదీర్ఘ సహజీవనం చేశారు. అది ఆయన మాటకీ, మౌనానికీ మధ్య సాగిన సహజీవనం కూడా."



పి.వి. మౌనముద్ర సాధారణమైనది కాదు. అది ఆయన రాజకీయ జీవితం అంతటా పరచుకున్న మౌనముద్ర. వ్యక్తిగా, రాజకీయవాదిగా పరస్పర భిన్నమైన పాత్రలతో, వైరుధ్యాలతో ఆయన సుదీర్ఘ సహజీవనం చేశారు. అది ఆయన మాటకీ, మౌనానికీ మధ్య సాగిన సహజీవనం కూడా. తన సుదీర్ఘమౌనాన్నే ఆయన మాటలుగా మార్చి ఏడువందల పుటల్లో 'ది ఇన్ సైడర్' తొలి భాగాన్ని అందించారు. దాదాపు అన్నే పుటలు ఉన్న 'ది ఇన్ సైడర్' రెండవ భాగాన్ని చాలావరకు పూర్తిచేసి కన్నుమూశారు. తన రచనకు 'ఇన్ సైడర్' అని పేరు పెట్టడంలో కాంగ్రెస్ పార్టీ వ్యవహారాలను, ప్రభుత్వ వ్యవహారాలను కొన్ని దశాబ్దాలపాటు లోపలినుంచి చాలా సన్నిహితంగా చూసిన వ్యక్తినన్న భావన పాఠకులకు కలిగించడమే ఆయన ఉద్దేశమనుకుంటారు. కానీ మరో కోణం నుంచి చూస్తే, రాష్ట్రమంత్రితో ప్రారంభించి ప్రధానమంత్రివరకు సాగిన పదవీ అధిరోహణంతో సహా తన రాజకీయ బాహ్యజీవితానికీ సమాంతరంగా తన లోపల ఉంటూ వచ్చిన 'లోపలి మనిషి'ని ఆవిష్కరించే రచనగానే ఆయన ఆ పేరు పెట్టారనిపిస్తుంది. తన రాజకీయ జీవితం మీద తనే రాసుకున్న డిసెంట్ పత్రం 'లోపలి మనిషి'. స్వయంగా తను కూడా అంతర్భాగంగా ఉన్న యాభై సంవత్సరాల దేశ రాజకీయ స్థితిగతుల మీద ఆయన వ్యక్తీకరించిన తీవ్ర నిరసన 'లోపలి మనిషి'.

వ్యక్తిగా, ఒక పరిపాలకుడిగా, రాజకీయనేతగా నరసింహారావుగారి గుణదోషాల మీద, వైఫల్యాల మీద ఎవరు ఎలాంటి తీర్పునైనా ఇవ్వవచ్చు. కానీ, 'లోపలి మనిషి'ని ఒక రచనగానే, రచయిత కోణం నుంచే పరిశీలించి అంచనా వేయడం సాహిత్యమర్యాద అవుతుంది. విచిత్రమేమిటంటే, తను ఏ పార్లమెంటరీ పార్టీ రాజకీయాల్లో యావజ్జీవితం భాగస్వామిగా ఉన్నారో, అందులోనూ వాటి స్థితిగతులను ఏదో ఒక మేరకు మార్చగల కీలకస్థానంలో కొన్నేళ్లపాటు ఉన్నారో; ఆ పార్లమెంటరీపార్టీ రాజకీయాలనే పునాదులతో సహా పెళ్లగించగల శక్తిమంతమైన ప్రేలుడు సామగ్రిని ఆయన 'లోపలి మనిషి'లో నిక్షేపించారు. అది ఆయన ఆత్మకథే అన్న భావన దగ్గరే ఆగిపోతే, అందులో సార్వకాలికంగా పొందుపరిచిన మహార్థం మరుగున పడిపోతుంది.

నరసింహారావుగారు ప్రధానిగా తన పదవీకాలం ముగిసిన తర్వాత



శేషజీవితాన్ని చాలా అసంతుష్టితో, అంతర్మథనంతో, ఆత్మవిమర్శతో గడిపారు. అప్పుడప్పుడు ప్రైవేట్ సంభాషణలలో ఆయన చేస్తూ వచ్చిన వ్యాఖ్యలు, ఆయన మౌనంలో నిబిడీకృతంగా ఉన్న విస్ఫోటశక్తిని అనుభవానికి తెస్తూ ఉండేవి. ఒకసారి ఈ వ్యాసకర్తతో మాట్లాడుతూ, 'ఎన్నో చేయాలనుకున్నాను, చేయలేకపోయాను' అంటూ ఒక్క పెదవి విరుపుతో ఆయన చేసిన వ్యాఖ్య ఆయనలోని నైరాశ్యాన్ని, నడుస్తున్న రాజకీయాల నిరర్థక స్థితిని కళ్ళకు కట్టించింది. పదవి నుంచి తప్పుకున్నాక తన శేషజీవితాన్ని రాజకీయేతరంగా, కేవలం ఒక రచయితగా గడపడానికే ఆయన ఇష్టపడ్డారు, అలాగే గడిపారు కూడా. అంతవరకూ తన రాజకీయ జీవితంలో జోకొడుతూవచ్చిన 'లోపలి మనిషి'ని మేలుకొలిపే ఊసులతోనే జీవించారు. అది ఆయన స్వయంగా విధించుకున్న రాజకీయ ప్రవాసం.

సాహిత్యకోణం నుంచి 'లోపలి మనిషి' ప్రత్యేకతలలో ఒకటి చెప్పుకోవాలంటే, అది పార్లమెంటరీ రాజకీయాలను ప్రత్యక్షానుభవంతో చిత్రించిన రచన. మన దగ్గర రాజకీయతాత్వికతను ధ్వనించిన రచనలు చాలా ఉన్నాయి కానీ, ప్రత్యక్షంగా రాజకీయాలను చిత్రించిన రచనలు చాలా అరుదు. అందులోనూ ఒక రాజకీయ క్రియాశీలి ప్రధానపాత్రగా వచ్చిన రచనలు లేవనే చెప్పాలి. అంతేకాదు, ఇంచుమించు సమకాలీనం అనదగిన రాజకీయపరిణామాలపై, చరిత్రపై జనసామాన్యంలో ప్రచారంలో ఉన్న అభిప్రాయాలకు ఒకింత భిన్నమైన అవగాహన కలిగించే, ఒక సాధికార వ్యాఖ్యతో కూడిన రచన 'లోపలి మనిషి'.

రాజకీయాలు, పార్టీలు, ఎన్నికలు, ఓట్లు, ఎన్నికలలో చోటుచేసుకునే అక్రమాలు, ప్రభుత్వాల ఏర్పాటు, అవినీతి, పదవులకోసం కుమ్ములాటలు మొదలైన రకరకాల ముఖాలతో చిరపరిచితమైన మొత్తం ప్రక్రియ మీద నుంచి; చాలా మౌలికమైన ప్రశ్నలవైపు మళ్లించే ప్రయత్నం చేస్తుంది 'లోపలి మనిషి'. అంతిమంగా ఈ రచన ఆవిష్కరిస్తున్నది తిరుగులేని ఒక రాజకీయ మహావైఫల్యాన్ని, నడుస్తున్న రాజకీయాల నిరర్థకస్థితిని! ఇంకా విశేషమేమిటంటే, ఈ రాజకీయ వైఫల్యం ఇలాగే కొనసాగితే నక్సలిజం వంటి తీవ్రవాదాలే ప్రత్యామ్నాయం కాకతప్పదని ధ్వనిపూర్వకంగా ఈ రచన హెచ్చరిస్తుంది.

'లోపలి మనిషి'లో ప్రధానంగా చిత్రితమైనవి మూడు అంశాలు. మొదటిది, నడుస్తున్న రాజకీయాలపై, ప్రభుత్వాలపై, రాజకీయవాదులపై తీవ్ర అధిక్షేపణ. రెండవది- ఆదర్శవాది, ఆశావాది, స్వాప్నికుడు అయిన ఒక మంత్రి సామాజిక పరివర్తనకు దోహదం చేసే భూసంస్కరణలనే ఒక కార్యక్రమాన్ని అమలు చేయడానికి చేసిన విఫలయత్నం. మూడవది, అధికారం దేనికి? ఏ మహత్తరప్రయోజనానికి అన్న ప్రశ్న.

ఈ రచనలో కథానాయకుడైన ఆనంద్ మంత్రికాగానే వేసుకున్న ప్రశ్న, అధికారం దేనికనే. ఈ ప్రశ్న మీద అతను గంటల తరబడి తర్కించుకుంటాడు. అధికారానికి గల రకరకాల గుణాలను విశ్లేషించుకుని, వాటి ప్రభావం తన మీద పడని తటస్థ స్థితిలో తను ఉండగలడా అని ఆత్మశోధన చేసుకుంటాడు. ఉండగలననే చివరికి నిర్ధారణకు వస్తాడు. స్వార్థపరార్థాల క్రమాన్ని తలకిందులు చేయలేనప్పుడు మంత్రి చేతిలో అధికారం అనేది ఎందుకు ఉండాలి? అప్పుడు మామూలు మనిషికి, మంత్రికి తేడా ఏముంటుందనుకుంటాడు. అధికారం అనేది స్వీయవైభవానికి కాదు, ప్రజాహితం కోసం వినియోగించాల్సిన బాధ్యతాయుత సాధనమన్న నిర్ణయానికి వస్తాడు. పార్టీలు, ఎన్నికలు, ఓట్లు, పదవులతో సహా నడుస్తున్న మొత్తం ప్రక్రియ ఒక అలవాటుగా, తంతుగా మారిపోయి; అధికారం దేనికన్న మౌలికప్రశ్న

> "స్వార్థపరార్థాల క్రమాన్ని తలకిందులు చేయలేనప్పుడు మంత్రి చేతిలో అధికారం అనేది ఎందుకు ఉండాలి? అప్పుడు మామూలు మనిషికి, మంత్రికి తేడా ఏముంటుంది"

మరుగున పడిపోయిన ప్రస్తుతస్థితిలో ఆ ప్రశ్నను ముందుకు తేవడం 'లోపలి మనిషి' ప్రాసంగికతను స్థాపించే ఒక ముఖ్యమైన అంశం.

భూసంస్కరణల అమలు ఆనంద్ సొంత ఆలోచన కూడా కాదు. నెహ్రూ కాలం నుంచీ కాంగ్రెస్ తన ఎన్నికల ప్రణాళికలో వాగ్దానం చేస్తూ వస్తున్నది. అధికారం గురించి తర్కించుకున్నట్టే భూమి గురించి, భూసంస్కరణల గురించి ఆనంద్ సుదీర్ఘంగా తర్కించుకుంటాడు. సాహిత్యపరంగానూ లోతైన, గాఢమైన అభివ్యక్తిని తెచ్చుకున్న ఘట్టాలలో అది కూడా ఒకటి. ఆనంద్ ఆలోచనల మీదుగా పి.వి.గారు ఆ ఘట్టాన్ని ఇలా నడిపిస్తారు:

"భూమి అంటే అధికారం. గ్రామజీవనంలో అదే సర్వస్వం. గ్రామీణచైతన్యంలో భూమి సర్వశక్తిమంతం, సర్వవ్యాప్తం, సర్వసాక్షి. భూమి ఎవరూ ఢీకొనలేని సర్వోన్నత శక్తి, ఎవరూ నిరాకరించలేని మహా సత్యం, ఎవరూ విచ్ఛిన్నం చేయలేని జటిల నిర్మాణం. శతాబ్దాలుగా ఇది మళ్ళీ మళ్ళీ రుజువవుతూనే ఉన్న నిజం.

"భారతదేశంలో భూమి కథ హింసతో, రక్తపాతంతో, కన్నీటి మరకలతో నిండి అనంతంగా విస్తరించింది. అధికారిక పత్రాలు, ముఖ్యంగా భూమి సమస్య గురించి నిపుణులు రాసిన గ్రంథాలు లోతుగా అధ్యయనం చేసి తెలుసుకున్న ఎన్నో కీలకాంశాలతో ఆనంద్ మెదడు కిక్కిరిసిపోయింది. వాటిలో ఒకటి, పందొమ్మిదో శతాబ్దంలో బ్రిటిష్ పాలకుల ప్రోత్సాహంతో ఒక వ్యవస్థగా ఎదిగిన భూస్వామ్యం పుట్టుకకు సంబంధించినది... ఆ రోజుల్లో బందిపోటు, రాజు, భూస్వామి వీరందరూ ఒకే వ్యక్తి ధరించే మూడురూపాలుగా పరిణమించిన ఆశ్చర్యకర సన్నివేశం విశేషంగా చెప్పుకోదగినది....

"భూమి, తన మీద జీవించే ప్రతి ఒకరికీ సొంతం; చెట్టు తన మీద గూడు కట్టుకున్న ప్రతి పిట్టకీ సొంతం; అలాగే నీరు...అప్రయత్నంగా, అవ్యాజంగా కలిగే సృష్టికర్త చలవతో తనలోకి ఎగిరి దూకుతూ, ఈదుతూ, జారుతూ, పిల్లిమొగ్గలు వేస్తూ స్వేచ్ఛగా సంచరించే ప్రతి చేపపిల్లకీ సొంతం. ప్రతిదీ ప్రతి ఒకరికీ చెందుతుంది. 'చెందడం' అన్నదే సర్వత్రా వ్యాపించిన స్వాభావిక స్థితి. అక్కడ ఎటువంటి రికార్డులూ లేవు, రిజిస్ట్రేషన్లు లేవు, ఎవరికీ ప్రత్యేకమైన స్వామ్యం లేదు, ఎవరికీ వ్యక్తిగతమైన హక్కు లేదు. ఇటువంటి అద్భుతమైన సుందరమైన వ్యవస్థనుంచి నేటి వ్యవస్థకు చేరుకోవడంలో అభ్యుదయం అనదగినదేమీ లేదని ఆనంద్ విచారంగా అనుకున్నాడు..."

పార్టీ ప్రణాళికలోనే వాగ్దానం చేసిన భూసంస్కరణలను ముఖ్యమంత్రి రూపంలోని ఒక విధేయకార్యకర్తగా ఆనంద్ అమలుచేయబోయినప్పుడు, పార్టీలోని భూస్వామ్యశక్తులు దానిని తీవ్రంగా ప్రతిఘటిస్తాయి. బ్యూరోక్రసీ నిరాసక్తతను, నిష్క్రియతను చిత్తగిస్తుంది. చివరికి పార్టీ అధినాయకత్వం నుంచి కూడా అతనికి సహాయనిరాకరణే ఎదురవుతుంది. ఆవిధంగా అతడు ఒంటరివాడై అధికారం కోల్పోవడంతో 'లోపలి మనిషి' ముగుస్తుంది. ఇందులో పార్టీపై, పార్టీ అధిష్ఠానంపై కూడా అక్కడక్కడ నిశితవ్యాఖ్యలు కనిపిస్తాయి. ఇంకోవైపు పార్టీ అధినాయకత్వం భూస్వామ్యశక్తులను పక్కన పెట్టలేకపోవడానికీ, వారి ఒత్తిడికి లొంగి ఆనంద్ ను అధికారం నుంచి తప్పించడానికి గల కారణాలను కూడా 'లోపలి మనిసి' నిర్మమదృష్టితో వ్యాఖ్యానిస్తుంది. రష్యా, చైనాలలో జరిగినట్లు కొన్ని వర్గాలను నొప్పించే విప్లవభూమికపై కాక, వర్గసామరస్యంతో కూడిన క్రమపరివర్తనను లక్ష్యంగా పెట్టుకుని నెహ్రూ, ఆయన తర్వాత ఇందిరాగాంధీ భూస్వామ్యశక్తులకు కూడా పార్టీలో చోటు ఇవ్వవలసివచ్చిందని రచయిత వివరణ.

స్వాతంత్ర్యం తర్వాత పార్టీపరంగా, ప్రభుత్వాలపరంగా, ఆయా వ్యవస్థలపరంగా సంభవించిన వైఫల్యాల పర్యవసానమే నక్సలిజం అన్నది ఈ రచనలో పి.వి. కనబరచిన అవగాహన. నక్సలిజం అవతరణను, దాని సిద్ధాంతాలను ఆయన సుదీర్ఘంగా చర్చిస్తారు. అయితే ఆ చర్చ సైద్ధాంతిక వ్యతిరేకత నుంచి కాకుండా, స్వీయవైఫల్యాల కోణం నుంచి జరుగుతుంది. ఇప్పుడైనా మేలుకొని, తమ వైఫల్యాలను సరిదిద్దుకుని, తాము నమ్మిన ఈ వ్యవస్థ చేత ఏమైనా పని చేయించగలమా అన్న ప్రశ్నను ముందుకు తెస్తున్న ఇక సవాలుగానే నక్సలిజాన్ని రచయిత దర్శిస్తారు. అందులో భాగంగానే భూసంస్కరణలవైపు ఆయన మొగ్గుతారు.

ప్రత్యామ్నాయాన్ని స్పష్టంగా సూచించడం మినహా సమకాలీన రాజకీయ వ్యవస్థావైఫల్యాన్ని, అందులోని దారుణ ప్రజావంచనను నిలువెత్తున నిరూపించిన రచన 'లోపలి మనిషి'. ఈ వ్యవస్థలోనే ఉన్నతోన్నత పదవులను అందుకున్న ఒక వ్యక్తి ప్రత్యక్షానుభవంతో ఆ మహావైఫల్యాన్ని ఒక బృహద్రచన రూపంలో ఉద్ఘోషించడం మరింతగా భయభ్రాంతం చేస్తున్న వాస్తవం. పి.వి. నరసింహారావు అనే ఒక వ్యక్తిలోని గుణదోషాలను మించి, ఒక ప్రక్రియగా 'లోపలి మనిషి' ఎలాంటిదన్న ప్రశ్నను మించి పట్టించుకోవలసిన అంశం ఇదే. ఒక మహావైఫల్యానికి అక్షరరూపం దిద్దిన 'లోపలి మనిషి' ఇంకా కొనసాగుతున్న కథ.

# శతక పరిమళాలు



ఎన్.సీ.హెచ్. చక్రవర్తి, హైదరాబాద్
✆ 93999 58069

తెలుగు సాహిత్యంలో పద్యం పట్టంకట్టుకుని దాదాపు వేయి ఏండ్లు రాజ్యం చేసింది. ఆంగ్లేయుల పాలనా ప్రభావాన అనేకానేక సాహిత్యప్రక్రియలు తెలుగు సాహిత్య వినీలాకాశాన్ని అతి విస్తృతం చేశాయి . పరిశోధనలకు అందనంతవరకు నన్నయ భారతంతో పద్యం ప్రారంభం అయింది తెలుగులో. నన్నయ సూక్తి నిధి. ఆయన సూక్తి నిధి లోని ఒక భారత పద్యాన్ని పరిశీలిద్దాం.

దుష్యంతుని నిండుసభలో శకుంతల దోషిగా నిలిచింది. శకుంతలకు పుట్టిన బిడ్డ తన బిడ్డ కాదంటాడు దుష్యంత మహారాజు. సభాసదులు అందరూ ఈ ఘట్టాన్ని విస్తుపోయి చూస్తున్నారు. అప్పుడు శకుంతల దుష్యంత మహారాజుకు నిండుసభలో హితబోధ చేస్తుంది. ఆ సందర్భంలోని పద్యం ఇది.

**చంపకమాల(1)**

నుతజల పూరితంబులగు నూతులు నూరిటికంటె సూ
నృత వ్రత! యొకబావిమేలు, మరి బావులు నూరిటికంటె నొక్క సత్
క్రతువదిమేలు, తత్క్రతు శతంబునకంటె సుతుండుమేలు, తత్
సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడగన్.

శకుంతల ధీరత్వానికి ఇది నిదర్శనం. మహర్షి ఇంట కట్టుబాట్లతో పెరిగిన మేనక కూతురు చెప్పిన హితం ఇది.

ఇందులో సత్యభాషణ ప్రాశస్త్యం ఎంతో హృద్యంగా శకుంతల పాత్ర ద్వారా చెప్పించాడు నన్నయ కవి.

నుయ్యి జనుల దాహార్తి తీర్చడానికి. పూర్వం రాజులు ప్రత్యేకం త్రవ్వించేవారు. ధనికులు తమ ధర్మకార్యాల్లో భాగంగా త్రవ్వించేవారు. అటువంటి నూరు నూతులకంటే ఒక బావి(మరింత విస్తృత ప్రయోజనం సాధించేది) మేలు. వంద బావుల కంటే ఒక గొప్ప క్రతువు మేలు. వంద క్రతువుల కంటే ఒక కొడుకు మేలు.

పూర్వం కొడుకుపుడితే పున్నామం అనే నరక విముక్తి కలుగుతుందని నమ్మేవారు. కొడుకులు వందమంది కంటే ఒకసత్యం గొప్పది అంటుంది శకుంతల. (నూర్గురు కొడుకులు- దుర్యోధనాదుల పరోక్ష ప్రస్తావన ఇక్కడ) సత్యవాక్కు మహిమ ఇంత అద్భుతంగా చెప్పిన సుకవులు అరిది. సందర్భవశాత్తు సమాజహితాన్నీ, విశ్వజనీన విషయాలనూ కవులు బోధించేవారు. ఇది ప్రాచీన సాహిత్యానికి సంబంధించి.

ఆధునిక కవులలో కవి కోకిల గుఱ్ఱం జాషువా గారు. ఆయన వివిధ ప్రక్రియలు వ్రాసినా, పద్యానికే పట్టంకట్టారు. ఆయన పద్యారత్నాన్ని చూద్దాం.

**తేటగీతి (2)**

రాజు తలమీద గవి గప్పురంబు చల్లె
సుకవి తలమీద రాజు నిప్పుకలు విసరె
గొందరేపుణ్యమో చేసుకొనియె ననిరి
కొందరేపాపమో పట్టి కుడిపెననిరి.

పిరదౌసి పారశీక కవి. రాజు ఇస్తానన్న బహుమతి నాశించి కావ్యం రచించి ఇచ్చాడు. కానీ రాజు మోసం చేసాడు. ఇస్తానన్న బహుమతి ఇవ్వలేదు. అప్పుడు కవి చెప్తాడు ఈ విషయం.

కవి కావ్యం ద్వారా రాజు తలపై కర్పూరం చల్లాడు. అంటే అతడి కీర్తి సుగంధాలను విస్తరింపచేసాడు అని. రాజు పిరదౌసి తలకు చిచ్చుపెట్టాడు. (ఆ ఆవేదనతో కవి మరణిస్తాడు అని సూచన) కర్పూరం చల్లగా ఉంటుంది. నిప్పుకలు వేడి. పరస్పర భిన్న స్వభావాలు. దీన్ని చూచి జనులు కొందరు పాప-పుణ్యాల లెక్కలు వేసుకున్నారు. లోకులు భిన్నరీతుల్లో అనుకోడం సహజం కదా!! పిరదౌసి అన్యాయాలపాలైనా కొందరు అతడికి సానుభూతి చూపని వారూ ఉంటారు. ఇదీ జనుల తీరు. అన్యాయాన్ని పరోక్షంగా సమర్థించేవారూ ఉంటారు. చిన్న పద్యంలో ఎన్ని అయినా చెప్పుకోవచ్చు.

ఇలాగ తెలుగు పద్యం ఎన్నెన్నో మానవ జీవిత కోణాలను ఆవిష్కరించింది.

ప్రపంచంలో పాపం, హింస ఎక్కువ. సాధు సజ్జనత్వం తక్కువ. అయినా చిత్రంగా ప్రకృతి ఈ రెండిటినీ సమతుల్యం చేసుకుంటూ సాగుతూ ఉంటుంది. హింసను నిగ్రహించకపోతే జీవులు నిలిచేదెట్లా? పాపులు నశించకుండా ప్రబలిపోతే విశ్వప్రగతి ఎట్లా? ఈ ఆలోచనలు సాగగానే భాస్కర శతక కవి ఒక చక్కని కల్పన చేశాడు (1).

చం. వలనుగఁ గానలందుఁ బ్రతివర్షమునన్ బులి నాలుగైదు
పిల్లలగను, దూడనొక్కటి నిలంగను ధేనువు రెండుమూడు

నేడులకటులైన బెబ్బులి కుటుంబము లల్పములాయె నాలమం

దలు గడువృద్ధి జెందనె యధర్మము ధర్మముఁ దెల్ప భాస్కరా!

అడవులలో ప్రతి ఏటా నాలుగైదు పిల్లలను పెడుతుంది. రెండు, మూడేండ్లకు ఒక దూడను కంటుంది ఆవు ఊళ్ళలో. కానీ ఎవరి సంఖ్య ఎక్కువగా నిలుస్తున్నది? పులి పిల్లలు అన్నీ బ్రతికి బట్టకడితే మనం నేలపై ఉండగలమా? అవి ఊళ్ళలోకి వచ్చిపడవా? ఆవులు బ్రతుకుతాయా? కనుక ప్రకృతి సమతుల్యం (balancing) చేసుకుంది. గోవుల సంఖ్య పెరుగుతున్నది. పులులు తగ్గుపోతూనే ఉంది. ఇప్పటికీ అడపాదడపా ఎక్కడో ఒకచోట ఒక్క పులి గ్రామాల్లోకి వచ్చిపడితే అల్లకల్లోలం అయిపోతుంది. అటువంటి సమతుల్య యంత్రాంగం (mechanism) లేకుంటే మన మనుగడ ఏమయ్యేది? ధర్మమూ - అధర్మమూ ఇలాగే ఉంటాయి అని చెప్తాడు మారద వెంకయ్య.

ఆధునిక శతకంలో (2) ఎర్రాప్రెగడ రామమూర్తి గారి ఒక పద్యం చూద్దాం. మానవులకు పర్యావరణ స్పృహ కలిగించే పద్యం.

కం. అలరులు, కాయలు, దుంపలు,

ఫలములు, మందులు, గృహములు వస్త్రము, లెన్నో

వలసినవొసగెడు వృక్షం

బులపై మనుషులకు కక్ష పుట్టెను సంఘీ!

సంఘీ శతకంలోని పద్యం వివరణ ప్రత్యేకంగా అవసరం లేని తేట తెలుగు పద్యం. పూలూ, కాయలూ, దుంపలూ, పండ్లూ, ఔషధాలూ, ఇళ్ళ సామాగ్రీ వలువలూ... ఇలా సమస్తం సమకూర్చే చెట్లపై మానవులు కక్ష పూనాడు అని ఆవేదనతో చెప్తారు కవి. నిజంగానే మానవ ప్రవృత్తి విచిత్రం. పెట్టే చెయ్యినే కొడతారు. చేసే అమ్మనే త్రోసేస్తారు. పెంచే తండ్రినే తిరస్కరిస్తారు. అలాగే ప్రోచే చెట్టునే నరికేస్తారు. కరడుగట్టిన స్వార్థానికి ప్రతీక మనిషి అనిపిస్తాడు. ఇలా ఎందరు ఎన్ని కావ్యాలూ, కైతలూ వ్రాసినా మానవునిలో జ్ఞాననేత్రం తెరిపిడి పడాలి కదా! ఇలాగ శతక సాహిత్యంలో ఎన్నెన్నో మెరపులు. వాటిని చదివి చైతన్యవంతులం అవుదాం!.

1. భాస్కర శతకం : కవి : మారద వెంకయ్య. ప్రచురణ శ్రీ అరుణా బుక్ హౌస్. మదరాసు - 1

2. సంఘీశతకం : కవి : ఎర్రాప్రెగడ రామమూర్తి, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ బ్రాంచీలు.

# తలిశెట్టి రామారావు నాయుడు



**సుంకర చలపతిరావు**
✆ 91546 88223

పురాణాత్మ రాముడు ఎలాగైతే మర్యాద పురుషోత్తముడుగా పేరు గడించారో, అదేవిధంగా మన తెలుగు చిత్రకళారంగంలో నల్గురు రామారావులు తమ సృజనతో జాతీయ కీర్తి పొందారు. ఇందులో మొదటివారు నెల్లూరుకు చెందిన శ్రీరాములు నాయుడు (1869-1926). నాటకరంగానికి తెరలు, డిజైన్స్ వేయడంలో ప్రతిభావంతులు. ప్రఖ్యాత చిత్రకారులు దామెర్ల రామారావు, అడివి బాపిరాజు తదితరులకు స్ఫూర్తిదాత. బెంగుళూరు, మద్రాసు, రాజమండ్రి, బొంబాయిలలో పనిచేసి లాహోర్‌లో కన్నుమూసిన తొలి తెలుగు చిత్రకారులు.

ఇంక రెండోవారు దామెర్ల రామారావు (1897-1925). తెలుగు చిత్రకళకు జాతీయ స్థాయి గుర్తింపు తెచ్చిన తెలుగు వెలుగు. రాజమండ్రి సమీపంలో కొవ్వూరులో గల రామారావు చిత్రమందిరంలో నేటికి ఆయన చిత్రాలు మనం చూడవచ్చు. ఆంధ్ర సంస్కృతిని నిలువుటద్దంలో చూపించి, అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డుల్ని అందుకొన్నారు.

చిత్రలేఖనంలో మరో అంతర్జాతీయ కీర్తి పొందిన చిత్రకారుడు శీరందాసు వెంకట రామారావు. 1936లో మచిలీపట్నంలో పుట్టి, మద్రాసులో చిత్రకళను అభ్యసించి, అమెరికాకు చెందిన కెంటకీ విశ్వవిద్యాలయంలో చిత్రకళాపన్యాసకులుగా పనిచేసి, భారత ప్రభుత్వం నుండి 2001లో 'పద్మశ్రీ' పొంది ప్రస్తుతం అమెరికాలో శేష జీవితం గడుపుతున్నారు.

తొలి తెలుగు కార్టూనిస్టుగా గుర్తింపు పొందిన తలిశెట్టి రామారావు నాయుడు (1896-1960) నేటి ఒరిస్సాలో గల జయపురంలో పుట్టారు. ఆయన ఒక కార్టూనిస్టుగానే తెలుగువారికి తెలుసు. కానీ ఆయన తొలి తెలుగు చిత్రకళా రచయిత, విమర్శకుడు. అంతేకాదు అంతకుమించి గొప్ప చిత్రకారుడు కూడా. తలిశెట్టి కుటుంబం ఒరిస్సాలో స్థిరపడటం వల్ల ఆయన్ని గురించి పూర్తి వివరాలు వెలుగు చూడలేదు. పై నలుగురు చిత్రకారులు ఇరవయ్యో శతాబ్దంలో

పుట్టి తమ రంగాల్లో తామే సాటి అని నిరూపించుకొన్నారు.చిత్రకళకు సంబంధించి అనేక విభాగాల్లో ప్రతిభను నిరూపించుకొన్న తలిశెట్టి రామారావు నాయుడును చరిత్ర కేవలం వ్యంగ్య చిత్ర కళారంగానికే పరిమితం చేయడం అన్యాయం. ఆయన కార్టూనిస్టు అయినప్పటికీ అనేక చిత్రాలు అద్భుతంగా, సాంప్రదాయక విధానాల్లో సహజ సుందరంగా చిత్రించారు. అంతేకాదు తలిశెట్టి మంచి రచయిత కూడా. చిత్రకళకు సంబంధించి, కార్టూన్లకు సంబంధించి అనేక వ్యాసాలు నాటి పత్రికల్లో రాశారు.



భరతాగమనము
చిత్రకారుడు - తలిశెట్టి రామారావు

నేటి ఒరిస్సా రాష్ట్రంలోనున్న జయపురంలో రామానుజమ్మ, సీతయ్య దంపతులకు 20 మే 1896లో జన్మించిన రామారావు తన 13వ యేట తండ్రి మరణంతో అనేక ఆర్థిక ఇబ్బందుల్ని ఎదుర్కొన్నారు. కుటుంబాన్ని నడపటానికి తల్లి దర్జీపని చేసేది. ఆ సమయంలో వివిధ రీతుల్లో బొమ్మలువేసి, ఆయా రీతుల్లో దుస్తులు తయారుచేసి తల్లికి రామారావు సహకరించేవారు.

1911సం॥లో గిడుగు సీతాపతి జయపురం హైస్కూల్లో ప్రధానోపాధ్యాయుడుగా వుండగా రామారావు విద్యార్థిగా ఉండేవారు. రామారావు వేసిన చిత్రాలు చూసిన సీతాపతి, ఆయన ప్రతిభ గుర్తించి ప్రోత్సహించారు. చిత్రకళపై పూర్తి అవగాహన కోసం 'ఆగ్స్ బర్గ్' అనే ఆంగ్లపుస్తకాన్ని సీతాపతి, రామారావుకు బహుకరించారు. ఆ గ్రంథం చూసి కార్టూన్లు వేయడం ప్రారంభించాక రామారావు వేసిన మొదటి కార్టూన్ సీతాపతిదే.

జయపురంలో పాఠశాల విద్య, పర్లాకిమిడిలో ఇంటర్, విజయనగరం మహారాజ కళాశాలలో బి.ఎ. చదివారు. తర్వాత ఆర్థిక కారణాలతో ఆగిన చదువును జయపురం మహారాజా విక్రమదేవవర్మ ఆర్థిక సహాయంతో బి.ఎల్. మద్రాసులో చదివారు. ఇదే సమయంలో ఆంధ్రపత్రిక, భారతి సంపాదకులు దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారితో పరిచయం కల్గింది.

రామారావు కార్టూన్లు గీస్తున్నారని తెలిసి, తమ పత్రికలకు పంపమని కోరి రామారావును ప్రోత్సహించారు.

1930వ దశకంలో ముఖ్యంగా ఉగాది ప్రత్యేక సంచికల్లో రామారావు విరివిగా కార్టూన్లు వేసినట్టు ఆయా పత్రికల ద్వారా తెలుస్తున్నది. ముందు ఆయన మాటల్లేని కార్టూన్లు గీచేవారు. గిడుగు సలహాతో కార్టూన్లకు మాటలు జోడించారు. స్వాతంత్రోద్యమం రాకముందు తలిశెట్టి గురించి అందరికీ తెలుసు. ఆయన కార్టూన్ల వల్ల పాఠకులు అనేక సామాజిక సంగతులు తెలుసుకునేవారు. ఆయన కార్టూన్లలో ఎంతో వైవిధ్యం ఉండేది. చూడగానే హాస్యం ఉట్టిపడేలా చిత్రవిచిత్రంగా వాటిని గీచేవారు.

పార్వతీపురంలో న్యాయవాద వృత్తిని చేపట్టినప్పటికీ తలిశెట్టి ధ్యాసంతా కార్టూన్ల మీద ఉండేది. విశ్వాత్ముల నరసింహమూర్తి, ఆర్.ఎస్.నాయుడు, వపా తదితరులు ఆయనచేత ప్రభావితమైనవారే.

తలిశెట్టి చిత్రకారుడనే విషయం అతి తక్కువమందికే తెలుసు. ఆయన అనేక నీటిరంగుల చిత్రాలు గీసారు. పరిచర్య, భరతాగమనం, గౌతమబుద్ధుడు, విరహిణి, అర్చన తదితర చిత్రాలనీ నాటి 'భారతి' ఉగాది ప్రత్యేక సంచికల్లో ప్రచురితమై, తలిశెట్టిలోని మరో గొప్ప సృజన కోణం వెలుగు చూసింది. చిత్రాల్లో ఎక్కువగా రామాయణానికి సంబంధించిన సంఘటనలు చిత్రించారు. ఆయన చిత్రాలు ఎలాంటి హంగూ ఆర్భాటం లేకుండా సరళంగా, సూటిగా భావాన్ని వెల్లడిస్తాయి. ఆయన చిత్రించిన మేఘాంజలి సాంప్రదాయానికి నిలువుటద్దంగా ఉంటుంది. ఆకాశంలో మేఘాలు, నీలి ఆకాశం, పక్షులు, ఇంద్రధనుస్సు, మేఘాలకు పుష్పాంజలి ఘటిస్తున్న వ్యక్తి, అతని చుట్టు పూల మొక్కలు, చిత్రం భావంలోనూ, చిత్రీకరణలోనూ తలిశెట్టి కొత్తదనం చూపించారు. చిత్రం చూస్తే ఓ రంగుల ఛాయా చిత్రం గోచరిస్తుంది. తలిశెట్టి చిత్రాలు అజంతా శైలిని మనకు గుర్తుచేస్తాయి.

'భారతీయ చిత్రకళ' గ్రంథానికి వేసిన రేఖాచిత్రాలు అత్యంత సుందరంగా వున్నాయి. అజంతా గుహలకు సంబంధించినవి, బాఘ్ - సింహాసనం మొగలు శైలులకు చెందిన చిత్రాలు జీవకళ ఉట్టిపడే విధంగా చిత్రించారు. తలిశెట్టి ఈ చిత్రకళా గ్రంథాన్ని అప్పట్లో బాగా ప్రచారంలో వున్న పెర్సీబ్రౌన్, విన్సెట్ స్మిత్ ల కళాచరిత్రకు సంక్షిప్త అనువాదం. ఆంధ్రపత్రిక సంపాదకులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు పీఠికరాసి 1930లో మద్రాసుకు చెందిన ఆంధ్ర గ్రంథమాల

ద్వారా ప్రచురించారు దీన్ని. చిత్రకళ నేర్చుకునేవారికి, తలిశెట్టి 'చిత్రలేఖనం' అనే గ్రంథాన్ని తయారుచేయగా, 1954లో దాన్ని వావిళ్ళవారు ప్రచురించారు. ఇది కూడా హెన్రీ వారెస్, మిసెస్ మెర్రీఫీల్డ్, ఫిలిమ్ డెలమాట్ తదితరుల గ్రంథాలు ఆధారంగా రూపొందించారు.



ప్రముఖ రచయిత పురిపండా అప్పలస్వామి విశాఖ కవితా సమితి వార్షిక సభ 1914లో నిర్వహించినప్పుడు తలిశెట్టి హాజరయ్యారు. ఈ సందర్భంలోనే వాణి, ఆనందవాణి సంపాదకులు ముద్దా విశ్వనాథం కలిసి తలిశెట్టి అమూల్య సలహాలు ఇవ్వడంతో పాటు, కార్టూన్లు, కార్టూన్ల గురించి అనేక వ్యాసాలు రాసిపించారు.

విక్రమదేవవర్మకు తలిశెట్టి అంటే ప్రత్యేక అభిమానం. ఆ కారణంతోనే తలిశెట్టిని సహాయ దివాన్‌గా నియమించారు. పెద్ద తలకాయ, ఛామనఛాయ, పొట్టిరూపం, మితభాషి, నిరాడంబరులు, నిష్కల్మషి, ఉదారహృదయం కల్గిన తలిశెట్టి తన వ్యంగ్యచిత్రాలు, వ్యాసాలు అన్నీ ఒకే గ్రంథంగా వేయాలన్న కోరిక నెరవేరకుండానే 1960లో కన్నుమూశారు. 2011, 2012లలో ఆయన కార్టూన్ సంకలనాలు, 2014లో భారతీయ చిత్రకళా గ్రంథాలు ప్రచురణ అయ్యాయి. ఆయన భార్య జయలక్ష్మి, కుమారుడు డా. జయదేవ్, కుమార్తెలు రామకుమారి, రాఘవకుమారి, సీతాకుమారి. ఆయన పుట్టిన మే 20వ తేదీని తెలుగు కార్టూనిస్టుల దినోత్సవంగా ప్రకటించాలని ఎప్పటినుండో కోరుతున్నారు. తలిశెట్టి కుటుంబం ప్రస్తుతం ఒరిస్సాలో స్థిరపడింది.

## సంప్రదించిన గ్రంథాలు, పత్రికలు:


1. భారతీయ చిత్రకళ - తలిశెట్టి రామారావు నాయుడు
2. తలిశెట్టి రామారావు నాయుడు - తొలి తెలుగు వ్యంగ్యచిత్రాలు
3. శ్రీ తలిశెట్టి రామారావు నాయుడు వ్యంగ్య చిత్రకళ - ఆంధ్రపత్రిక 23-3-66
4. మనత.రా. తరలిపోయివాడు. ఆనందవాణి 1947 ఏప్రిల్
5. హెచ్. రమేష్ బాబు - ఆహ్వానం, డిశెంబరు 1994

# సాహిత్య కాలుష్యం సమాజానికి చేటు



**కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి**
✆ 99487 74243

అభ్యుదయాన్ని ఆరవోస్తూ, మానవీయత మనుగడిస్తూ, వర్తమాన పరిస్థితులను పరిశీలనాత్మకంగా అధ్యయనిస్తూ, వైయుక్తికానుభవాలతో అన్వయించుకొంటూ, సైద్ధాంతిక మూలాలతో సమన్వయించుకుంటూ, ఆధునిక సాహిత్యం వెలువడుతుందా? ఎన్నో రకాలుగా సాహిత్య కాలుష్యం వెలుగు చూస్తుందా? అనే అంశాల్ని సాహితీవేత్తలు, విమర్శకులు చర్చించి ఓసారి సింహావలోకనం చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. సమాజం సజావుగా సాగాలంటే పర్యావరణ కాలుష్యాన్ని అరికట్టినట్లుగా, సాహిత్య కాలుష్యాన్ని అరికట్టాల్సి ఉంది. సమాజానికి పర్యావరణ కాలుష్యం ఎంత ప్రమాదమో, అంతకంటే సాహిత్య కాలుష్యం ప్రమాదమనే సత్యాన్ని సాహితీవేత్తలు విస్మరించరాదు. నేడు మన సాహిత్యంలో అక్కడక్కడ నిబద్ధతకు నీళ్ళొదలడం, వాస్తవికతను అనుభవంలోకి తీసుకోకపోవడం, కాల్పనికతా కలల్లో కథలు, కవితలు యిబ్బడి ముబ్బడిగా ఎవరికి తోచిన విధంగా వాళ్ళు రాస్తున్నారు. సమాజంలో దోపిడీ, దౌర్జన్యం, అణచివేతలు, అక్రమార్జనలు, పాలకుల స్వార్థపూరిత ప్రలోభాలు, దుష్టచింతనలు... ఇలా ఎన్నెన్నో ఉపద్రవాలు సామాన్యుల తలల మీద తాండవిస్తున్నాయి. అయినా సాహిత్య తిరోగమన తీర్థాన్ని పుచ్చుకొంటూ, అనిబద్ధతధోరణిలో అహేతుకంగా భౌతికవాదము, నిర్హేతుకమైన, అశాస్త్రీయ, మూఢాచార, ఊహాజనిత ఉద్రేకంతో, ఆధ్యాత్మివాదము, కాలక్షేపానికి కలాలు కదుపుతూ, అప్రతీకాత్మకమైన అనుభూతులను ఆరవోస్తూ బతకడం, హేయమైన చర్యగా భావించాల్సి వుంది.

కవులు, రచయితలు, విమర్శకులు సర్వస్వతంత్రులు, మీదు మిక్కిలి నిరంకుశులుగా చెప్పుకుంటారు. అట్లాగని వాళ్లకు తోచింది వాళ్ళు రాస్తుంటారు. పాఠకులు యిష్టమై చదివితే చదవచ్చు లేదా ప్రక్కన పారేయవచ్చు అనే ఉదారవాదులు కూడా లేకపోలేదు. ఇటువంటి బాధ్యతారహితమైన ఉదారవాదం

సమాజాన్ని తప్పుడు మార్గం పట్టించే సాహిత్యానికి ఊపిరిలూదుతుంటుంది. సాహిత్య కాలుష్యానికి కనకాభిషేకం చేస్తుంటుంది. వర్తమాన సంక్షోభ సమాజపుటంతరంగాన్ని, జాతి జీర్ణించుకోలేని అంతర్గత కుళ్ళును పట్టుకోవాలంటే సాహితీవేత్తలు తప్పనిసరిగా, ప్రాపంచిక దృక్పథంతో విస్తృతమైన అధ్యయనం చేయాలి అనేది నిర్వివాదాంశంగా భావించాల్సివుంది. సాహిత్య కాలుష్యానికి, భావ దారిద్ర్యానికి, స్వార్ధపూరితమైన రాజకీయ పక్షాలకు కొమ్ముగాస్తున్న ప్రింటు మీడియా, ఎలక్ట్రానిక్ మీడియా నైతికంగా దిగజారడం కూడా ఒక విధంగా కారణమౌతున్నాయి.

> ఆధునిక సాహిత్యానికి ఆధునిక విజ్ఞానశాస్త్రం, సామాజిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక నైతిక శాస్త్రాలు, కలం బలం పెంచే నేపథ్యాలుగా చెప్పుకోవచ్చును.

సాహిత్యానికి దార్శనికత దృక్పథం నేత్రం లాంటిది. ఆధునిక సాహిత్యానికి ఆధునిక విజ్ఞానశాస్త్రం, సామాజిక, ఆర్థిక, రాజకీయ, తాత్విక నైతిక శాస్త్రాలు, కలం బలం పెంచే నేపథ్యాలుగా చెప్పుకోవచ్చును. వీటిని సామాజిక సంస్కరణావాదులు సమాజాన్ని సంస్కరించడానికి సాహిత్యాన్ని ఓ సాధనంగా వాడుకున్నారు. మనిషిలోని అంతర్గత చైతన్యాన్ని విశ్లేషించాలంటే సాహితీవేత్తకు మానసిక శాస్త్ర పరిజ్ఞానం అవసరం. సామాజిక దోపిడీని ప్రతిఘటించే శక్తిని సాహిత్యంలో నింపాలంటే మార్క్సిస్టు దృక్పథం అవగాహనించుకోవాల్సిన ఆవశ్యకత ఎంతో అవసరం. వివేకవంతమైన సామాజిక తాత్వికతతో కూడిన సమాజాన్ని పునర్నిర్మించాలంటే సాహితీవేత్తకు సాహిత్యంతోపాటు, సామాజిక తత్త్వశాస్త్ర జ్ఞానాన్ని సముపార్జించాల్సి వుంటుంది. సాహిత్యాన్ని ఏ ప్రక్రియలో రాసినా, సామాజిక రుగ్మతలను ఎత్తిచూపుతూ సాహిత్యానికున్న కళాగౌరవాన్ని మన్నిస్తూ రాయాలి. అయితే ఈవేళ సాహితీవేత్తలు, వివిధ వాదాల దృక్పథాల కోలాహలం మధ్య చిక్కి, సాహిత్యపు మౌళిక విలువలను కాలరాస్తూ, స్వార్ధపూరిత వర్గ ప్రయోజనాల్ని ఆశిస్తూ, మాని, మాసిపోయిన సామాజిక గాయాల్నిరేపుతూ, సాహిత్య కాలుష్యాన్ని సృష్టిస్తున్నారు. సాహిత్యంలో

పెచ్చరిల్లుతున్నకాలుష్యం, సాహిత్యానుభూతిని మింగేసి, పాఠకుల ఆలోచనలను వక్రీకరణ మార్గంలో నడిచేందుకు దోహదపడుతుంది. అనేక రకాలైన సామాజిక వివాదాలకు కుల, మత విద్వేషాలకు, వీధి పోరాటాలకు దారి తీయడం శోచనీయం. సాహిత్యకాలుష్యం వలన ఆయా వ్యవస్థల మూలస్వభావం పూర్తిగా మారిపోతూ వుంటుంది. దారితెన్నులు లేని స్వార్థపూరితమైన, ఆర్థిక లాభాపేక్షను వాంఛించే వికార స్వభావాలు సంకర భావాలుగా తలెత్తుతున్నాయి. దారితప్పిన ఆధ్యాత్మిక, భౌతిక వాదులుగా సాహిత్యాన్ని సృష్టిస్తున్న ఆధునిక, సామాజిక సంస్కరణావాదులంతా సాహిత్యాన్ని ఆయుధంగా వాడుకుంటున్నారు. వారు నమ్మిన సిద్ధాంతాల వెంట జనం నడిచే విధంగా, సత్యదూరమైన అభూతకల్పనకు తావిస్తూ విద్వేషంతో పరనిందకు ఊతమిస్తూ సాహిత్యాన్ని ఓ ఆకర్షణాయుధంగా మలచుకుంటున్నారు. పాలకుల డొల్లతనాన్ని, కుళ్ళు కుచ్ఛితాలను కప్పి పుచ్చేందుకు స్వార్థపు ముసుగులో సాహితివేత్తలు, సంకుచిత భావాలను సాహిత్యంలో దట్టిస్తున్నారు. మానసిక కాలుష్యాన్ని పెంచే మూఢ విశ్వాసాలకు తావిచ్చే మహత్త్యాలను ఉద్గ్రంథాలుగా వెలువరిస్తున్నారు. మానవాతీత శక్తుల్ని కథలు, కథలుగా అల్లి మనుషుల్ని మరబొమ్మలుగా మారుస్తూ సొంతం ఆలోచనా జ్ఞానాన్ని చంపే సోమరితనాన్ని ప్రోత్సహిస్తున్నారు. నిబద్ధతలేని, అబద్ధాలనే స్తోత్రాలుగా వల్లెవేయిస్తూ, దైవం స్థానంలో ఆధ్యాత్మిక గురువులు పీఠాలు ఎక్కి జనాన్ని నమ్మకం, విశ్వాసం సంకెళ్లు మాటున బంధీలు చేస్తున్నారు. పైన కనిపించే వేషధారణకు లోలోన చిత్తవృత్తికి పొంతనలేకుండా జీవిస్తూ పుంఖానుపుంఖాలుగా సృష్టించే సాహిత్య కాలుష్యం సమాజాన్ని నీతి నియమాల నుండి యేమారుస్తుంది.

> సాహిత్యం ఏ ప్రక్రియలో ఉన్నా, సమాజంతోను, వ్యక్తితోను, ఆధునిక భావ ప్రపంచంతోను, ఎంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండాల్సిన అవసరం ఉంది.

స్వార్థపూరిత రాజకీయ ముసుగులో, సాహిత్యాన్ని ఊతంగా చేసుకొని, అధికారాన్ని హస్తగతం చేసుకోవాలనే ఆకాంక్షతో అరిగిపోయిన, ఆరిపోయిన సిద్ధాంతాలను మళ్ళీ మళ్ళీ తిరగదోడుతూ, వర్తమాన

కాలమార్పుల్ని ఒడిసి పట్టుకోలేని అసమర్థులుగా మిగిలిపోతున్న సాహితివేత్తలు కొందరు. వీరికి కదిలే కాలంతో కలిసి నడుస్తూ, సరికొత్త భావాలతో యువశక్తిని ఆకర్షించి కదిలించే శక్తివంతమైన సాహిత్యాన్ని సృష్టించే శక్తిని, సముపార్జించాలనే అధ్యయనం గాని, జ్ఞానం గాని వుండదు. కాలం చెల్లిన ముక్కిడి సిద్ధాంతాలను పట్టుకువేలాడుతూ, ప్రాపంచిక ధృక్పథాన్ని గమనించకుండా సాహిత్యాన్ని సృష్టిస్తుంటారు. అప్రజాస్వామిక ధోరణులతో జనాన్ని రెచ్చగొడుతుంటారు. ఈవిధమైన సాహిత్య కాలుష్యం ఎంతోమంది యువకుల్ని బలి తీసుకుంటుంది. మత్తుమందుకంటే ఈ సాహిత్యం మిక్కిలి ప్రమాదకారిగా మారుతుంది.

సాహిత్యం ఏ ప్రక్రియలో ఉన్నా, సమాజంతోను, వ్యక్తితోను, ఆధునిక భావ ప్రపంచంతోను, ఎంతో సన్నిహిత సంబంధం కలిగి ఉండాల్సిన అవసరం ఉంది. నిర్జన సాహిత్యాన్ని సమాజానికి సంక్రమించిన అమూల్య నిధిగా భావిస్తూ, సారాంశం మారని తటస్థవాదాన్ని సామాజిక పురోగమన సిద్ధాంతంగా నమ్మిస్తూ, ప్రగతి నిరోధక సాహిత్యాన్ని ప్రోత్సహిస్తుంటారు. అభ్యుదయ భావాలతో అన్యాయాలను, అక్రమాలను నిలదీసే సాహిత్యాన్ని అతివాద ధోరణులుగా కొట్టిపారేస్తున్న పాలకవర్గాల్ని చూస్తున్నాం. సైకో కవిత్వం సాహిత్యంలో 'వివిక్తత'ను ప్రోత్సహిస్తూ రాసిన రచయితకు తప్ప పాఠకునికి ఏమాత్రం అనుభూతి కలిగించకపోగా, ఉపచేతనలోంచి అస్తవ్యస్త భావాల్ని వ్యక్తం చేయడానికి తోడ్పడడం సాహిత్య కాలుష్యమే అవుతుంది. ఈ కవిత్వంలో విఫల వాంఛలు విపరీత వికృత వ్యక్తీకరణలు కనిపిస్తాయి. సాహిత్యం వలన కలిగే కాలుష్యం మనిషిలో ఆత్మన్యూనతా భావాన్ని పెంచుతుంది.

జాతీయంగా, అంతర్జాతీయంగా దేశంలో ఎటువంటి యుద్ధాలు లేకపోయినా, ప్రాంతీయ, వర్గ, కుల, మత, వివక్షతను రెచ్చగొట్టే విద్రోహపూరితమైన సాహిత్యకాలుష్యం సమాజాన్ని ప్రశాంతంగా బతకనీయదు. మానసిక కల్లోలాల్ని పురిగొల్పే విషాన్ని సమాజంలో ఈ సాహిత్యం పుక్కిలించి జనం మీద ఉమ్ముతుంటుంది. అస్తిత్వవాదాల ముసుగులో వ్యక్తిగత క్రోధాలు తలెత్తే స్వార్థపూరితమైన ఆర్థిక లాభాపేక్షకు సాహిత్య కాలుష్యం తోడ్పడుతుంది. కనుక సాహితీవేత్తలు వారి బాధ్యతలను గుర్తెరిగి, అంతశ్చక్షువులను విప్పార్చి, ప్రజా జీవితాన్ని ప్రభావితం చేసే కాలుష్య రహిత సాహిత్యాన్ని సృష్టించడానికి నడుం కట్టాలి.

# అధిక్షేప హాస్యం



డా॥ దామెర వేంకట సూర్యారావు
✆ 98851 88431

నవ్వవు జంతువుల్ నరుడు నవ్వును నవ్వులు చిత్తవృత్తికిన్ దివ్వెలు - కొన్ని నవ్వు లెటుతేలవు కొన్ని విష ప్రయుక్తముల్ పువ్వులు వోలె ప్రేమరసముల్ వెలిగ్రక్కు విశుద్ధమైనవే నవ్వులు - సర్వము దుఃఖదమనంబు వ్యాధులకు మహౌషధుల్

- జాషువా 'నువ్వు నవ్వితే ఈ లోకం నీతో పాటు నవ్వుతుంది. నువ్వేడుస్తుంటే మాత్రం నువ్వొక్కడివే ఏడుస్తావు' అంటాడు బీర్బల్. నవ్వు శారీరక ప్రక్రియ. మనలోని ప్రవృత్తిని వ్యక్తం చేసే సాధనం. 'అతడు నవ్వడు' అంటే ఏదో లోపం ఉందన్నమాటే. 'మనం ఏడవలేక నవ్వుతూ ఏడుపు నుండి కొంత విశ్రాంతి కావలసివచ్చి నవ్వుతాం. ఏడుపును మరిపించి సుఖ పెట్టే ఏర్పాటుతో వచ్చిన దైవిక వరం నవ్వు' అంటాడు విలియం మేకగల్. నవ్వును గురించి రకరకాల నిర్వచనాలు, భావనలు ఉన్నాయి.

హాసమనే స్థాయీ భావమే హాస్యరసంగా పరిణమిస్తుంది. హాస్య ప్రయోగంలో అనేక భేదాలున్నాయి. వికృతాకార వాగ్వేషచేష్టల వల్ల హాస్యం జనిస్తుందని సాహిత్య దర్పణ కారుడు చెప్పాడు. ఐతే వికృతాకారం చేష్టలవల్ల జనించే హాస్యం లలితమైంది కాదు. వాగ్గతమైన హాస్యం శ్రేష్ఠం. భావుకుల దృష్టిలో హాస్యం కొరడాతో కొట్టినట్లుగాక కుపిత నాయిక వాలు జడతో చరిచినట్లు ఉండాలి .

పాశ్చాత్యుల దృష్టిలో హాస్యం ముఖ్యంగా రెండు రకాలు. హ్యూమర్, విట్. వాస్తవానికి భారతీయుల దృష్టిలో ఈ రెండూ హాస్యాంతర్గతాలే. కారణం రెండూ రసాత్మకానుభూతిని కలిగించేందుకు ఒకే విధంగా తోడ్పడతాయి. ఐతే "హ్యూమర్"లో వికృతి సహజంగానే ఉంటుంది. 'విట్'లో వికృతి ఆరోపించబడుతుంది 'విట్' అంటే వాక్చమత్కృతి. వికృతిని తటాలున ఆరోపించగల ప్రజ్ఞ. 'హ్యూమర్' లో హృదయ ధర్మానికీ, 'విట్' లో బుద్ధి తత్వానికి ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. వికట ప్రజ్ఞతో కూడిన మాటకి 'వికటోక్తి' అని

పేరు. వ్యంగ్యం, చమత్కృతి, పరిహాసం వగైరాలతో ఆడే ఆటలాంటిదనే భావంలో 'వికటాలాడుకోవడ'మనే వ్యవహారం ఉంది. వికటోక్తుల్లో చమత్కారం. శబ్ద గతంగానూ, అర్థగతంగానూ ఉండవచ్చు. ఒకతర్కాన్ని లేవదీసి, నిజాన్ని ధ్వనించి ఆక్షేపించే వ్యాజోకులు, తర్కాన్ని కావలసిన పక్కకు మళ్లించి నిజాన్ని కల్లగానో, కల్ల నిజంగానో భాసింపజేసి ఛలోక్తులు కూడా వికట ప్రజ్ఞలో భాగమే.

హాస్యరస పోషణలో అధిక్షేపానిది కీలకమైన పాత్ర ఒక వ్యక్తినో, ఒక సంప్రదాయాన్నో, ఒక దురాచారాన్నో ఆక్షేపిస్తూ హాస్యరసం ఉప్పతిల్లేలా రచించిన కావ్యాలు మనకు చాలా ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో క్షీణయుగంగా విమర్శకులు పేర్కొన్న 19వ శతాబ్దంలో వెలువడిన పిండిప్రోలు లక్ష్మణ కవి 'రావణ దమ్మీయం', కూచిమంచి జగ్గకవి 'చంద్రరేఖా విలాపం' తొలినాటి అధిక్షేప కావ్యాలు చింతలపాటి నీలాద్రిరాజు జగ్గకవిని తనకు ఒక కావ్యం అంకితంగా రాసి ఇవ్వమని కోరి, రాశాక సత్కరించక అవమానించినందుకు విలాసాన్ని విలాపంగా మార్చాడాని చెబుతారు. రాజు ఉంపుడు గత్తె చంద్రలేఖ శృంగారం ఇందులో ఇతివృత్తం. అడదం నూరకవి తిట్టు కవిత్వానికి ప్రసిద్ధుడు.

మోటుగానైనా సరే ఎవరినైనా ఆక్షేపించడంలో ఇతని హాస్యం ముందంజ వేస్తుంది. రామలింగేశ శతకంలో ఈ అధిక్షేప హాస్యం చూడవచ్చు. ఆనాటి విజయనగర ఆస్థాన తాత్కాలిక ప్రభువైన సీతారామరాజు నిర్ణయాలను ఆక్షేపిస్తూ 'మాన్యమ్ము లీయ సమర్థుడొక్కడు లేడుగాని మాన్యముల్ చెరుప సమర్థులరని చెప్పిన పద్యం వంటివి. తిరుపతి వేంకట కవుల గీరతం అధిక్షేప కావ్యం. కవుల మధ్య రగుల్కొన్న చిచ్చు చిలిపి జగడమై భారతం గీరతమైంది. అనంత పంతుల రామలింగస్వామిగారి 'శుక్లపక్షం' అధిక్షేప కావ్యాలకు బిజ్జబంతి అయింది. ఈయన అభినవ వికట కవి. భావ కవుల్ని, భావ కవిత్వాన్ని అపహసించడం ఇందులో కనిపిస్తుంది. శతక వాఙ్మయంలో అధిక్షేప శతకాలు ఉన్నాయి. కొందరు వ్యక్తి దూషణ ప్రధానమైన శతకాలు రచిస్తే, మరికొందరు వక్రోక్తి, వ్యాజోక్తి అన్యాపదేశం ఆధారంగా అధిక్షేప ప్రధానమైన శతకాలు రాశారు. ఆయా కవుల కాలం నాటి సాంఘిక, రాజకీయ వ్యవస్థలో కలిగిన మార్పులు, ప్రజలు అనుభవించిన కష్టాలు, వ్యక్తుల నైతిక పతనం మున్నగునవి అధిక్షేప రచనలకు దోహదం చేశాయి. కవి చౌడప్ప ఈ కోవకు చెందిన శతక కర్తల్లో అగ్ర గణ్యుడు. 'పది నీతులు, పది బూతులు పది శృంగార రీతులు గల్గు పద్యములు సభలో చదివినవాడే యధికుడు'. "నీతుల కేమి యొకించుక బూతాడక దొరకు నవ్వు పుట్ట" దని కవి చౌడప్ప చాటాడు. కూచిమంచి తిమ్మకవి భర్గ, కుక్కుటేశ్వర

శతకాలు సమకాలిక ప్రభువులు చిత్త వృత్తిని, కుకవుల మానసిక ప్రవృత్తిని అధిక్షేప ప్రధానంగా చిత్రించాయి. కూచిమంచి జగ్గకవి 'భక్తమందార శతకం' అధిక్షేప శతకమే.

ప్రాచీన సంప్రదాయాన్ని అనుసరిస్తూ రాసిన విశుద్ధ వ్యంగ్య కావ్యం భోగరాజు నారాయణ మూర్తిగారి 'పండగ కట్నము.' లోభి అయిన శరభరాజు ధనాశచే తన కూతుర్ని, వయసు మళ్లిన వాడికిచ్చి పెళ్లి చేయడానికి నిశ్చయిస్తాడు. ఇది అతడి భార్యకు గాని, కుమార్తెకు గాని గిట్టదు. కాని తన నిర్ణయాన్ని అతడు సమర్థించిన ధోరణి చూడండి.

"పోన్నాడ కామరాజని యున్నాడొక చిన్నవాడ యోగ్యుడుకాడే మున్నను నొక్కడె తమ్ములు, నాన్నలు లేరాస్తియెల్ల నతనిదె సుమ్మా నలుబది యేండ్ల వయస్సని పలుకుదురే గాని మూడుపదులు దాటు........"

గద్య రచనల్లో కూడా హాస్యం, వ్యంగ్యం, అధిక్షేపం చోటుచేసుకున్నాయి. కందుకూరి వారి రచనల్లో కటువ్యంగ్యం, తీవ్రకాకువు కొన్ని చోట్ల దర్శనమిస్తుంది. 'కలి పురుష శనైశ్చర విలాసం'లో కల్లుకు ఎంగిలి లేదు అని చెబుతూ

"పొగచుట్టకు సతిమోవికి
అగణితముగ మధ్యమునకు
నమృతమ్మునకున్
తగనుచ్ఛిష్టములేదని
గవాహనుతో కాలఖంఠుడు బలికెనా"

అని సురాపాన మత్తుపై శని అభిభాషిస్తాడు. కన్యాశుల్కం నాటకంలో ఈ పద్యాన్ని అనుకరించి గిరీశం చేత వెంకటేశానికి ఇలా బోధచేయిస్తాడు.

"ఖగపతి అమృతముగా
భుగభుగమని పొంగి చుక్క
భూమిని పడయెన్
పొగచుట్టై జన్మించెను
పొగతాగనివాడు దున్నపోతై పుట్టున్"

> నువ్వు నవ్వితే
> ఈ లోకం
> నీతో పాటు
> నవ్వుతుంది.
> నువ్వేడుస్తుంటే
> మాత్రం
> నువ్వొక్కడివే
> ఏడుస్తావు'
> అంటాడు
> బీర్బల్.

వీరేశలింగం గారి ప్రహసనాల్లో నాటి పురపాలక సంఘాల్లో, న్యాయస్థానాల్లో, ప్రభుత్వ కార్యాలయాల్లో చోటు చేసుకున్న అవినీతిని వ్యంగ్యంగా విమర్శించారు.

'కన్యాశుల్కం' నాటకంలో వ్యంగ్యహాస్యాన్ని అతి సరసంగా ప్రయోగించారు గురజాడ. ఆంగ్ల వ్యామోహం, అంతోయింతో నేర్చినవారి డాబు, పాపభీతిలేని వర్తనం, తప్పుచేసి దాన్నే ఒప్పని సమర్ధించగల లోక కంటకమైన నేర్పు, స్వార్థసాధనకై అలవర్చుకునే చాతుర్యం, నిజాయితీలేని లౌక్యం ఇలా సాంఘిక దోషాలెన్నింటినో వ్యంగ్యంగా చిత్రించారు గురజాడ.

పానుగంటివారి 'సాక్షి వ్యాసాలు చక్కని అధిక్షేపవ్యాసాలు. ఆంగ్లంలోని 'స్పెక్టేటర్' వ్యాసాలను అనుసరించి అపూర్వమైన వైవిధ్యంతో నాటి సమాజంలోని వికృతుల్ని ఆక్షేపించారు.

'మన అగ్రాసనాధిపతి దేవుని కాంధ్రభాష రాదట. ఆయన యాంధ్రమున మాటలాడనేలేదట. అయ్యయ్యో! మాట లేకపోవుటయేమి?..... మ్యావుమని కూయలేని పిల్ల యెచ్చటినైనా యుండునా? కిచకిచలాడలేని కోతిని మీరెచ్చటైన జూచితిరా? ఈతరాని కప్పయే దేశమందైనా నుండునా?....

ఇలా పానుగంటి వారి అధిక్షేపం అప్రతిహతంగా గుండెల్ని తాకుతుంది. డాక్టర్లు, శాస్త్రజ్ఞులు, రాజకీయ వేత్తలు, కన్యావిక్రేతలు, కాముకులు... ఇలా ఎందరినో ఆక్షేపించారు. మూర్ఖత్వాలు, దుష్టాండిత్యాలు, దంభాచారాలు, దురభిమానం వగైరా గుణాలను అధిక్షేపించి, అవమానించి సంస్కరించే ప్రయత్నం చేశారు పానుగంటి. చిలకమర్తి వారి గణపతి హాస్య నవలకారు, అధిక్షేనవలే. వారి ప్రహసనాల్లోనూ హాస్యం, వ్యంగ్యం నవ్విస్తాయి. 'దివాలా దేవి వ్రతం' అనే ప్రహసనం రచించారు చిలకమర్తి. దివాలాదేవిది ఆరాధించేవాడు కష్టపడరాదు. నౌకరీ చేయరాదు, ఎక్కువ వడ్డీకి అప్పులు తేవాలి. నమ్మకం కుదిరే వరకు వడ్డీ ఇచ్చి తర్వాత ఎగొట్టాలి. అప్పులు వాళ్లు ఇంటిమీదికొస్తే కోర్టుకెళ్లి 'ఇన్సాల్వెన్సీ పిటిషన్' దాఖలు చేయాలి.

అదే దివాలా వ్రతం...... ఇలా సాగుతుంది చిలకమర్తి వారి అభిక్షేపం.

శ్రీ శ్రీ 'సిరిసిరి మువ్వ' శతకంలోనూ, ఆరుద్ర 'ఇంటింటి పజ్యాలు' లోనూ అధిక్షేపం కనిపిస్తుంది. ఈ విధంగా కేవలం హాస్యం కోసం కాక సమాజంలోని చెడును విమర్శించడానికి తెలుగు కవులు, రచయితలు అధిక్షేపం రూపాల్లో వ్యంగ్యాన్ని హాస్యాన్ని పోషించారు.

# కొవ్వలి లక్ష్మీనరసింహారావు సినీ ప్రస్థానం



డా॥ సి.హెచ్.సుశీల
98491 17879

వెయ్యిన్నొక్క నవలలు రాసి ప్రపంచంలోనే అగ్రస్థానంలో నిలిచిన కొవ్వలి లక్ష్మీనారాయణ గారు 1950లలో తెలుగు సాహిత్యంలో ఒక సంచలనమే సృష్టించారు.

తమ జీవిత సమస్యల్ని చర్చిస్తున్న కొవ్వలి పుస్తకాల పట్ల స్త్రీలు విపరీతంగా ఆకర్షింపబడ్డారు. ఇంట్లో ఎన్ని ఆంక్షలు ఉన్నా చాటుమాటుగా వాటిని చదవటం మానలేదు. సినీ ప్రపంచంలో ప్రముఖులైన కన్నాంబ, భానుమతి రామకృష్ణ, సూర్యకాంతం, జమున వంటి వారు కొవ్వలి కథ అల్లిక పట్ల, సంభాషణల సొగసు పట్ల, నాటకీయ రచన పట్ల అంతులేని మక్కువ పెంచుకున్నారు. ఆ మక్కువ తోనే తమ సొంత ప్రొడక్షన్ లో మొదటి సినిమాకి కథ కొవ్వలి గారే రాయాలని కన్నాంబ గారు కబురు చేశారు. సినీ ప్రపంచంలోని రాజకీయాలు విన్న కొవ్వలి ఆ ఆహ్వానానికి అంతగా ఆసక్తి చూపలేదు. కడారు నాగభూషణం గారు తన మిత్రులు హనుమాన్ టాకీస్ అధినేత వీణం నాగేశ్వరరావు, సరస్వతి మూవీస్ మేనేజింగ్ డైరెక్టర్ పారుపల్లి శేషయ్య గారు ద్వారా, వెంట ఉండి తీసుకురమ్మని బలవంతపెట్టడంతో కొవ్వలి మద్రాసు బయలుదేరారు.

చిన్ననాడే తల్లిని కోల్పోయిన కొవ్వలి తన మనసులోని భావాల్ని చేర్చి కూర్చి 10 రోజుల్లో రాసిన "తల్లి ప్రేమ" కథ కన్నాంబ దంపతులకు ఎంతో నచ్చింది. జ్యోతిష్ చంద్ర సిన్హా దర్శకత్వంలో కన్నాంబ, సీ.ఎస్.ఆర్. ముఖ్య పాత్రధారులుగా "రాజరాజేశ్వరి పిక్చర్స్" బ్యానర్ మీద తీసిన "తల్లి ప్రేమ" (1941) సినిమాకి సంభాషణలు కూడా చేకూర్చి, హీరో సి.ఎస్.ఆర్.కి స్నేహితునిగా చిన్న పాత్రలో కనిపించారు కొవ్వలి. ఆ రోజులలో సినిమా షూటింగ్ సమయంలో దర్శక నిర్మాతలు రచయితను కూడా ఉండమని అడిగేవారు. అలా ఆరు నెలలు మద్రాసులో ఉన్నారు. చిత్రం విజయవంతమైంది. (బహుశా ఈ చిత్రం ఎక్కడా దొరకట్లేదు అనుకుంటాను).

ఆ సినిమా "ఫిలిం బాలే (ట్)" అవార్డు పొందింది . ఈ సందర్భంగా సినీ జగత్తులో ఒక చారిత్రాత్మక సంఘటన జరిగింది. తల్లి ప్రేమ చిత్రంలో 12 ఏళ్ళ పిల్లవాడి పాత్ర కోసం వెతుకుతున్న నిర్మాతల దగ్గరకు ఒక అందమైన 16 ఏళ్ల యువకుడు వచ్చాడు. సున్నితంగా ఆకర్షణీయమైన ముఖ కవళికలుతో ఉన్నాడు. కానీ పిల్లవాడి పాత్రకు కొంచెం వయసు ఎక్కువ అనిపించింది. స్ఫురద్రూపి అయిన అతన్ని వదులుకోలేక, మరో చిత్రంలోనైనా అవకాశం ఇవ్వాలన్న నిర్ణయంతో ఆరు నెలలు మద్రాసులోనే ఉంచేశారు. వారి నమ్మకం వమ్ము కాలేదు. ఆ 16 ఏళ్ల కుర్రాడు ఆ తర్వాత కాలంలో తెలుగు సినీ సామ్రాజ్యాన్ని నటసామ్రాట్ గా ఏలిన అక్కినేని నాగేశ్వరరావు.

ఆ రోజుల్లో ప్రముఖ రచయితలు నెల జీతానికి సినిమాల్లో కథ, మాటలు, స్క్రీన్ ప్లే రాసేవారు. కొవ్వలి గారికి ఎందుకో అది నచ్చలేదు. తన స్వేచ్ఛా స్వాతంత్రాలు పోతాయేమోనని భావించారు. కన్నాంబ దంపతులు మరో సినిమా తీయాలని, మాటలు రాయమని అడిగితే సున్నితంగా తిరస్కరించి ఏలూరు వచ్చేసారు. 1942లో దామరాజు లక్ష్మీదేవి గారితో వారి వివాహం జరిగింది. హాయిగా తన భావాలకు అనుగుణంగా నవలలు రాసుకుంటూ ఉండిపోయారు.

> ఆ రోజుల్లో ప్రముఖ రచయితలు నెల జీతానికి సినిమాల్లో కథ, మాటలు, స్క్రీన్ ప్లే రాసేవారు. కొవ్వలి గారికి ఎందుకో అది నచ్చలేదు. తన స్వేచ్ఛా స్వాతంత్రాలు పోతాయేమోనని భావించారు.

"కొవ్వలి అండ్ సన్స్ బుక్ డిపో" పేరున కొన్ని నవలలు ప్రచురించారు. ఇద్దరు పిల్లలు పుట్టి చనిపోవటం, ప్రచురణ రంగంలో అన్ని లెక్కలు చూసుకుంటే కష్టాలే మిగలటంతో, స్నేహితుల పిలుపుమేరకు దాదాపు పదేళ్ల తర్వాత 1950లో మద్రాసు వచ్చేసారు కుటుంబ సమేతంగా.

రాజరాజేశ్వరి పిక్చర్స్ లో కడారు నాగభూషణం వద్ద సహాయ దర్శకునిగా పనిచేసిన డి.ఎల్. నారాయణ తర్వాత పెద్ద నిర్మాతగా ఎదిగి "వినోదా పిక్చర్స్" పేరున ప్రముఖ బెంగాలీ నవల "దేవదాసు"ని వేదాంతం రాఘవయ్య గారి

దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి తో సినిమా తీస్తున్నారు. కొవ్వలి గారిని చూడగానే ఒక్క నిమిషం కూడా ఆలోచించకుండా "ఏదైనా కథ ఇవ్వండి. దేవదాసుని కొన్ని రోజులు ఆపి అయినా సినిమా తీస్తాను" అన్నారు. కొవ్వలి కథ పట్ల ఆయనకు అంత నమ్మకం. తయారుగా ఉన్న (హానెస్ట్ రోగ్) "మెత్తని దొంగ" కథ ని ఇచ్చారు కొవ్వలి. దాన్నే నెల రోజుల్లో "శాంతి" అనే సినిమాగా తీశారు. కథ మాటలు స్క్రీన్ ప్లే కొవ్వలి నిర్వహించారు. దేవదాసు చిత్రానికి పనిచేస్తున్న సాంకేతిక వర్గమంతా దీనికి పనిచేశారు. రామచంద్ర కాశ్యప హీరో. హీరోయిన్ సావిత్రి. గోవిందరాజుల సుబ్బారావు మరో ముఖ్య పాత్ర పోషించారు. జర్నలిస్ట్ వేషం వేసిన పేకేటి శివరాంకి ఇది మొదటి సినిమా. తల్లి ప్రేమ సినిమాలో చిన్న పాత్ర వేసిన కొవ్వలి ఈ చిత్రంలో కూడా జడ్జిగా చిన్న వేషం వేశారు. ధనవంతులు పేద వారిని ఎలా దోచుకుంటారో చెప్పే సామ్యవాద భావాలతో నిండిన సంభాషణలు ఉన్న ఈ సినిమా సెన్సార్ ఇబ్బందుల్లో పడింది. డి.ఎల్. నారాయణ ఢిల్లీ వెళ్లి సెన్సార్ బోర్డు నుంచి అనుమతి తెచ్చుకున్నారు. ఇది కూడా విజయవంతమైన చిత్రమే. పారితోషికంగా వచ్చిన 1500 రూ॥లతో (ఆ రోజుల్లో ఎక్కువ మొత్తం) పడమటి మాంబళం లో స్థలం కొనుక్కున్నారాయన. తర్వాత ఇల్లు కట్టుకున్నారు.

తర్వాత విక్రమ్ ప్రొడక్షన్స్ లో బి.ఎస్.రంగా (కన్నడ వ్యక్తి. ఆయనకి మొదటి సినిమా) తీసిన "మా గోపి" సినిమాకి కొవ్వలి కథ, మాటలు రాశారు. మాస్టర్ వెంకటేశ్వర్లు అనే బాలుడితో, చిన్న పిల్లవాడు ప్రధాన పాత్రగా తీసిన ఈ సినిమా బాగా విజయవంతమైంది. ఈ సినిమా కూడా ఎక్కడా దొరకటం లేదు. జెమిని టీవీ వారి వద్ద ఉన్నట్లు ఇటీవలి భోగట్టా.

1955 లో హెచ్.ఎమ్. రెడ్డి గారి దర్శకత్వంలో వచ్చిన రోహిణి వారి "బీదల ఆస్తి" చిత్రానికి కథ మాటలు రాశారు కొవ్వలి. కాంతారావు హీరో. కానీ అది నిర్మాణంలో వుండగా సగంలోనే ఆగిపోయింది.

"ఆంధ్ర పత్రిక' వార పత్రికలో శివలెంక శంభుప్రసాద్ గారు కొవ్వలి గారి "సిపాయి కూతురు" కథని సీరియల్ గా 14 వారాలు వేశారు. ప్రతి బుధవారం ఆ సీరియల్ కోసం పాఠకులు ఉత్కంఠగా ఎదురు చూసేవారు. డి.యల్. నారాయణ "సిపాయి కూతురు" కథని చందమామ బేనర్ పై చెంగయ్య దర్శకత్వంలో అదే పేరుతో 1956 లో సినిమాగా తీశారు. మాటలు, స్క్రీన్ ప్లే కొవ్వలి వ్రాశారు. ప్రధాన పాత్రధారిణి జమున ఆ సినిమా కోసమే గుర్రపుస్వారీ కూడా నేర్చుకున్నారు. హీరోగా కైకాల సత్యనారాయణ వేషం వేశారు. ఇదే ఆయన మొదటి చిత్రం కూడాను. యల్.

విజయలక్ష్మి కి నర్తకిగా ఇదే మొదటి సినిమా. సూపర్ డూపర్ హిట్ అయింది ఈ సినిమా. సిపాయి కూతురు నవలని నాలుగు సార్లు పునర్ముద్రించడం జరిగింది కూడా. నవల, సినిమా కూడా అత్యంత ప్రజాదరణ పొందాయి.

రామాయణంలో లేకపోయినా వీధి నాటకంగా అత్యంత ప్రాచుర్యంలో ఉన్న "రామాంజనేయ యుద్ధం" కథని సినిమాగా "నమ్మాళ్వార్" దర్శకత్వం వహించారు. కొవ్వలి కథ, మాటలు రాస్తుండగా- ఆంజనేయుని పాత్రకి అనుకున్న జంధ్యాల గౌరీనాథ శాస్త్రి కారణాంతరాల వల్ల మానుకొన్నారు. మరో నటుడిని అనుకోగా అతను మరణించారు. సెంటిమెంట్లు అధికంగా ఉండే సినీ లోకంలో ఆ పాత్ర వేయడానికి ప్రముఖులు ఎవరూ ముందుకు రాలేదు. అప్పుడప్పుడే చిన్న వేషాలు వేస్తున్న "రాజనాల కాళేశ్వరరావు కొవ్వలి గారిని కలిసి, తను ఆ వేషం వేస్తానని, నిర్విఘ్నంగా కొనసాగటానికి సలహాలు ఇమ్మని అడిగారు. వాయుపుత్రుడు, ఆజన్మ బ్రహ్మచారి అయిన ఆంజనేయుని పాత్ర వేయాలంటే శాకాహారం చేయాలని, బ్రహ్మచర్యం పాటించాలని చెప్పారు కొవ్వలి. అదే మాట పాటించారు రాజనాల. అయితే నిర్మాణంలో మరో ఆటంకం కలిగింది. అదే ముఖ్యమైన "డబ్బు". ఫైనాన్స్ కోసం డిస్ట్రిబ్యూటర్ ఎం.ఎస్.నాయక్ వద్దకు వెళ్లగా ఆయన ధన సహాయం చేశారు. వారి అమ్మాయి చంద్రకళ కూడా బేబీ ఆర్టిస్ట్ గా యయాతి కూతురు వేషం వేసింది. సినిమా అత్యంత విజయవంతమైంది. ఆ తర్వాత చాలా సినిమాల్లో రాజనాలే హనుమంతుడి వేషం వేయాలి- అన్నంత పేరు కూడా వచ్చింది ఆయనకి.

సిపాయి కూతురు తర్వాత "దక్షయజ్ఞం" సినిమాకి మాటలు వ్రాశారు కొవ్వలి. దక్షప్రజాపతిగా ప్రముఖ నటుడు ఎస్వీ రంగారావు గారు వేస్తున్నారు. భారీ నటుడి కోసం మరింత భారీగా డైలాగ్స్ పెంచమని నిర్మాత అడిగారు. ఎస్.వి.రంగారావు గొప్ప నటుడే కావచ్చు కానీ దక్షుడి పాత్రకి అంతకంటే ఎక్కువ సంభాషణలు రాయటం సమంజసం కాదని నిరాకరించారు కొవ్వలి. నిర్మాత పట్టుదలకుపోయి అప్పుడప్పుడే వృద్ధిలోకి వస్తున్న మరో రచయిత చేత సంభాషణలు పూర్తి చేయించారు. అందుకే టైటిల్స్ లో కొవ్వలి పేరు ఉండదు.

తర్వాత 2, 3 చిత్రాలకి కథ, మాటలు రాశారు కొవ్వలి. రాయటం అన్నది ఆయనకున్న ఆసక్తి. అంతేగాని కేవలం ధనార్జన ఆయన ధ్యేయం కాదు. అందుకే నిర్మాత ఎంత ఇస్తే అంత తీసుకునేవారు. కొన్నిసార్లు అసలు ఇవ్వకుండా ఎగ్గొట్టిన సందర్భాలూ ఉన్నాయి.

వైవిధ్యభరితమైన ఇతివృత్తంతో, ఆకర్షణీయమైన సంభాషణలతో ఉండే ఆయన నవలల లోని కథాంశం వారికి బాగా నచ్చేది. పైగా తమ మొదటి సినిమా ఆయన కథ తోటే ప్రారంభించాలి అన్న సెంటిమెంట్ కూడా ఉండేది. అలాగే చాలామంది నటీనటులకు ఆయనే మొదటి సినిమా అవకాశం ఇచ్చారు. ప్రముఖ నటుడు కె.వి. చలం చిన్న వయసులోనే సినిమాల పట్ల ఆకర్షితుడై, కొవ్వలికి ఉన్న పేరు ప్రఖ్యాతలు మీద నమ్మకంతో, ఇంట్లో చెప్పకుండా మద్రాసు వచ్చి సరాసరి కొవ్వలి వారి ఇంట్లో దిగారు. చాలా రోజులు వారి ఇంట్లోనే ఉండి సినిమా ఛాన్స్ కోసం ప్రయత్నించి తర్వాత నిలదొక్కుకున్నారు.

> ప్రముఖ నటుడు కె.వి.చలం చిన్న వయసులోనే సినిమాల పట్ల ఆకర్షితుడై, కొవ్వలికి ఉన్న పేరు ప్రఖ్యాతలు మీద నమ్మకంతో, ఇంట్లో చెప్పకుండా మద్రాసు వచ్చి సరాసరి కొవ్వలి వారి ఇంట్లో దిగారు

అప్పటికి హాస్య నటిగా పేరు తెచ్చుకున్న మీనాకుమారి 1962లో తన సొంత ప్రొడక్షన్లో భర్త సుబ్బారావు గారి సహకారంతో "మరపురాని కథ" అనే సినిమాని ప్రారంభించాలని అనుకున్నారు. కథ-మాటలు-స్క్రీన్ ప్లే కొవ్వలి గారే. దర్శకత్వం వేదాంతం రాఘవయ్య. జగ్గయ్య హీరో. నృత్య దర్శకత్వం పసుమర్తి కృష్ణమూర్తి. కానీ ఆర్థిక ఇబ్బందులతో ఆ సినిమా సగంలోనే ఆగిపోయింది.

తన రచనల ద్వారా సాంఘిక విప్లవాన్ని సాధించిన కొవ్వలి వారి సేవ గుర్తించి ఆనాడు శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలు యోగ్యతా పత్రాలు ఇచ్చాయి. వాటి ఆధారంగా కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ సముచిత రీతిన గౌరవించింది. నెలకు యాభై రూపాయలు కుటుంబ పోషణార్థం పంపించింది. దానికే చాలా సంతోషించారు 'అల్పసంతోషి' అయిన కొవ్వలి. ఆత్మాభిమానం పుష్కలంగా వున్న కొవ్వలి ఎవరికి పడితే వారికి, ఏదైతే అది రాసి ఇచ్చేవారు కాదు. తను నమ్మిన సిద్ధాంతం, కళ్ళ ఎదుట కనబడుతున్న గాథలు, అహంకార పూరితమైన - అన్యాయాలు చేసే కొందరి మనుషుల గురించి నిర్మొహమాటంగా రాసేవారు.

కొవ్వలి తెలుగువారు కావడం మన అదృష్టం.

# స్త్రీ పురుషుల మధ్య సమభావన సాధ్యమేనా!



డా॥ సి. భవానిదేవి
98668 47000

స్త్రీ పురుషులిద్దరూ కుటుంబంలో, సమాజంలో, దేశంలో, ప్రపంచంలో వివిధ రకాల బాధ్యతలు నిర్వర్తిస్తూ తమదైన ప్రత్యేకతలతో సృష్టికర్తవ్యాలను పాటిస్తున్నారు. అయితే కాలక్రమేణా స్త్రీ స్థానం రకరకాల సామాజిక, ఆర్థిక, రాజకీయ, శారీరక కారణాలవల్ల దిగజారుతూ వచ్చింది. గొప్పగా అభివృద్ధి చెందాయనుకున్న దేశాలలో కూడా స్త్రీ పురుషునితో సమస్థాయిలో జీవించడంలేదు. వివిధ రకాలుగా ఆమెపై హింస, అణచివేతలు కొనసాగుతూనే ఉన్నాయి.

అనేకమంది సంస్కర్తలు, స్వచ్ఛంద సంస్థలు ఎంతో కృషిచేస్తున్నా స్త్రీలపట్ల లింగవివక్ష కొనసాగుతూనే ఉంది. ఆడపిల్ల పుడుతుందని తెలియగానే గర్భంలో ఉండగానే చిదిమేస్తున్నారు. ఒకవేళ ఎలాగోలా జన్మించినా 'ఆడపిల్ల' అనే ఛీత్కారంతో పురిట్లోనే వడ్లగింజ వేసి చంపుతున్నారు లేదా కుప్పతొట్లలో మరెక్కడనో వదిలేస్తారు. కడపలో 'స్ఫూర్తి ఫౌండేషన్' లో ఇలా వదిలేయబడిన ఆడపిల్లలను చేరదీసి విద్యాబుద్ధులు నేర్పించి పెద్దవాళ్లను చేస్తున్నారు. వాళ్లని చూస్తే 'ఆడపిల్లలు ఇంత అక్కర్లేనివాళ్ళా?' అని దిగులు, దుఃఖం కలిగాయి. ఆ పిల్లలంతా రకరకాల స్థలాలలో తల్లిదండ్రులచే వదిలివేయబడినవాళ్ళు. ఇలా మనదేశంలో సగటున రెండు లక్షల ముప్ఫై వేలమంది ఆడశిశువులను చంపేస్తున్నారని నివేదికలు చెప్తున్నాయి.

ఆడపిల్లల కట్టు, బొట్టు, నవ్వు, నడకలపై అనేక నిబంధనలు విధిస్తారు. మతం కూడా మహిళలను తక్కువ దృష్టితో చూస్తుంది. ప్రతి మతంలో స్త్రీలపట్ల అనేక ఆంక్షలుంటాయి. ఆ ప్రకారం శిక్షణ ఇస్తున్నారు. ఈ పితృస్వామిక ప్రపంచంలో ఎంత చదివినా, ఎంత పెద్ద పదవులు నిర్వహిస్తున్నా ఆమెపట్ల స్త్రీ అనే చులకన భావన పోదు. వంటింటి బాధ్యత, ఇంటిని శుభ్రంగా ఉంచుకోవటంవుంచుకోవటం, పిల్లల సంరక్షణ అన్నీ ఆమె కర్తవ్యాలే! ఉద్యోగ

ప్రదేశంలో ఒక ఐ.ఏ.ఎస్. అధికారిణి గురించి ఆమె దగ్గర పనిచేసే అటెండర్ కూడా పరోక్షంలో చులకనగా మాట్లాడటం విన్నప్పుడు దిగ్భ్రాంతి, కోపం కలిగాయి. 'మగాడిని' అనే అహం నరనరానా జీర్ణించుకుని పెరిగే పురుషులు ఇంట్లో, రోడ్డు మీద, ఆఫీసులో ఎక్కడైనా ఆమెని ఒక వస్తువుగా చూస్తారుగానీ మనిషిగా గుర్తించటం లేదు.

పెరుగుతున్న శాస్త్రసాంకేతిక విజ్ఞానం స్త్రీలని అసభ్యకరంగా వేధించడానికి, నీలి చిత్ర ప్రదర్శనకు ఉపయోగించటం విచారకరం. ఇంట్లో తల్లిదండ్రులు తమ ఆడ, మగ సంతానం మధ్య వివక్ష చూపకుండా సమానమైన క్రమశిక్షణతో పెంచితే అనర్థాలు కొంతయినా తగ్గుతాయి. ఇది ఆడపని, ఇది మగపని అని ఇంట్లోంచే బోధిస్తారు. అందుకే ఆడవాళ్ళు చేసే చాకిరీకి విలువలేదు. స్వదేశంలో 'ఆడపని' అని ఆయాపనులు చేయని అబ్బాయిలు విదేశాలకు వెళ్ళినప్పుడు అన్ని పనులలో సమాన భాగస్వామ్యం వహించటం మనకి అనుభవంలో ఉన్నదే! స్త్రీలు, పురుషులతో సమానంగా అన్ని విద్యలు నేర్చుకోగలిగి రాణిస్తుంటే పురుషులు కొన్ని పనులు ఎందుకు నేర్చుకోరో అర్థంకాదు. 'ఆకలి' ఉన్న ప్రతివాళ్ళు వంట చేయటం నేర్చుకొని తీరాలి కదా!

కేరళలో ఒక రెడీమేడ్ దుస్తుల తయారీ పరిశ్రమలో పనిచేసే అమ్మాయిలు కాసేపు కూర్చునే సౌకర్యం కోసం సంవత్సరాల తరబడి కోర్టులో న్యాయ పోరాటం చేసి సాధించటం.... ఆలోచించాల్సిన విషయం. అక్కడ పనిచేయాలంటే అవివాహితలై ఉండాలిట. చాలా కార్యాలయాలలో స్త్రీలకు ప్రత్యేక మరుగుదొడ్లు ఉండవు. పిల్లలకోసం శిశు విహార్‌లు ఉండవు. తల్లి ఆడపిల్లకి సరైన ఆహారం కూడా ఇవ్వదు . శ్రామిక కుటుంబాలలో చిన్నపిల్లకే చీరకట్టి ఎక్కువ వయస్సని చెప్పి కూలీకి పంపిస్తారు. ఒక ఇంట్లో ఆడ, మగ పిల్లలుంటే విద్యాహక్కు మగపిల్లలకే ఉండటం ఆశ్చర్యం. నేను చదివిన కాలేజీలో ఆ రోజుల్లో అమ్మాయిలకు 'బి.కాం.లో సీటు ఇవ్వం' అని ఘంటాపథంగా

> కేరళలో ఒక రెడీమేడ్ దుస్తుల తయారీ పరిశ్రమలో పనిచేసే అమ్మాయిలు కాసేపు కూర్చునే సౌకర్యం కోసం సంవత్సరాల తరబడి కోర్టులో న్యాయ పోరాటం చేసి సాధించటం.... ఆలోచించాల్సిన విషయం.

చెప్పారు. ఆడపిల్లకు జీవించే హక్కు, విద్యా హక్కు, ఉద్యోగ హక్కు, ఆర్థిక భద్రత, ఆస్తి హక్కు ఇవన్నీ పూర్తిగా రాజ్యాంగం కల్పించినా, ప్రభుత్వం, న్యాయస్థానాలు ఎన్ని ఉత్తర్వులు జారీచేసినా అవి అమలుకు నోచుకోవటం లేదు. మగమహారాజు, 'ఆడ'పిల్ల అనే ఈ రెండు పిలుపులు మారితేగానీ ఆడవాళ్లకు పుట్టుక నుంచి చితి దాకా కనీస మర్యాద, గుర్తింపులు లభించవు.

పెళ్ళయ్యాక పుట్టి పెరిగిన ఇంటిని వదిలి పరాయి కుటుంబంలోకి వలస వెళ్ళిన అమ్మాయి ఇంటినే కాదు, ఇంటిపేరు కూడా మార్చుకోవటానికి నిర్బంధానికి లోనవుతుంది. అక్కడ అన్నీ బాధ్యతలే గానీ, హక్కులుండవు. ఉద్యోగిని అయిన స్త్రీ ఆఫీసులో పని ఒత్తిడి వలన కొంచెం ఆలస్యంగా ఇంటికివస్తే భర్త, అత్తగార్ల అనుమానపు చూపులు సూదుల్లా గుచ్చుకుంటాయి. పిల్లల్ని కనటం స్త్రీకి ప్రకృతి ఇచ్చిన బాధ్యత. కానీ ఈ కుటుంబ వ్యవస్థ ఎప్పుడు కనాలి, ఎంతమందిని కనాలి అనే విషయంలో నిర్ణయించుకోనీయదు. పురుషుని కారణంగా పిల్లలు కలగకపోయినా ఆ నింద ఆమెపైనే వేస్తారు. కార్యాలయంలో ఉద్యోగినులకు ఇచ్చే పోస్టింగ్స్ ల విషయంలో, బదిలీల విషయంలో కూడా లింగవివక్ష స్పష్టంగా కనిపిస్తుంది. ఇప్పుడు 'ఉద్యోగం మనిషి లక్షణం' గా మారినా ఉద్యోగినులు తెచ్చే జీతం డబ్బులకు భర్త ముందే ప్రణాళికలు రచిస్తాడు. ఆమెను సంప్రదించాలని కూడా అతనికి తోచదు.

మగవాళ్ళు తనవాళ్ళకు ఎంతైనా సాయం చేస్తారు. కానీ స్త్రీలు చేయాలంటే భర్త, వాళ్ళ కుటుంబీకుల అనుమతులు తీసుకోవాలి, వ్యతిరేకత భరించాలి. 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అనే కాలంచెల్లిన మాటలు ఇంకా నమ్మే ప్రబుద్ధులున్నారు. "నా భార్యకు నేను అన్నం పెడుతున్నాను కాబట్టి కొట్టి చంపే హక్కు నాకుంది" అని బ్రిటన్ లాంటి అభివృద్ధి చెందిన దేశంలో భార్యని కిరోసిన్ పోసి కాల్చేసిన కఱుకు కసాయి వాళ్ళున్నారు. కొన్ని తెగల్లో ఆడపిల్లల వక్షోజాలు పెరిగి ఆకర్షణీయంగా కనపడకూడదని పెరుగుతున్న దశలోనే ఇస్త్రీపెట్టెతో అక్కడ కాల్చేస్తారని తెలిసినప్పుడు నా హృదయం దుఃఖం, కోపం, అవమానపు సెగలతో నిండిపోయింది.

స్త్రీ పురుషుల సమానత్వం అన్ని రంగాలలో రావాలంటే రాజ్యాంగం ప్రకటించిన అన్నిహక్కులూ ఆమె అనుభవించాలి. పురుష - స్త్రీ ప్రపంచాలు ఆమెను ఒక తోటి 'మానవి' గా గుర్తించాలి. ముఖ్యంగా ఆమె తన శక్తిని గ్రహించి ఆత్మ విశ్వాస ధీరత్వంతో పోరాడి అయినా సమానత్వాన్ని సాధించాలి. అంతదాకా పోరాడుతూనే ఉండాలి.



# బుద్ధ పూర్ణిమ
## శుభాకాంక్షలు

బుద్ధుడు క్రీ.పూర్వం 563 లో లుంబినిలో జన్మించారు. ( భారత్ – నేపాల్ సరిహద్దు). బుద్ధుని జననం, మరణం, జ్ఞానోదయం. ఈ మూడు వైశాఖ పౌర్ణమి నాడే జరిగాయి. ప్రపంచ వ్యాప్తంగా బుద్ధుని బోధనలు ఎంతో మందిని ప్రభావితం చేశాయి. ఇంకా చేస్తూనే ఉన్నాయి. కరుణామయుడుగా గుర్తింపబడిన బుద్ధుడు పుట్టిన భారత దేశం ప్రపంచ శాంతిని పెంచే కరుణాలయం కావాలని ఆకాంక్షిద్దాం.

"మాతృగర్భమునందె, భూతకోటిం గాంచి జాలితో నభయ మొసంగినావు
గాయంబు గలయంచరాయనిం గొని పెంచి కన్నీట దాహంబు గడపినావు
నడలేక మడిదున్నుబడుగుటెద్దును జూచి నెనరుఁజూపుల మేను నిమిరినావు
తనువుఁ జాలించి పోయినజీవి నీక్షించి నడుమునక్కున బ్రీలి నలిగినావు"

– గుర్రం జాషువా

## మనవి

ప్రక్కన చూపిన ప్రకటన 1940 లో భారతి పత్రికలో పత్రిక యాజమాన్యం ఇచ్చిన ప్రకటన. 2021 లో, ప్రకాశిక పత్రిక కూడా ఈ ప్రకటనలో ఆశించిన స్వభావం గల రచనలను ఆహ్వానిస్తోంది. కాలం మారింది, సమస్యల స్వరూపం మారింది. కానీ, సమాజ శ్రేయస్సుకి ఉపయోగపడే సాహిత్య అవసరం మాత్రం ఇంకా ఉంది. చాలా ఉంది. మీలో ఉన్న గురజాడ తత్వాన్ని, చైతన్యాన్ని తట్టి లేపండి.



సంపుటం. ౧౭   ప్రమాది, చైత్రమాసము (ఏప్రిల్ 1940)   సంఖ్య. ౪

### వ్యాసలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకవైపే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. కావ్యవ్యాసాలు పదిహేన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటించవలసివచ్చును. "బాలానందమున" కుచితమైన కథలు, పాటలు, సాధ్యమైనంతవరకు పిల్లలభాషలో రచించి పంపించవలసినదని కవులకు మనవి. విమర్శలకు గ్రంథములు పంపువారు రెండుప్రతులు పంపవలెను.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను క్రొత్తదనం కావాలి. మన ఉద్యమాలు, మనదేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసినదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

Connect with us On Facebook : https://www.facebook.com/Prakasika1
Join us Via Telegram Prakasika telegram link : https://t.me/joinchat/SlYqileFRFSJ_zi_
Contact us: editor@prakasika.org

# శ్రీశ్రీలో ఒక శ్రీ సైన్సు



డా. నాగసూరి వేణుగోపాల్
హైదరాబాద్
✆ 94407 32392

"కవిత్వం సైన్సు కాకపోవచ్చుకాని, సైన్సు కవిత్వానికెంతయినా బలం చేకూర్చుతుంది"

"సైన్సులాగే కవిత్వానికి కూడా ప్రయోగాలు లేనిదే అభివృద్ధి లేదు"

"సాహిత్యానికైనా, సైన్సుకైనా ప్రయోగపరత్వమే అభివృద్ధికి రాచబాట వేస్తుంది"

"వైజ్ఞానిక దృక్పథం ఉన్నవాడెవడూ వాఙ్మయంలో పరిశోధనా వ్యాసంగాన్ని విస్మరించలేదు"

ఈ అభిప్రాయాలన్నీ శ్రీ శ్రీ స్వీయచరిత్ర 'అనంతం'లో మనకు కనపడతాయి. శ్రీ శ్రీ 'అనంతం' ధారావాహికంగా ప్రచురింపబడుతున్నపుడూ, తరువాత పుస్తకంగా వెలువడినప్పుడూ రకరకాల చర్చలు జరిగాయి. అయితే, సెక్స్ మీద జరిగినంత చర్చ సైన్స్ మీద జరుగలేదు. అప్పట్లో సైన్సు మీద కూడా ఆ స్థాయి చర్చ జరిగివుంటే మన సాహిత్య స్థాయి తీరు వేరుగా వుండేదేమో!

శ్రీ శ్రీ స్వరంలో సహజంగా ధిక్కారం, చమత్కారం, పాండిత్యం, వెటకారం కనబడుతుంది. కానీ సైన్సు విషయం ప్రస్తావించినపుడు ఆయనలో దానిపట్ల వుండే గౌరవం కారణంగా నమ్రత కొట్టొచ్చినట్టు కనబడుతుంది.

'శరచ్చంద్రిక' (ఖడ్గ సృష్టి) కవితలో 'ఇదీ మా భూలోకం కథ ఇదీ మానవుడి ప్రోగ్రెస్ రిపోర్ట్' అంటూ చందమామకు చెప్పిన విషయాలు చూడండి:



చంద్రమండలానికి ప్రయాణం
సాధించరాని స్వప్నం కాదు
గాలికన్న బరువైన వస్తువుని
నేలమీద పడకుండా నిలబెట్టలేదూ?
... ... ...
ఉత్తర ధ్రువంలో వ్యవసాయం
ఒకప్పుడు జరిగి తీరుతుంది

అంతవరకూ సాగిన శాస్త్రసాంకేతిక పరిధిని శ్రీశ్రీ పరిశీలించడమే కాదు, అప్పటికి శాస్త్రవేత్తలకుండే లక్ష్యాలమీద స్పష్టమైన అవగాహన వుంది. సగటు మనిషిని, సమాజాన్ని ప్రభావితం చేసే పరిశోధనల పార్శ్వం గురించి శ్రీశ్రీకి యింకా బాగా తెలుసు.

అదే సమయంలో సైన్స్ లక్ష్యం ఏమిటో - బాగా ఆశావహంగా చెబుతాడు. 'సామాన్యుని కామన' కవితలో యిలా అంటాడు :

''సైన్సువల్ల ఈ రోజున
సామాన్యుని బ్రతుకు కూడా
సౌందర్యమయం కాగల
సదుపాయం లభించింది''

ఇంతకుమించిన లక్ష్యం ఏముంది? అలాగే అదే కవితలో యిలా కూడా అంటాడు :

''నరకం, స్వర్గం అన్నవి
ఒక స్థితికి రెండు పేర్లు
ఫోకస్ భేదం అంతే
లోకస్ రెండింటికొకటే''

సైన్సు భావనను శ్రీశ్రీ హాయిగా సాహిత్యీకరించాడు శ్రీశ్రీ. స్వర్గం, నరకం అన్నవి ఒక స్థితికి రెండు పేర్లు - ఎలా? +2, -2 లాగా అన్నమాట. విలువ ఒకటే కానీ దిశ వేరు. మొదటిది లాభం రెండు కాగా, మరోటి నష్టం రెండు. ఇక ఫోకస్, లోకస్ అన్నవి కేవలం ప్రాసకోసం తగిలిన మాటలు కావు. మనకు పై భాగాన స్వర్గం వుందనుకుంటే, అలాగే అంతే దూరంలో మనం వుండే తలానికి క్రిందన

నరకం వుంటుంది. రెండూ మనకు తమ దూరంలో వున్నాయి. కానీ పరస్పర వ్యతిరేక దిశల్లో! ఆ రెండింటిని కలిపే ఊహాత్మక సరళరేఖ - లోకస్! ఫోకస్ అనేది దిశాభేదాన్ని వివరిస్తూ ఆ సరళ రేఖ ఇరు కొనలను మనకు చెబుతుంది. పైన ఉన్నది ధనాత్మకం కాగా మన కింద ఉన్నది ఋణాత్మకం అవుతుంది. స్వర్గం, నరకం బదులు పుణ్యం, పాపం లేదా మంచీ, చెడూ అనే వాటిని ప్రతిక్షేపించి ఇదే లోకస్! ఫోకస్ భావనలను వివరించవచ్చును కూడా. ఇవన్నీ చదువుతున్నప్పుడు ఆరుద్ర 'త్వమేవాహం'లో 'పైథాగరస్ సిద్ధాంతం' ద్వారా దోపిడి ప్రక్రియను వివరించడం మీకు గుర్తుకురావచ్చు.

సైన్సుకూ, సాహిత్యానికీ సంబంధం ఏమిటి? దానిని వివరించడానికి టి.యస్. ఇలియట్ చెప్పిన విషయాన్ని శ్రీ శ్రీ తన అనంతంలో యిలా తెలుగు చేస్తాడు

> సైన్సుకూ, సాహిత్యానికీ సంబంధం ఏమిటి? దానిని వివరించడానికి టి.యస్. ఇలియట్ చెప్పిన విషయాన్ని శ్రీశ్రీ తన అనంతంలో యిలా తెలుగు చేస్తాడు

''ఒక గ్రాఫ్కి, ఎక్స్-యాక్సిస్, వై-యాక్సిస్ అని రెండు గీతలుంటాయి. ఒక గీత పొడుగు, ఇంకొకటి వెడల్పు, పొడుగు గీత కవి యొక్క దైనందిన జీవితానుభావాలు, వ్యాపకాలు, ఆలోచనలు, ఇతర కవులతో పరిచయాలు, కవితా రచనలను చదవడాలు, అధ్యయనాలు చెయ్యడాలు. ఇవన్నీ ఆ గీతపొడుగునా సాగిపోతాయి. రెండోది అతని సాంకేతిక ప్రయోగాల సాధన. ఇది కూడా అనుదినం సాగిపోవాల్సిందే. అప్పుడే ఆ కవి నిజంగా తానేది చెప్పదలచుకున్నాడో అది చెప్పవలసిన సమయం వచ్చినపుడు, .... చెప్పవలసిన సంవిధాన సంపత్తికూడా సంసిద్ధంగా వుంటుంది. అదే ఒక మహాకావ్యం ఆవిర్భవించే సుముహూర్తం. రెండు గీతలూ ఒక ఉన్నత శిఖరం వద్ద కలుసుకుంటాయి. దాని ఫలితమే ఒక మాస్టర్ పీస్.''

ఒక గొప్ప రచన ఎలా వస్తుందో రేఖాగణితం ద్వారా వివరించిన తీరు యిది. అందులో కొసమెరుపు - మాస్టర్ పీస్ ఆవిర్భావం! ఇందులో సాహిత్య సంబంధమైన మరో కీలకమైన అంశం - సంవిధాన సంపత్తి. దీనిని సాధించడానికి ప్రతి సాహిత్యవేత్త శాస్త్రవేత్తలాగా సమాయత్తం కావలసి వుంటుంది.

అనంతం నేను ఆషామాషీగా కానీ, ఉబుసుపోకకు గానీ రాయలేదు. కళాకారుడుగా కూడా రాయలేదు. ఒక సైంటిస్టుగా జీవిత వాస్తవికతను సందర్శించే ఉద్దేశ్యంతో రాస్తున్నాను... కళలలో గానీ, జీవితంలో గానీ వాస్తవికతకు రావలసినంత గౌరవప్రదమైన హోదా వచ్చినట్లు కనబడదు. ఆత్మ చరిత్ర అనడం కన్నా ఆత్మపరీక్ష అంటేనే నిజానికి న్యాయం చేకూర్చినట్టు అవుతుంది. జీవితం అనే పరిశోధనాశాలలో దీనినొక ప్రయోగంలా భావిస్తున్నాను. ఒక సైంటిస్టుకూ, లేబొరేటరీకి వున్న సంబంధమే నాకూ, నా జీవితానికీ వుంది. శాస్త్రీయ దృక్పథం అనే టార్చిలైటు వేసి నా జీవితంలోని చీకటి కోణాలను వెలిగించే ప్రయత్నమే ఈ రచన... అని స్వీయ చరిత్ర గురించి శ్రీ శ్రీ చెబుతాడు.

ఈ ఆలోచనలలోని స్ఫూర్తిని శ్రీశ్రీని ఇష్టపడేవారూ, గౌరవించే వారందరూ ప్రాచుర్యంలోకి తెచ్చివుంటే తెలుగు సాహిత్యం ఖచ్చితంగా యిలా వుండేదికాదు అనిపిస్తుంది.

సాంప్రదాయక కవిత్వం అంటే (అసహ్యం అనను కాని) అనిష్టమూ, కవిత్వం ప్రయోగపరత్వం మీద అభీష్టమూ నాలో నానాటికీ పెంపొందడానికి ఒకే ఒక్క కారణం వుంది అదే నాలోని వైజ్ఞానిక దృక్పథం. ప్రయోగం లేకపోతే సైన్సు లేదు. ఈ సూత్రం కళలకి కూడా వర్తిస్తుంది. అయితే సాంప్రదాయాన్ని అంటిపెట్టుకుపోయిన కళాకారులకు మన సమాజం ఇచ్చే గౌరవ మర్యాదలు పరిశోధనాసక్తి ప్రదర్శించే ఆర్టిస్టులకు లభించలేదంటే అందుకు ఇప్పటికే వేళ్ళూనుకుని పోయివున్న భూస్వామ్య వ్యవస్థనే నేను నిందిస్తాను... అని రెండు ముఖ్యమైన విషయాలు గట్టిగా చెబుతాడు.

సైన్సులాగే కవిత్వానికి కూడా ప్రయోగాలు లేనిదే అభివృద్ధి లేదు. ప్రయోగాత్మక కవిగా ప్రారంభించిన టి.ఎస్.ఈలియట్ లబ్ధప్రతిష్ఠుడై తర్వాత సంప్రదాయానికి అంకితమయ్యాడు. మన విశ్వనాథ సత్యనారాయణగారు కూడా భావ కవిత్వపు రోజుల్లో వినూత్న ప్రయోగాలు చేసి రానురాను కరడుగట్టిన అభివృద్ధి నిరోధకుడుగా ఘనీభవించడం అందరికీ తెలిసినదే...

అరశతాబ్దపు తెలుగు సాహిత్యాన్ని మనం పరిశీలిస్తే సైన్సు అంటే దేవుడిని నిందించడం, ఖండించడం అనే చలామణి అవుతోంది. వాస్తవానికి దేవుడనే భావన సైన్సుకు అక్కరలేదు. ఈ విషయానికి సంబంధించి శ్రీ శ్రీ చెప్పిన మాటను మనం గమనించాలి. నేను పూర్తిగా నాస్తికుణ్ణికాను. ఒక రకంగా అజ్ఞేయవాదిని అని శ్రీ శ్రీ అంటాడు. దేవుడున్నాడా, లేడా - అనే విషయం మనకు అవసరం లేదు.

మనిషి మనకు ప్రధానం అని బుద్ధుడు ఏనాడో చెప్పిన మాటను ప్రపంచమంతటా ఎంతోమంది గౌరవిస్తారు. ఇక్కడ సైతం శ్రీశ్రీని ఇదే కోవలో పరిగణించాలి.

శ్రీశ్రీ 'అనంతం'లో చాలాచోట్ల సైన్సు గురించి వెలిబుచ్చిన ఆలోచనలు నేటికీ అవసరమే!

అప్పుడప్పుడు వెర్రివాడి రాయి బాపతుగా కొన్ని కొన్ని ప్రిడిక్షన్లు నిజమయినంత మాత్రం చేత ఆస్ట్రాలజీని ఒక సైన్సుగా నేను గుర్తించలేను అని చాలా వాస్తవికంగా చెప్పిన శ్రీశ్రీ - మరింత నిజాయితీగా ఇన్ని కబుర్లు చెబుతున్న నేను నా యింటిలోంచి దేవుణ్ణి తరిమివేయలేక పోతున్నాను అని చెబుతాడు. సైన్సును సత్యంగా కాకపోతే, కనీసం సత్యాన్వేషణగా అంగీకరించాలా? వద్దా? ... ఈనాడు మతం ఓడిపోతోంది. సైన్సు గెలుస్తోంది. ఇదే ఈనాటి చారిత్రక పరిణామం అని మరోచోట అంటాడు.

ఆయుధాలు లేకుండా పోరాటం సాగించవచ్చునని రుజువు చేసిన స్వాతంత్ర్య సమరసేనానిగా ఆయన్ని (గాంధీని) నేనెప్పుడూ గౌరవిస్తాను. అయితే తన ఉద్యమానికి దేవుడి ఆశీర్వాదం వుందని గాంధీజీ నమ్మకం - అని చెబుతూ మరో గొప్ప ఆశను వెలిబుచ్చుతాడు శ్రీశ్రీ. - అప్పుడప్పుడు నాకనిపించుతూ వుంటుంది. గాంధీగారు నిరీశ్వరవాది అయివుంటే మనదేశ చరిత్ర ఎటువంటి మలుపు తీసుకుని వుండేదో అని.

శ్రీశ్రీ సైన్సు స్ఫూర్తిని పూర్తిగా అందుకుని వుండివుంటే తెలుగు సాహిత్యం యిలా వుండి వుండేదా? జీవితంలో, సాహిత్యంలో, వాస్తవికత, తార్కికత, ప్రయోగపరత్వం తప్పనిసరిగా వుండాలనేది అర్థవంతమైన, వాంఛనీయమైన శ్రీశ్రీ ఆదర్శం!



# అంగారకుని అన్వేషణలో కొత్త శకం ప్రారంభం

**(2021 ఫిబ్రవరి లో అంగారకుని చేరుకున్న వివిధ దేశాలకు చెందిన మూడు రోదసి నౌకలు)**



**డా|| శేషగిరి రావు వెల్లంకి**
94910 21010
*Former Distinguished Scientist &*
*Associate Director ISRO*

మన సౌర వ్యవస్థలో ఉన్న (బుధుడు, శుక్రుడు, గురుడు, శని, యురేనస్, మరియు నెప్ట్యూన్) గ్రహములకన్నా, అంగారక గ్రహము చాలా విధములుగా భూమిని తలపింపచేయు గ్రహం. అందువలన ఈ సౌర వ్యవస్థలో భూగ్రహం మీద కాకుండా మరెక్కడైనా జీవరాశి (భూగ్రహాంతర జీవరాశి) వుండేటట్లయితే, అటువంటి జీవరాశులు అంగారక గ్రహం మీద వుండడానికి మంచి అవకాశం వున్నట్లుగా మానవులు భావించేవారు.

**అంగారక గ్రహం: దాదాపు భూమిని పోలిన గ్రహం**

భూమివలే అంగారక గ్రహం కూడా సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్న ఒక పెద్ద గోళము. ఇది ఒక 'భూతల గ్రహం' (టెరెస్ట్రియల్ ప్లానెట్) అనగా భూమి వంటి గట్టి ఉపరితలం గల గ్రహం. దీనితో పోలిస్తే గురు, శని, యూరేనస్ మరియు నెప్ట్యూన్ గ్రహముల ఉపరితలం ఏమాత్రం గట్టిగా వుండదు!

అంగారక గ్రహం యొక్క వ్యాసం భూవ్యాసంలో సగం కన్నా కొంచెం ఎక్కువ. దీని బరువు భూమి బరువులో 1/10 వ వంతు మాత్రమే ఉంటుంది. తక్కువ బరువు, తక్కువ వ్యాసం ఉండుట వలన, దీని ఉపరితల గురుత్వాకర్షణ శక్తి కూడా తక్కువ. అందువలన, మీ బరువు భూమిపై 100 కిలోలైతే అంగారక గ్రహంపై అది కేవలం 38 కిలోలుగా ఉంటుంది.

సూర్యునిచుట్టూ దగ్గరగా, ముందు భూ కక్ష్య పరిధి, ఆ తరువాత అంగారక కక్ష్య పరిధి ఉంటాయి. ఆకారంలో అంగారక కక్ష్య పరిధి, భూ కక్ష్య పరిధికన్నా అధిక అండాకారంలో ఉంటుంది. అంగారక గ్రహం మరియు సూర్యుని మధ్య సరాసరి దూరము 230 మిలియన్ (23 కోట్ల) కిలోమీటర్లు కాగా భూమి మాత్రం, సూర్యునికి 150 మిలియన్ (15 కోట్ల) కిలోమీటర్ల దూరంలో ఉంది. అంగారక

గ్రహం మీద ఒక సంవత్సరానికి 687 రోజులు. అనగా అంగారక గ్రహం సూర్యుని చుట్టూ ఒక ప్రదక్షణం చేయడానికి పట్టే సమయం. అటువంటి ప్రదక్షణం చేయటానికి భూమికి పట్టే సమయం 365 రోజులు మాత్రమే!




ఆశ్చర్యకరంగా, అంగారక గ్రహం మీద ఒక రోజు, భూమి మీద ఒక రోజు కన్న కొంచెం మాత్రమే ఎక్కువ. అది ఖచ్చితంగా తెలుసుకోవాలంటే, ఒక రోజు అనగా, అంగారక గ్రహం మీద 24 గంటల 37 నిమిషాలు. అంగారక గ్రహం దాని అక్షం మీద వాలు దాదాపు 25 డిగ్రీలు. ఇది భూమి వాలు 23.5 డిగ్రీలకు దగ్గరగా వుంటుంది, కాబట్టి అనుకూల వాతావరణం ఉంటే ఋతువులు కూడా ఏర్పడవచ్చు!

భూమిలాగానే అంగారక గ్రహం మీద కూడా, మైదానములు, ఎత్తు పల్లాలు, కొండలు, అగ్నిపర్వతాలు, లోయలు మొదలగునవి ఉన్నాయి. అంగారక గ్రహం మీద దిగిన రోబాటిక్ అంతరిక్ష నౌకలు మరియు సంచరించిన నౌకలు పంపించిన ఉపరితల ఛాయాచిత్రాలలో, నిజానికి భూగొళపు భూగోళపు పరిసరాల పోలికలు వున్నాయంటే ఆశ్చర్యం లేదు. కాని, ఆ ఛాయాచిత్రాలలో ఒక చిన్న మొక్క గాని లేదా ఒక చిన్న జీవి గాని ఉన్నట్లు కనిపించదు.

అంగారకుడి అన్వేషణలో కొత్త శకం ప్రారంభానికి, ఒక విధంగా భారతదేశం యొక్క మంగళయాన్ ప్రేరణ అని అనుకోవచ్చు. భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ 2013 నవంబర్ 5 న ప్రయోగింపబడిన మార్స్ ఆర్బిటార్ మిషన్ (మామ్), అంగారకుని కక్ష్యలో 2014, సెప్టెంబర్ 24 న ప్రవేశించి, నిర్దేశింపబడిన ప్రయోగ ఫలితములనందిస్తూ గత ఆరు సంవత్సరములుగా



దిగ్విజయముగా పని చేస్తున్నది. గ్రహాంతర ప్రయోగములలో ప్రథమ ప్రయత్నములోనే విజయము సాధించిన ఏకైక దేశంగా పేరు గడించి అనేక అన్వేషణలకు నాంది పలికినది.

అంగారక గ్రహం దగ్గరకు యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (UAE) 'హోప్' రోదసి నౌక యొక్క ఆశించిన రాకతో, ఈ కొత్త శకం అన్వేషణలో పాలుపంచుకోనున్నది. 2021, ఫిబ్రవరిలో అంగారకుని చేరుకోవటానికి ఉద్దేశించిన మూడు ప్రయోగాల్లో ఇది మొదటిది. యు.ఏ.ఈ. పరిశోధనా నౌక 2021 ఫిబ్రవరి 9 న అంగారకుడి సమీపానికి చేరువలో, ప్రయోగ తుది, కక్ష్యలో చొప్పించే చర్య మరియు నియంత్రణలో విజయం సాధించి గ్రహ అన్వేషణలో పాలు పంచుకోనున్నది. 'హోప్' మాత్రం అంగారక గ్రహ కక్ష్యలో తిరుగుతూ పరిశోధనలు చేయుటకు ఉద్దేశించబడినది. మిగిలిన రెండూ, గ్రహ ఉపరితలతలం పై దిగి పరిశీలన, పరిశోధనల కోసం ఉద్దేశించబడినవి.

'హోప్' యొక్క రెండు సంవత్సరాల మిషన్, అంగారకుని వాతావరణానికి సంబంధించి, గ్రహం చుట్టూ ఉన్న అన్ని ప్రదేశాల్లో పగలు, రాత్రి, వేసవి మరియు శీతాకాలాల గురించి సంపూర్ణమైన సమాచారమును అందించగలదు. ఒకవేళ విజయవంతమైతే అమెరికా, రష్యా, చైనా, భారత్ లను అనుసరిస్తూ అంగారక గ్రహాన్ని చేరుకున్న ఐదో దేశంగా యూ.ఏ.ఈ. అవతరించనుంది.




'హోప్' తరువాత , 2021 ఫిబ్రవరి 10 న చైనా యొక్క తియాన్వెన్-1 పరిశోధనా నౌక మరియు నాసా (NASA) యొక్క 'పెరసెవరెన్స్' రోవర్ ఫిబ్రవరి 18న అంగారక గ్రహానికి చేరుకున్నాయి. వాతావరణాన్ని అధ్యయనం చేయగల చైనీయుల తియాన్వెన్-1 ప్రయోగం లో భాగంగా ఒక రోవర్ ను కూడా మోసుకెళ్లింది.




అంగారకుని వాతావరణాన్ని అధ్యయనం చేయడం కూడా చైనీయుల తియాన్వెన్-1 ఆర్బిటర్ మిషన్ లో భాగంగా ఉంది, ఫిబ్రవరి 10 నుంచి కక్ష్యలో ప్రవేశానికి, ఆపై కొద్ది రోజులలో ఉపరితలంపై దిగుటకు అనేక నియంత్రణా విన్యాసములు చేపట్టనున్నారు.

ఈ మూడు ప్రయోగాలలోనూ అనేక ఉద్వేగభరిత క్షణాలు ఉన్నాయి. ఎందుకంటే, గ్రహాన్ని చేరుకోవడం అనేది క్లిష్టమైన వరుస విన్యాసాలలో ఒకటి, కచ్చితమైన, ఉద్దేశిత కక్ష్యను చేరుకోవటం, ఇది గ్రహ ఉపరితలంపై దిగటానికి మొదటి అడుగు మాత్రమే.

300 మిలియన్ (30 కోట్ల) మైళ్ల ప్రయాణం

అంగారకుడు భూమికి అత్యంత సమీపములోనున్నపుడు, కక్ష్యలో ప్రవేశపెట్టటానికి వీలుగా ఈ మూడు రోదసి నౌకలు 2020 జూలై నెలలో ప్రయోగించబడినవి. 30 కోట్ల మైళ్ల ప్రయాణం తరువాత 2021 ఫిబ్రవరికి అంగారకుని సమీపమునకు చేరుకున్నాయి.

ఎనిమిది సంవత్సరాల సుదీర్ఘ పరిశోధన తర్వాత, నాసా తయారుచేసి, 2020 జులై 30 న ప్రయోగించిన 'పెరసెవరెన్స్' తో అంగారక గ్రహంపై ఎగిరే తొలి హెలికాప్టర్ 'ఇంజెన్యూటీ' (ingenuity) కూడా జతపరచబడినది.

ఏ వస్తువు అయినా, శూన్యం నుండి గ్రహ ఉపరితలముపై దిగుచున్న సమయం భయాందోళనతో కూడిన, ఒక ఉత్కంఠమైన స్థితి. శాస్త్రవేత్తలకు కీలక పరీక్షా సమయము. ఎందువలెననగా, రోదసి నౌక గ్రహ వాతావరణ రాపిడి వలన అత్యంత ఉష్ణోగ్రతకు లోనై భూమితో సంబంధాలు కోల్పోయినా, క్రమ క్రమముగా వేగం తగ్గించుకుంటూ, శాస్త్రపరికరముల సమగ్రతకు ఎటువంటి ప్రమాదము కలగకుండా, సురక్షితముగా నిర్దేశిత ప్రదేశములో అతి సుకుమారముగా దింపవలెను. ఆ తర్వాత, భూమి నుంచి సంకేతాలు పంపటానికి దాదాపు 11

నిమిషాలు పడుతుంది, తిరిగి అందుకోవటానికి కూడా అంతే సమయం కావాలి. శాస్త్రపరికరాల పనితనాన్ని తగినంత స్పష్టంగా, ఖచ్చితంగా నిర్ధారించటం అవసరం, తద్వారా శాస్త్రవేత్తలు చాలా ప్రయోజనం పొందుతారు.

బహు దూరపు అంతరిక్ష పర్యవేక్షణ మరియు రేడియో ఖగోళ పరిశీలనా వ్యవస్థను ఉపయోగించి, అంగారక గ్రహముపై దిగిన పరికర సముదాయము నుండి సమాచార సేకరణ జరుగుతుంది.

నాసా 'పెరసెవరెన్స్'ను, చిన్న చిన్న బండలు, ఇసుక తో నిండిన ఒక లోయలో (క్రేటర్) లో దింపబడినది. ఇది ఒక పురాతన సరస్సు లేదా నది మైదానంగా భావించబడుతోంది. ఈ క్రేటర్ ను పురాతన ప్రాణుల యొక్క చిహ్నాలను కనుగొనడానికి ఎంచుకోబడినది. ఆ వ్యవస్థలు రాతి నేలను త్రవ్వడానికి యంత్రాలను కలిగి ఉంటాయి, ఈ నమూనాలను భద్రపరచి, ఉపరితలంపైనే ఉంచి, భవిష్యత్ లో సేకరించుతారు.

ప్రస్తుతము అన్ని నౌకలు సక్రమముగా పని చేస్తున్నాయి. శాస్త్రవేత్తలు మూడు ప్రయోగముల నుండి సమాచారము మరియు చిత్రాల కోసం ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు. యూరోపియన్ స్పేస్ ఏజెన్సీ కూడా భవిష్యత్తులో ఇటువంటి ప్రయోగాల కోసం ప్రయత్నములు చేస్తున్నది.

ఇప్పటికే అంగారకుని సమాచారం అందచేస్తున్న మామ్ తో పాటు, 2021 ఫిబ్రవరి లో అంగారకుని పరిశోధనకు అందుబాటులోకి రానున్న 'హోప్', తియాన్వెన్-1 మరియు 'పెరసెవరెన్స్' విజయవంతమై అనుకున్నట్లుగా శాస్త్రజ్ఞులు సమాచారాన్ని సేకరించగలిగితే... రాబోయే రెండు దశాబ్దాలలో, అంగారక గ్రహానికి మానవ సహిత యాత్రల ద్వారా అక్కడ కృత్రిమ నివాస యోగ్య గదులను ఏర్పరుచుకొని, అంగారకుని మానవ నివాసానికి అనువుగా మార్చగలరని ఆశిద్దాం.

(ఛాయాచిత్రములు వివిధ వార్తా సంస్థలనుండి సేకరించబడినవి)



ప్రయోగం 2020 జులై 30 న, అంగారకునిపై దిగినది 2021 ఫిబ్రవరి 18 న, పై చిత్రములలో దిగిన విధానము, హెలికాప్టర్ 'ఇంజెన్యూటీ', సమీప ఉపరితలం



# చందమామ రావే!



కీ॥శే॥ రామవరపు జగన్మోహనరావు

చంద్రబాబు చిన్నప్పుడు గోరుముద్దలు తినిపించేటప్పుడు అమ్మ 'చందమామ రావే! జాబిల్లి రావే!!' అని పాట పాడేది. నూనూగు మీసాలొచ్చేసరికి 'యూరీ గగారిన్ గగన తలంమ్మీద గిరికీలు కొట్టేడు.' చదువు పూర్తయి ఉద్యోగపర్వం ప్రారంభించే వేళ 'నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ 1969లో చందమామ లోగిలిలో వాలేడు.' తర్వాత శ్రీమతి సమేతంగా వెళ్ళిన ప్రతీ సినిమాలో శ్రీశ్రీ పాటలు 'చల్లని రాజా ఓ చందమామ!' అనీ, 'ఆకాశవీధిలో అందాలా జాబిలి!' అనో లేదా 'వెన్నెలరేయి ఎంతో చలీ! చక్కనిదానా రావే చెలీ!' అని దాశరథి రాసిన పాటని జలుబు గొంతుతో పి.బి. శ్రీనివాస్ పాడ్డమూ - కాదా 'రావోయి చందమామా! మా వింతగాథ వినుమా!' అనే పింగళి నాగేంద్రరావు గారి పాటనో విరివిగా వినిపించేవి. అసలు చందమామ మీద పాట లేకుండా తెలుగు సినిమాయే లేదు. దాంతో చంద్రగిరి చంద్రబాబుకి తను చచ్చిపోయేలోగా చందమామ దగ్గరికి వెళ్ళాలని అక్కడే తనువు చాలించి చందమామ స్మశానవాటికలో సమాధిమీద తన పేర్న ఒక శిలాఫలకం కట్టించుకోవాలనేదే ఆయన వ్యామోహం, జీవితకాల స్వప్నమూన్నూ!

అది వైజాగ్‌లో యారాడకొండ. డాల్ఫిన్స్ చుట్టూ సముద్రం. విశాఖ బీచ్ టూరిస్టు ప్లేస్ అయిపోయింది. సబ్‌మెరీన్, వార్‌షిప్, స్టార్‌షిప్‌ల ప్రదర్శన. నోవాటెల్ లాంటి స్టార్ హోటళ్ళు, జనసందోహంతో రామకృష్ణాబీచ్ చిన్నసైజు తిరునాళ్ళ జాతరలా కన్పిస్తోంది.

యారాడకొండ లోపల ఒకానొకప్పుడు వేలీ గార్డెన్స్ ఉండేవి. దాన్ని స్థానికులు 'లోవతోట' అని అంటుండేవారు. అక్కడికి పిక్నిక్‌లకు, వనభోజనాలకి వెళ్ళేవారు. ఇప్పుడక్కడ లోయలు లేవు. తోటలు లేవు. చదును ప్రదేశం ఉంది. అక్కడ స్పేస్ రిసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ ఆఫీసు ఉంది. అక్కడ ఆవరణలో ప్రదర్శనకోసం ఒక స్టార్‌షిప్‌ని పెట్టేరు. పెద్దవాళ్ళకి వందరూపాయల టిక్కెట్టు. చిన్నవాళ్ళకి

యాభై. చంద్రబాబుకి స్టార్‌షిప్ (స్పేస్ క్రాఫ్ట్)ని చూడాలనిపించి టికెట్ తీసుకుని లోపలికి ప్రవేశించేడు. అక్కడ పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరును కలిసి తను ఎలాగైనా చందమామ దగ్గరికి వెళ్ళాలని, అక్కడే తన తనువు చాలించాలనే జీవితకాల స్వప్నం గురించి చెప్పేడు చంద్రబాబు.

"ఓకే. అక్కడ మైగ్రేషన్ పర్మిట్ ఆఫీసు ఉంది. అక్కడికి వెళ్ళండి" అన్నాడు పి.ఆర్.ఓ. "వాళ్ళ నిబంధనల ప్రకారం ఆరోగ్యం బావుంటే మీరు చందమామ దగ్గరికి వెళ్ళడానికి ఫిట్‌నెస్ సర్టిఫికేట్ ఇస్తారు" అని కూడా చెప్పేడు. అక్కడే ఓ టేబుల్, కుర్చీ వేసుకుని ఓ మెడికో కన్పించేడు. పల్స్, బి.పి. చెక్ చేసేడు. అవి చాలా అబ్‌నార్మల్‌గా ఉన్నాయని చెప్పాడు మెడికో. 'వాతావరణంలో వేడికీ, ఉప్పు నీటి గాలికీ కొంచెం ఆయాసం, చెమటా పట్టి వుంటాయనీ; అంచేత పల్స్, బి.పి. రీడింగ్స్ అబ్‌నార్మల్‌గా ఉండి వుండొచ్చనీ!' చంద్రబాబు మెడికోతో వాదించేడు. మళ్ళీ పి.ఆర్.ఓ. సలహామేరకి ఆ ప్రక్కనే కేబిన్లో వున్న ఓ హెల్త్ ఆఫీసర్‌ని కల్సి ఓ రెండువేలు ముడుపు చెల్లించుకుని ఎలాగైతేనేం మైగ్రేషన్ ఫిట్‌నెస్ సర్టిఫికేట్‌ని సంపాదించేడు. ఓ వారం పదిరోజుల్లోగా స్టార్‌షిప్ చంద్రమండలానికి బయల్దేరబోతుందని, ఈలోగా తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పేడు చంద్రబాబుకి.

అక్కడ స్టార్‌షిప్ కెప్టెన్ కార్తికేయ, చంద్రబాబుని పలకరించేడు. ఆయాసంతో, అదురుతున్న గుండెతో, పెళుసుబారిపోయిన ఎముకల్తో, స్టార్‌షిప్ టేకాఫ్‌కి ఆయన బక్క శరీరం తట్టుకోగలదా అన్పించింది కార్తికేయకు. "చంద్రబాబుగారు! చందమామ దగ్గరకు వెళ్ళామని ఎందుకంత తాపత్రయపడుతున్నారు ఈ వయసులో!' అనడిగేడు కెప్టెన్ కార్తికేయ. 'ఆ కోరికా, ఆ వ్యామోహం, నా చిన్ననాట మొక్కగా మొలిచి ఇప్పుడా చంద్రలోక యాత్ర వటవృక్షమై కూర్చొంది. మీరు రాకెట్ పైలెట్ అయ్యేరు. నేను విమానాలకి పైలెట్ అయ్యాను. మీది స్పేస్ ట్రావెల్. నేను భూగోళం మొత్తం తిరగేసినా, మరగేసినా రోదసిలో చందమామను చూడలేను కదా! నేను మీకన్నా ఇంచుమించు నలభై ఏళ్ళు పెద్దవాణ్ని! నా చిన్నప్పుడు చందమామ పాటలు వింటూ పెరిగేనే గానీ, మనిషి చందమామ లోగిలికి పోయి అక్కడ ఎంజాయ్ చేసి తిరిగి భూగోళానికి రాగలడనే ఆలోచనే నన్ను పులకరింపజేస్తున్నది. మీరు పుట్టకముందే 1961లో యూరీ గగారిన్ రోదసి చుట్టూతా ప్రదక్షిణలు చేశాడు. 1969లో నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ చంద్రుడి ఉపరితలం మీద కాలుమోపేడు. అప్పట్లో నాకు సైన్స్ సబ్జెక్ట్ అంటే చాలా ఇష్టం. జూల్స్ వెర్న్, H.G. వెల్స్, ఆర్థర్ సి. క్లార్క్, అసిమోవ్ రచనల్ని బాగా చదివేవాణ్ని. నాకో గుడ్డి నమ్మకం ఉండేది. మనవాళ్ళు చంద్రమండలానికి ఎప్పటికైనా రాకెట్లూ, స్పేస్‌క్రాఫ్ట్

పంపిస్తారనీ, నేను చందమామ ఉపరితలం మీద స్పేస్ స్యూట్ తొడుక్కుని స్పేస్‌వాక్ చేస్తాననీ, చందమామ మీద ఓ రౌండ్ వేసి అక్కణ్నుంచి ఆకాశంలో బెలూన్లా వేలాడుతూ మన భూమిని చూడాలని నాదో ప్రగాఢమైన కోరిక. చందమామకి స్పేస్ క్రాఫ్ట్ నడిపే సమయానికి నాకు ముసలితనం మీద పడ్డది. నేను పదిహేను సంవత్సరాల క్రిందటే చనిపోయేవాడిని. నాకు బైపాస్ సర్జరీ జరిగినప్పుడు స్టెంట్ వేసేరు. అది మిస్ ఫైర్ అయింది. అయితే ఆ గుండెలో మంటని గ్రహించి అక్కడ నర్స్ కి చెప్తే, మళ్ళీ ఆపరేషన్ థియేటర్లో రెండో స్టంట్ వేశారు. అలా ఆపరేషన్ తర్వాత బ్రతికిన ఈ పదిహేనేళ్ళు నాకు బోనస్ లైఫే! నేనిప్పుడే చావను. చందమామ దగ్గరకు చేరుకునే వరకు చావను గాక చావను! అది నా విల్ పవర్!!"

అంతా ఓపిగ్గా విన్న కెప్టెన్ కార్తికేయ, "సరే చంద్రబాబు గారూ! మిమ్మల్ని నా స్పేస్‌షిప్‌లో తీసుకునివెళ్తాను. నా పైలెట్ చక్రపాణి మిమ్మల్ని తప్పకుండా చందమామ దగ్గరికి చేరుస్తాడు" అని హామీ ఇచ్చేడు. "వెరీగుడ్ కెప్టెన్. మీరు తప్పకుండా సాయం చేస్తారని తెలుసు!" అని చంద్రబాబు గుండె నిండా నిండిన ఉత్సాహంతో టౌన్‌హాల్ బీచ్ అప్రోచ్ రోడ్డువేపు కారును పోనిచ్చాడు. కార్లో మగత నిద్ర. అప్పుడు తనకి ఆరో.. ఏడో.. ఏళ్ళుంటాయి. డాబా మీద చాప వేసుకుని, వెల్లకిలా పడుకుని, నల్లని శాటిన్ తెరలాంటి ఆకాశంలో మిలమిల మెరిసే చుక్కల్నీ, వెన్నముద్దలా గుండ్రంగా కన్పించే బెలూన్ని చూపించి, తండ్రిని అవేమిటని? అడిగితే అవి నక్షత్రాలు అనీ, అది చందమామ అని చెప్పేడు. 'అవెక్కడ్నుంచి వస్తాయి నాన్నా' అనడిగితే 'ఏమోరా! నాక్కూడా తెలియదు. బహుశా ఆకాశంలోంచి పుట్టుకుని వస్తాయి కాబోలు!" ఇంతలో సతీమణి నయనతార "ఏవండోయ్! ఆ దిక్కుమాలిన చందమామ మీద ఉయ్యాలలూగుతూ కింద భూదేవిని చూడ్డానికి ఇల్లు కట్టుకోడానికని దాచిన పి.ఎఫ్. డబ్బునీ తగలేస్తారా?" అని సాధింపు. 'అదికాదే! అదేం పిచ్చి మరుపు కాదే!! ఇదేం ఎడ్లబండీ సైకిల్ యుగం అనుకుంటున్నావా? ఇక లూనాలూ, మారుతీకారూ కనుమరుగైపోతాయి. ఇక రాకెట్లదీ, స్టార్‌షిప్‌లదే రాజ్యం! ఇకమనకి లాభాలే లాభాలు!!" అని కలవరిస్తూ ఇంటికి చేరుకున్నాడు చంద్రబాబు. ఆ రాత్రంతా చంద్రబాబుకు కంటిమీద కునుకులేదు. తెల్లారేదాకా శివరాత్రి జాగారం చేస్తూ ఆకాశవీధిలో మబ్బుల చాటున పరుగులిడే చంద్రుడ్ని చూస్తూ ఉండిపోయేడు.

స్పేస్ గెలాక్సీ క్లబ్‌లో కెప్టెన్ కార్తికేయ, పైలెట్ చక్రపాణీ చంద్రబాబు కూర్చొని తీరిగ్గా సిగరెట్లు కాలుస్తూ పిచ్చాపాటి జరుపుతున్నారు. "చంద్రబాబు గారూ! మీలా

కోటీశ్వరులవ్వాలంటే మాలాంటి కుర్రాళ్ళు ఏం చెయ్యాలంటారు?" అనడిగేడు పైలెట్ చక్రపాణి. "నా జీవితంలో నేనెప్పుడూ ఏ అంబానీయో, ఎలాన్ మాస్కో అవాలని కోరుకోలేదు. పైలెట్‌గా రిటైరయ్యాక రియల్ ఎస్టేట్‌లో తలదూర్చేను. అది క్లిక్ అయింది. అంతా ఆటోమెటిక్‌గా జరిగిపోయింది. అయితే నన్ను నేను శతమానంభవతి అని పదేపదే అనుకుంటాను. నా జీవితకాల స్వప్నం చంద్రయానం! చంద్రుణ్ణి చేరుకుని, వీలైతే అక్కడ ఓ చిన్న అపార్ట్ మెంట్ కట్టుకుని శేష జీవితం గడిపి అక్కడే కీర్తి శేషుడవాలనేదే నా ప్రగాఢమైన కోరిక! అదే నా జీవనా సాఫల్య పురస్కారం!!" అంటూ ఆయాసంగా ఛాతి మీద రుద్దుకుంటున్నాడు. చంద్రబాబు మొహం తెల్లగా పాలిపోయింది. వెంటనే పైలెట్ చక్రపాణి, చంద్రబాబు షర్ట్ జేబులోంచి బి.పి. టాబ్లెట్ తీసి మంచినీళ్ళ గ్లాసు అందించేడు, ఇన్‌హేలర్ వాసన చూపించేడు. చంద్రబాబు స్పృహలోకి వచ్చేడు.

> నా జీవితకాల స్వప్నం చంద్రయానం! చంద్రుణ్ణి చేరుకుని, వీలైతే అక్కడ ఓ చిన్న అపార్ట్ మెంట్ కట్టుకుని శేష జీవితం గడిపి అక్కడే కీర్తి శేషుడవాలనేదే నా ప్రగాఢమైన కోరిక! అదే నా జీవనా సాఫల్య పురస్కారం!!

అప్పుడు పైలెట్ చక్రపాణి "కార్తికేయ గారూ! చంద్రబాబు గారిని ఈ పరిస్థితిలో మూన్ ట్రిప్‌కి తీసుకెళ్ళలేమండీ!" అన్నాడు.

"ఎందుకు?" అడిగేడు కెప్టెన్ కార్తికేయ.

"మనం గనక తీసుకెళ్తే బ్రహ్మహత్యా పాతకం మనకు చుట్టుకుంటుందేమో!" అన్నాడు సాలోచనగా చక్రపాణి.

"కావచ్చు! అది తన దృఢనిశ్చయం. ఆయన జీవితకాల స్వప్నం! నీకు కూడ తెల్సుకదా! అదీకాక తను మన ప్రాస్పెక్టివ్ కస్టమర్ కదా!" అన్నాడు కెప్టెన్ కార్తికేయ.

"అయినా మనకి వీలుకాని పని. చంద్రబాబుని మన మూన్ ట్రిప్‌లో తీసుకువెళ్ళలేము!" అన్నాడు పైలెట్ చక్రపాణి.

"మనకి దేనితో, ఎవ్వరితో సంబంధం లేదు. విమానాల్లో పురుడు పోసుకోవడం, హార్ట్ ఎటాక్ తో బకెట్ తన్నేయడం వినడం లేదా! చంద్రబాబు అల్రెడీ కోట్లరూపాయల్లో ఇన్వెస్ట్ చేసేడు. ఈ ప్రజాస్వామ్య వ్యవస్థలో ఆయన జీవితాన్ని చంద్రయాత్రకి పణంగా పెట్టొద్దని చెప్పడానికి మనమెవరం?!" అన్నాడు ఏకధాటిగా కార్తికేయ.

"అయిన సరే, ఎందుకో నా మనసు ఒప్పుకోవడం లేదు సార్! ఆయన తొంభై ఏళ్ళు నిండిన తొక్కులాగున్నాడు!" అన్నాడు పైలట్ చక్రపాణి.

"అయితే ఇప్పుడేం చెయ్యమంటావ్? ఆయన మదుపుపెట్టిన కోట్లాది రూపాయల్ని వాపసు చేసి, ఆయన్ని టౌన్‌హాల్ బీచ్ ఒడ్డున పడేయమంటావా! గుండె బాదుకుంటూ సముద్రం లోలోపలికి పిచ్చిగా పరుగెడుతూ ఆత్మహత్యకి పురికొల్పుతావా?" అన్నాడు ఆవేశంగా కెప్టెన్ కార్తికేయ.

"నా ఉద్దేశ్యం అదికాదు సార్!"

"అయితే రెండోమాట ఆలోచన లేకుండా మూన్‌ట్రిప్ ఏర్పాట్లు చూసుకో! నేను చెక్ చేస్తాను" అన్నాడు కార్తికేయ.

అంటే చంద్రబాబు చంద్రయాత్ర ఖాయం చేసినట్టే అన్నమాట అనుకున్నాడు పైలట్ చక్రపాణి.

ఆ మర్నాడు పొద్దున్నే ఒక పాత డొక్కు జీపు స్పేస్ క్లబ్ ఆవరణలో ఆగింది. దాంట్లోంచి ఓ భారీకాయం దిగింది. కెప్టెన్ కార్తికేయ ఎదురెళ్ళి ఆహ్వానించబోతుంటే "నేను స్పేస్ విజిలెన్స్ ఆఫీసర్ వినాయకరావుని! మీరు కెప్టెన్ కార్తికేయ కదూ! నా దగ్గర మీ మీద అరెస్ట్ వారెంట్ ఉంది!"

"నేరమేమిటో!" అన్నాడు కార్తికేయ.

"స్పేస్ ఏవియేషన్ రూల్స్ ని అతిక్రమించేరు"

ఇంతలో చక్రపాణి వచ్చి "ఏమైంది సార్?" అనడిగేడు.

"మీరు పైలెట్ చక్రపాణి కదూ? మీ మీద కూడా నా దగ్గర అరెస్ట్ వారెంట్ ఉంది!" అన్నాడు వినాయకరావు.

"అంతేకాదు, మీ స్పేస్ షిప్ 'చంద్రమౌళి' ని కూడా సీజ్ చెయ్యమని కోర్టు ఉత్తర్వులు ఉన్నాయి!" అన్నాడు విజిలెన్స్ ఆఫీసర్ వినాయకరావు.

"మా దగ్గర స్పేస్ షిప్ లేదే!" అన్నాడు కెప్టెన్ కార్తికేయ.

"సరే! ట్రేస్ చేసి సీజ్ చేస్తాము గానీ, చంద్రబాబు గారు ఎక్కడ ఉన్నారు.

ఆయన మీద కూడా అరెస్ట్ వారెంట్ ఉంది!" అన్నాడు వినాయకరావు.

కెప్టెన్ కార్తికేయ వారిస్తున్నా వినిపించుకోకుండా "అదుగో మీ వెనకాలే చంద్రబాబు ఉన్నాడు" అన్నాడు పైలట్ చక్రపాణి.

వినాయకరావు వెనక్కి తలతిప్పి తొంభై ఏళ్ళ చంద్రబాబుని చూసి హఠాత్తుగా కుప్పకూలిపోయేడు. ఈ అనుకోని సంఘటనకి తలపట్టుకుని రుద్దుకున్నాడు పైలెట్ చక్రపాణి.

'చంద్రమౌళి' అదే చంద్రయానానికి సిద్ధం చేసి వుంచిన స్పేస్ క్రాఫ్ట్ లాంజ్‌లో కూర్చున్న చంద్రబాబుని పైలట్ చక్రపాణి స్పేస్ క్రాఫ్ట్ టేకాఫ్ లోకి తీసుకువెళ్ళాడు. అతనికి కేటాయించిన బెర్త్ మీద పడుకోబెట్టి, సేఫ్టీ బెల్టు పెట్టేడు. "ఓకే కెప్టెన్" అన్నాడు చక్రపాణి. స్పేస్ క్రాఫ్ట్ తీసుకుంటోంది. స్పేస్ క్రాఫ్ట్ వేగం పుంజుకుని రోదసిలో సాగిపోతున్నది.

"చంద్రబాబుగారు ఎలాగున్నారు?" అడిగేడు చక్రపాణి.

"ఓకే, ఫైన్ చక్రపాణి!" అన్నాడు చంద్రబాబు.

"స్పేస్ క్రాఫ్ట్ బాగా వేగం పుంజుకుంది. ఇంక ఫర్వాలేదు. మీరు బెడ్ మీద హాయిగా రిలాక్స్ అవ్వండి." అన్నాడు చక్రపాణి.

"సరే అలాగే కానీ. కొంచెం కిటికీవేపు పడుకోబెడతారా? కిటికీలోంచి భూదేవిని చూస్తాను" అన్నాడు చంద్రబాబు.

"ఇప్పుడప్పుడే కన్పించదు. స్పేస్ క్రాఫ్ట్ ఒక టర్న్ కొట్టాలి. ఈలోగా ఈ కామ్‌పోజ్ టాబ్లెట్ వేసుకుని పడుకోండి" అన్నాడు చక్రపాణి.

"లేదు.... లేదు... భూదేవిని చూసేవరకు నేను మేలుకొనే వుంటాను" అన్నాడు చంద్రబాబు.

"ఓకే! మీ యిష్టం" అన్నాడు చక్రపాణి. తన పైలెట్ సీటుకేసి వెళ్ళిపోయాడు.

"ఎలా వున్నాడు మన చంద్రబాబు?" అడిగేడు కార్తికేయ.

"ఇంకా బతికే వున్నాడు. కానీ పరిస్థితి విషమంగా ఉంది!"

"అంటే?!" అన్నాడు కార్తికేయ.

"ఒకటో, రెండో రొమ్ము ఎముకలు, మోచేయి, మోకాలు ఎముకలు స్పేస్ క్రాఫ్ట్ టేకాఫ్ తీసుకున్నప్పుడు పుటుక్కుమన్నాయేమోనని



డౌటు! గుండెకాయ మస్తుగా అదురుతోంది. చంద్రమండలం చేరేవరకు ఊపిరితో ఉంటాడా అని సందేహం!" అన్నాడు చక్రపాణి.

"ఉంటాడు చక్రపాణి! చాలా గట్టిపిండం" అన్నాడు కార్తికేయ.

"గట్టిపిండమా? ఊరపిచ్చికలాగ వణికిపోతున్నాడు"

"నా ఉద్దేశ్యం ఉక్కు మనిషని కాదు. ఉక్కు మనసని. చంద్రబాబు విల్‌పవర్ చాలా ధృడమైనది!"

స్పేస్ క్రాఫ్ట్ ఫ్రీ ఆర్బిట్‌లో ఉంది. చంద్రబాబు మేలుకునే ఉన్నాడు. అతని కోరిక ప్రకారం కిటికీ వేపు చూసే విధంగా బెర్తుని అడ్జస్టు చేశాడు చక్రపాణి. చంద్రబాబు తన ముసలి శరీరం బాధల్ని పట్టించుకోకుండా త్వరలో చేరబోయే చంద్రమండలంలో రాజఠీవితో ఉరకలు పెడుతున్న పెద్ద చంద్రబింబాన్ని చూస్తున్నాడు. పెద్ద పున్నమి చంద్రుళ్ళు, పెద్ద వెన్నముద్దలా వెలిగిపోతున్నాడు! కిందికి చూసేడు. ఇక్కడ్నుంచి భూదేవి నీలి చందమామలా ధగధగలాడుతోంది. ఎత్తైన పర్వతాలూ, అగాధమైన సముద్రాలూ, తాచుపాములా సుడులు తిరుగుతున్న పొడవైన నదీనదాలు, గ్రీన్ కార్పెట్‌లా కన్పిస్తున్న దట్టమైన అడవులూ స్పష్టంగా కన్పిస్తున్నాయి. అవిగో! మంచు దుప్పటి కప్పుకున్నట్లున్న హిమగిరి సొగసులు, అల్లదుగో! భూతలస్వర్గం - కైలాస పర్వతం, ఆ పక్కనే మానస సరోవరం, ఆ ప్రక్కనే హిమానీ నదాల్లోంచి పుట్టి, దేవప్రయాగ దగ్గర సంగమించిన అలకనంద భాగీరథి నదులు. అంతర్లీనంగా ప్రవహిస్తున్న సరస్వతి. అక్కణ్ణుంచి గంగగా మారి వారణాసిని చేరుకున్న గంగానదీమతల్లి. వారణాసిలో కొలువుదీరిన విశ్వనాధుడు. ఇలలో చూడనివన్నీ చంద్రలోకంలోంచి చూస్తున్నాడు.

మళ్ళీ నీలాకాశంలో తెల్లని పెద్ద వెన్నముద్దలా కన్పిస్తున్న చందమామ నక్షత్రాలు కొంచెం స్పష్టంగా తళతళమని మెరుస్తున్నాయి. వాటిని కన్నార్పకుండా చూస్తున్నాడు చంద్రబాబు.

స్పేస్ క్రాఫ్ట్ చంద్రమండలం మీద వాలింది. చంద్రబాబుకి ముక్కులోంచి రక్తం కారుతోంది. నోటినించి తెల్లని నురుగ. బెర్త్ మీంచి లేవడానికి కెప్టెన్ కార్తికేయ, పైలెట్ చక్రపాణి సాయం చేస్తున్నారు.

"ఏదీ నా స్పేస్ స్యూట్ ఎక్కడ?" చంద్రబాబు అరుస్తున్నాడు.

"నెమ్మది! నెమ్మది! అప్పుడే మీరు కదలకూడదు. మీ ఆరోగ్య పరిస్థితి చెక్ చేసి ప్రాథమిక చికిత్స చెయ్యాలి" అన్నాడు చక్రపాణి.

"లేదు. నాకు ముందు స్పేస్ స్యూట్ ఇవ్వండి. ఆ తర్వాతే చికిత్స"

ఇక లాభం లేదనుకుని స్పేస్ స్యూట్ తెచ్చేరు. ఎడమ మోకాలు సరిగ్గా పనిచెయ్యడం లేదు. కుడిచెయ్యి సహకరించడం లేదు. ఇద్దరు కలిసి స్పేస్ స్యూట్ తొడిగి, హెల్మెట్ పెట్టి స్పేస్ క్రాఫ్ట్ దగ్గర చదునుగ ఉన్న స్థలంలో కూర్చోబెట్టారు. తల దగ్గర ఒక శిలాఫలకం సపోర్టు ఉంది.

"మీరిక్కడ చందమామ అందాల్ని ఆస్వాదిస్తూ ఉండండి. ఈలోగా మూన్‌సిటీకి వెళ్ళేందుకు ట్రెక్కర్‌ని తెస్తాము!" అన్నాడు చక్రపాణి.



చంద్రబాబు వాళ్ళకి బై చెప్పి చంద్రుడి ఉపరితలం మీద ఇసుకని ప్రేమతో ఆప్యాయంగా ముద్దుపెట్టుకున్నాడు. చంద్రమండలం మీద తక్కువ ఒత్తిడికి శరీరం గాలిలో తేలుతున్నట్టు అన్పించింది. ఇప్పుడు తనకి చాలా మనశ్శాంతిగా ఉంది. తన జీవితకాల స్వప్నం నెరవేరింది. తను చంద్రుడి ఒడిలో చంద్రుడి మట్టిమీదే ఉన్నాడు. తన జన్మ ధన్యమైంది అనుకుంటూ చందమామ ఒడిలోకి నిస్పహాయంగా ఒరిగిపోయేడు చంద్రబాబు. చంద్రమౌళిలో ఐక్యమైపోయేడు!

**సూచన:**

ఛీఫ్ అకౌంటెంట్ గా పదవీవిరమణ చేసిన కీ. శే. జగన్మోహనరావు గారు మంచి రచయిత; సైన్స్ ఫిక్షన్ రాయడంలో దిట్ట. "చందమామ రావే" అనే ఒక మంచి సైన్స్ ఫిక్షన్ ని ప్రకాశిక కోసం పంపారు. ఈ కథ వెలుగు చూడకుండానే 2021 మే 4వ తేదీన హైదరాబాదులో గుండె పోటుతో కనుమూశారు. వారి చివరి రచనగా భావించబడే ఈ కథను 'ప్రకాశిక' పాఠకులకు అందిస్తున్నాం.

పాడిపంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటు పడవోయ్
తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్,
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్ !

